# రాణి మంగమ్మ

(చారిత్రిక నవల)

డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ



క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి • విజయవాడ 2.

క్వాలిటీ ప్రచురణ
ప్రథమ ముద్రణ :
మార్చి, 1995

వెల : రూ. 30-00

రచన :
డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ

ముద్రణ :
వెంకట సత్య ప్రింటర్స్
విజయవాడ-3

# సమర్పణ

తెలుగు మాటకు తమిళనాడున
నిలువనీడను కలుగజేసిన
మహితచరితులు మధురనాయక
నృపవరేణ్యుల జనహిత చింతనకు.

# ముందుమాట

దక్షిణాది తెలుగువారిని గురించి తెలుగువారికి అంతగా తెలియదనడం సత్య సన్నిహితం. అందులోనూ మధురనేలిన మహారాణి మంగమ్మను గురించి విద్యాధికులకు కూడా తెలిసిన విషయాలు చాలా తక్కువే అనడం అతిశయోక్తి కాదు. ఈ పరిస్థితిలో ఆ మహారాణికి సంబంధించిన యీ చారిత్రాత్మక నవలను ప్రచారంలోకి తీసుకురావడానికి ముందుకు వచ్చిన క్వాలిటీ పబ్లిషర్స్ అధినేతలూ సహృదయులూ అయిన శ్రీ కప్పగంతుల మురళీకృష్ణగారికి నేను కృతజ్ఞుణ్ణి! ఆ విధంగా దక్షిణాంధ్రుల ప్రాభవాన్నీ ప్రశస్తినీ నలుగురికీ తెలియజేయడానికి సహకరించిన శ్రీ మురళీకృష్ణగారి పెద్దమనసుని మరొకతూరి కొనియాడుతున్నాను. నా కృషి పాఠకుల్ని అలరిస్తుందని ఆశిస్తున్నాను.

ముఖపత్ర చిత్రం గురించి రెండు మాటలు.

మధురలో మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయంలో చెట్టియప్పనాయకర్ అనే సహృదయుడు 1565లో ఒక చిన్న మండపం నిర్మించాడు. దీన్ని ఊంజల్ (ఉయ్యాల) మండపం అని వ్యవహరిస్తారు. ప్రతి శుక్రవారం అక్కడ అమ్మవారి అయ్యవారి స్వర్ణ విగ్రహాలు ఉయ్యాలలో ఉంచి ఊపేవారు అందువల్ల ఆ మండపానికి ఆ వ్యవహారనామం ఏర్పడింది.

ఈ మండపం వితానకంలో (పై భాగం) మంగమ్మగారి కాలంలో కనులవిందు గొలిపేలా చిత్రించబడిన వర్ణచిత్రాలు అందాలు దిద్దుకున్నాయి. ఆ చిత్రాలలో మంగమ్మగారూ ఆమె మనుమడు విజయరంగ చొక్కనాథ నాయకుడూ దర్శనమిస్తారు. 'మహారాజమాన్య మహారాజశ్రీ మంగమ్మగారు' అని తెలుగులోనూ తమిళంలోనూ చిత్రకారుడు వ్రాయడం గమనించదగిన విషయం. ఈ రమణీయ చిత్రాన్ని దయతో అందజేసిన తమిళనాడు ప్రభుత్వ పురాతత్వ శాఖవారికి బహుధా కృతజ్ఞుణ్ణి.

మధుర,
6-1-1995

—చల్లా రాధాకృష్ణ శర్మ

# రాణీ మంగమ్మ

ఉన్నట్టుండి వెలుతురు మటుమాయమైంది, పెనుగాలికి ఆరిపోయిన దీపంలా.

కాటుక పులిమినట్లుగా కనిపించింది ఆకాశం.

కలకలలాడే మధురానగరం వెలవెలబోయింది. పసుపు కుంకుమలు కోల్పోయిన పడతిలా.

రాజవీధులలో స్త్రీ పురుషులు గుంపులు గుంపులుగా కనిపిస్తారు: గుసగుసలుపోతున్నారు. అవ్యక్తమైన బాధ, సంతాపం వారి గుసగుసల్లో తలదాచుకున్నాయి. ఎవరిని చూసినా శోకమూర్తులే! ఎవరినోట విన్నా అదే మాట! రాజకుటుంబానికి సంబంధించిన ఆ మాటే!

సందు గొందుల్లో అయితే అప్పుడే వాదప్రతివాదాలు చెలరేగుతున్నాయి.

"కలికాలం! కాకపోతే యీ విడ్డూరం ఎన్నడైనా విన్నామా, కన్నామా!" సందు ముసలినోట వెలువడిన మాటయిది. వృద్ధుడు తన మనోవేదనను తనలోనే యిముడ్చుకోలేకపోతున్నాడు.

వృద్ధుని మాటలు వినేకొద్దీ చెంతనున్న యువకునిలో ఉడుకు నెత్తురు పొంగసాగింది.

"ఏముంది యిందులో విడ్డూరం! భర్త మరణిస్తే, భార్యను చితి నెక్కమనడం ఆటవిక లక్షణం. భార్యపోయిన వెంటనే, భర్త మాత్రం పెళ్ళికొడుకు కావచ్చు కాబోలు!"

తరుణ వయస్కుని మాటలు వృద్ధునికి ఈటెపోటులుగా వినవచ్చాయి.

"బాబూ, నీకు తెలియదు రాజకుటుంబాలలోని ఆచార వ్యవహారాలు తెలిస్తే నువ్విలా మాట్లాడవు."

"మీకు తెలిసినన్ని విషయాలు నాకు తెలియవు. నిజమే! నాడు తంజావూరు మహారాజు విజయరాఘవనాయనయ్యవారు స్వర్గస్థులైనప్పుడు అంతఃపుర స్త్రీలందరూ చితి పేర్చుకుని ప్రాణత్యాగం చేశారు. ఇక మధురనేలిన ముద్దు తిరుమల శౌరినాయనయ్యవారు దైవికం చెందినప్పుడు, ఆయన భార్యలు ఇన్నూరుమంది సహగమనం చేసినట్లు అప్పుడప్పుడు మాటల్లో మా తాతగారు చెప్పేవారు. అలాగే రామనాథపురం పరిపాలించే సేతుపతి రాజుల్లో కూడా ఈ ఆచారం వుంది. కనక రాజ కుటుంబాలలో సహగమనం పరిపాటే అయినా...."

యువకునికి యిన్ని విషయాలు తెలుసునని వృద్ధుడు ఊహించలేదు; ఆశ్చర్యచకితు డయ్యాడు. ఆశ్చర్యంలోంచి ఆయన తేరుకోకముందే, యువకుడు యిలా అన్నాడు.

"మన మహారాణి మంగమ్మగారి సంఘసంస్కార ప్రియత్వం, సాహసం మరెవ్వరిలోనూ కంచుకాగడాపట్టి వెతికినా కనిపించవు." అతని కళ్ళల్లో ఏదో ఒక వెలుగు!

మహారాణిగారి పేరు వినగానే, వృద్ధుడు మౌనముద్ర వహించాడు. అవనత వదనుడయ్యాడు.

ఆయన్ని ఎలాగైనా మాటల్లోకి దించాలనుకున్నాడు యువకుడు.

"ఏం తాతగారూ, ఉన్నట్టుండి మూగనోము పట్టారు?"

అప్పటికీ వృద్ధుడు పెదవి కదపలేదు.

"మహారాణిగారంటే భయమా మీకు?"

వృద్ధుని కోపమంతా ఒక్కసారి వెలికి వచ్చింది: కొత్త నీటితో పాటు కొట్టుకువచ్చే చెత్త చెదారంలా. శరీరానికే వార్ధక్యం కాని మనస్సుకి కాదన్నట్లుగా కనిపించాడు.

## రాణి మంగమ్మ

"మంగమ్మగారు స్త్రీ కాదు!"

యువకుడు ఉలిక్కిపడ్డాడు.

"ఆవిడ మహా మహారాణిగారు. కనక ఎవ్వరూ వేలెత్తుమాట అనలేక పోయారు. ఆవిడ చరిత్ర స్త్రీ జాతికే కళంకం."

యువకుని సహనం నశించింది.

"ఆవిడ సహగమనం చెయ్యలేదనే గదా మీ కోపం, ద్వేషం...."

"అనూచానంగా వస్తున్న ఆచారాన్ని అతిక్రమించింది రాజకుటుంబం మర్యాదను మంట గలిపింది."

"కాదు, ఒక ఆదర్శంగా నిలిచింది."

"సంప్రదాయాన్ని అతిక్రమించడమే ఆదర్శం కాబోలు!"

వృద్ధుని మాటల్లో తొంగిచూస్తున్న అసహనాన్ని, అధిక్షేపాన్ని యువకుడు గుర్తించకపోలేదు. అయినా వయస్సుకి మర్యాద యివ్వడం సభ్యతగా భావించాడు.

"మీరన్నట్లుగా మంగమ్మగారి చరిత్ర స్త్రీ జాతికి కళంకం కాదు. తాతగారూ.... గర్వ కారణం! సంప్రదాయం పేరుతో అర్థం పర్థంలేని ఆచారాలను మహారాణిగారు నిరసిస్తున్నారు. అలాగే అంధ విశ్వాసాలను బాహాటంగా ప్రతిఘటిస్తున్న సాహసురాలు. తాను అబలననీ, నిస్సహాయురాలననీ ఎన్నడూ అనుకోలేదు. ధైర్యసాహసాలతో సంచరిస్తున్నారు కనుకనే, మనం గుడ్డిలో మెల్లగానైనా యుద్ధభీతి లేకుండా జీవించగలుగుతున్నాం."

"అదంతా ఆమె రాజ్యకాంక్ష!"

యువకుడు నిర్ఘాంతపోయాడు, వృద్ధునిలో మహారాణి పట్ల గూడు కట్టుకున్న ద్వేషభావం చూసి.

"రాజా చొక్కనాథనాయనయ్యవారు స్వర్గస్థులైన పిదప, సహగమనం ఆచరించకుండా రాజ్య వ్యవహారాలు పర్యవేక్షిస్తున్నదంటే, అది మంగమ్మగారి రాజ్యకాంక్షగాక మరేమిటి?" ప్రశ్నించాడు వృద్ధుడు.

"అదీ మహారాణిగారి రాజ్యకాంక్ష అని ఎందుకనుకోవాలి ? అది రాజ్యాభిమానం కాకూడదా ?"

"అవునవును, రాజ్యాభిమానమే !" మాటలో వెటకారం కాన వచ్చింది.

"మీరేమనుకున్నాసరే, అది ఆమె రాజ్యాభిమానమే. రాజా విశ్వనాథనాయనింవారు, ముద్దు తిరుమలశౌరినాయనింవారు మొదలైన మహారాజులు అష్టకష్టాలుపడి మన రాజ్యాన్ని అభివృద్ధి చేశారు. విశ్వనాథ నాయనయ్యవారు ఎంత శ్రమించారో నలుగురికీ తెలిసిన విషయమే. ఆయన అడుగుపెట్టిననాడు మధురానగరం పూజా పురస్కారాలు లేక బూజుపట్టిన పాడుగుడిలా వుండేది. ఎక్కడ చూసినా చిట్టడవులే కనిపించేవి. దుష్ట మృగాలు విచ్చలవిడిగా తిరుగుతూ వుండేవి. చోర భయానికి కొదువలేదు. గుళ్ళు గోపురాలు కళావిహీనములై వుండేవి. దుర్గాలు శిథిలావస్థలో వుండేవి. ఆ మహానుభావుడు చిట్టడవుల్ని ఛేదించి గ్రామాలు నిర్మించాడు. వన్యమృగాల భయాన్ని తొలగించాడు. చోరభయం లేకుండా చేశాడు. పాడుబడ్డ గుళ్ళు గోపురాలను సముద్ధరించాడు. మధురను నివాసయోగ్యంగా తీర్చిదిద్దాడు. అయినా ప్రాచీన పాండ్యరాజుల సంతతికి చెందినవారు ఆయన మీద కత్తికట్టారు. ఇక తిరుమలశౌరినాయనింవారు చేసిన దానధర్మాలు, కట్టిన గుళ్ళు గోపురాలు, నిర్మించిన సుందర భవనాలు మన కళ్ళల్లో మెదులుతున్నాయి. ఆయన నిర్మించిన సుందర మహలుని ఆ ఆదిశేషుడు కూడా పూర్తిగా కీర్తించలేడు. అలాంటి మహనీయులు అభివృద్ధి పరిచిన మధురనాయక రాజ్యాన్ని అభిమానించి, శక్తియుక్తుల ధారపోసి యింకా అభివృద్ధిలోకి తీసుకురావాలని అహోరాత్రమూ పాటు పడుతున్న మహారాణి మంగమ్మగారికి వున్నది రాజ్యకాంక్ష లేక రాజ్యాభిమానమా ! తన పూర్వుల్ని వివేకవంతుడు ఎన్నడూ విస్మరించడు !" అని దీర్ఘోపన్యాసమే చేశాడు యువకుడు.

యువకుణ్ణి లోలోన మెచ్చుకున్నాడు వృద్ధుడు. అతను చెప్పినవన్నీ సత్యములే. పైగా అసంగతమేమీ కనిపించలేదు ఆ విషయాలలో. వృద్ధుని కోపం కొంచెం చల్లారింది.

"విశ్వనాథనాయనింవారూ తిరుమలశౌరి నాయనింవారూ మొదలైన మహారాజులు ఎంతో సేవ చేశారు. ఆ సేవను కాదనడం లేదు. రాజా చొక్కనాథనాయనింవారు ఎంత గొప్పవారని! తీరిక దొరికినప్పుడల్లా ఆ మహారాజు భాగవత రామాయణ గ్రంథ కాలక్షేపం చేసేవారు...."

"ఇంతకూ చొక్కనాథనాయనయ్యవారి మరణానంతరం మంగమ్మ గారు సహగమనం చెయ్యకపోవడం మీకు మహాపచారంగా కనిపిస్తున్నది. అంతేనా!" అన్నాడు యువకుడు.

"అందులో సందేహ మేమిటి?"

యువకుడు తన వాదధోరణి అంగీకరిస్తూ మాట్లాడినట్లు భావించాడు వృద్ధుడు. అందుచే సంబరపడిపోయాడు. ఆ సంబరంలో ఆయన మునిగిపోయాడు.

"తాతగారూ!"

"ఏమిటి బాబూ!" ఆప్యాయంగా అడిగాడు వృద్ధుడు.

"చొక్కనాథనాయనయ్యవారి మరణానంతరం మంగమ్మగారు సహగమనం ఆచరించకపోవడం మీవంటివారికి మహాపచారంగా కనిపించవచ్చు. కాని ఆమె ప్రదర్శించిన విజ్ఞత అస్మదాదులకు ఆశ్చర్యావహంగా కనిపిస్తున్నది...."

విసుగ్గా అన్నాడు వృద్ధుడు. "ఏమిటో బాబూ, నీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు. రాజుగారి మరణానంతరం సహగమనం చెయ్యని రాణి విజ్ఞురాలా! కలికాలం!"

"రాజా చొక్కనాథనాయనింవారు మరణించేనాటికి వారి కుమారుడైన ముద్దు వీరప్పనాయనింవారు ఎన్నేళ్ళవారని మీ వుద్దేశం?"

"ఆయన అప్పుడు బాలుడు ?"

"అంటే, ఎన్నేళ్ళవాడని ?"

"ఏడేళ్ళవాడో, ఎనిమిదేళ్ళవాడో."

"అంత చిన్నతనంలో ముద్దు వీరప్పనాయనింవారు రాజ్యానికి వచ్చారా మరి !"

"ఇందులో ఆశ్చర్యం ఏముంది ? చొక్కనాథనాయనింవారు కూడా చాలా చిన్నతనంలోనే రాజ్యానికి వచ్చారు."

"తాతగారూ, మీరన్నది నిజమే. కాని ఆయన్ని రాయసంగారూ, దళవాయిగారూ, మంత్రులూ మొదలైనవారు ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించిన విషయాన్ని అప్పుడే మీరు మరచిపోయినట్టు న్నారు...."

"మరిచిపోవడమా ! పాపం, ఆయన్ని ఆ మలిన మనుస్కులు హత్య చెయ్యడానికి కూడా సాహసించారు.... ఇప్పుడా విషయాలన్నీ ఎందుకు బాబూ ?"

"అదే మన మహారాణిగారి విజ్ఞత !"

వృద్ధుడు నిరుత్తరుడయ్యాడు.

"తన భర్తకు పట్టిన దురవస్థ తన కుమారుడికి కలగకూడదనే ముందు చూపుతో మంగమ్మగారు వ్యవహరించారు. ఎందుకంటారు ? రాజ్యక్షేమం కోసం ! రాజు బలహీనుడైనప్పుడల్లా దుష్టచిత్తులైన మంత్రులూ దండనాథులూ కలిసి ప్రజల్ని ఎలా పీక్కుతిన్నారో మీవంటి వయోవృద్ధులకు తెలియంది కాదు."

"నువ్వెన్ని చెప్పు బాబూ, మంగమ్మగారు సహగమనం చెయ్యక పోవడం అనుగతంగా వస్తున్న ఆచారాన్ని అతిక్రమించడమే. ఆచారోల్లంఘనం పాపహేతువు."

"మంగమ్మగారు కనక యితర మహారాణుల్లా సహగమనం చేసి

వుంటే, మన రాజ్యం యీపాటికి ఛిన్నాభిన్నమై వుండేది. ముద్దు వీరప్ప నాయకయ్యవారి జీవితం సవ్యంగా సాగి వుండేది కాదు. మనం యెన్నో యాతనలు అనుభవిస్తూ వుండేవాళ్ళం."

"అపుననుకో.... అయినా...."

"మంగమ్మగారు ప్రదర్శించిన విజ్ఞతవల్ల, రాజనీతిజ్ఞతవల్ల మన రాజ్యంలో శాంతిభద్రతలు సుస్థిరంగా వున్నాయి. లేకుంటే రాజ్యం ముక్కలు చెక్కలై విస్తరాకే" అన్నాడు యువకుడు సంతృప్తిగా.

కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి.

ఆలోచనా నిమగ్నుడయ్యాడు వృద్ధుడు. ప్రశాంతచిత్తుడయ్యాడు యువకుడు.

అలముకున్న మౌనాన్ని ఛేదించేలా, "తాచెడ్డ కోతి వనమెల్లా చెరిచిందట!" అన్నాడు వృద్ధుడు.

"మంగమ్మగారి పట్ల మీ కోపం యింకా చల్లారలేదన్న మాట!"

"బాబూ, ఎలా చల్లారుతుంది? కోడలు ముద్దమ్మగారు ఎంత మంచిది! ఆమెను చూసైనా రాణిగారు సంప్రదాయాన్ని గౌరవించటం నేర్చుకోవాలి!"

"తాతగారూ సంప్రదాయం పేరుతో మీరు మంచిచెడ్డలు కూడా మరిచిపోతున్నారు."

"అంటే, ముద్దమ్మగారు యిప్పుడు సహగమనానికి పూనుకోవడం నీకు చెడుగా తోచిందన్నమాట!"

"ఆవిడ యిప్పుడు సహగమనానికి సంసిద్ధురాలు కావడం ముమ్మాటికీ తప్పే" అన్నాడు యువకుడు కుండ బద్దలుకొట్టినట్టుగా.

"ఎంతమాట!" నిర్ఘాంతపోయాడు వృద్ధుడు.

"ఆవిడ యిప్పుడు వట్టిమనిషి కాదు, నిండు చూలాలు. అందుకనే మంగమ్మగారు కోడల్ని ఆ ప్రయత్నంనుంచి విరమింపచేయటానికి

ప్రయత్నిస్తున్నారని అనుకుంటున్నారు. ఇందులో తప్పేముంది? వంశాంకురం నశిస్తుంటే, ఎవరు మాత్రం కళ్ళప్పగించి చూస్తూ కూర్చుంటారు?" యువకుడు ఆవేశపరుడయ్యాడు.

"మంగమ్మగారు అత్తగారే కావచ్చు, రాణీగారే కావచ్చు, అయినా ఆవిడ కోడల్ని నిర్బంధించడం సముచితం కాదు."

"మాట వినక, మొండిపట్టు పట్టినప్పుడు నిర్బంధించడం తప్ప మార్గాంతరం ఏముంటుంది? రేపు ముద్దమ్మగారికి కొడుకే పుట్టవచ్చు. అతడు తర్వాత రాజ్యానికి రావచ్చు గదా! ఆ విధంగా మన రాజ్యం మనకు దక్కుతుంది."

వృద్ధుడు ఏమీ మాట్లాడలేదు. యువకుని మాటలు యుక్తి యుక్తంగా తోచాయి. వంశాంకురం నశిస్తుంటే ఎవరు మాత్రం సహిస్తారు? మంగమ్మగారి ప్రయత్నం, సంప్రదాయ విరుద్ధమే అయినా, సహేతుకంగానే తోచింది. అయినా ఆ మాటను వృద్ధుడు పైకి అనలేకపోయాడు. అందుకు ఆయన సంప్రదాయ విధేయత అడ్డు తగిలింది.

"మహారాజా ముద్దు వీరప్పనాయనయ్యవారికి అంత్యక్రియలు రెండు మూడు గంటల్లో జరగనున్నాయి...." అంటూ కొందరు ఆ దారిని వెళ్ళారు. తత్ఫలితంగా ఆ వృద్ధ - యువకుల వాదోపవాదాలకు అంతరాయం కలిగింది.

"మహారాజావారు పుణ్యాత్ములు.... పాపం.... పధ్నాలుగేళ్ళకే ఆయనకి నూరేళ్ళూ నిండాయి.... తండ్రిలా పరమ దైవభక్తులు....!"

"మహారాణీగారిని చూస్తుంటే జాలి వేస్తోంది.... కట్టుకున్న మగడు గతించాడు.... కన్న కుమారుడూ స్వర్గస్థుడయ్యాడు.... శోకమే మిగిలింది రాణీగారికి...."

ఇలా అనుకుంటూ తండోపతండాలుగా మధుర పౌరులు అంతఃపురం వైపు నడుస్తున్నారు.

రాజా ముద్దు వీరప్పనాయనింవారిని కడసారిగా దర్శించుకోవా లన్నదే వారందరి ధ్యేయం.

ముద్దమ్మగారు సహగమన వాంఛను విసర్జించాలని యువకుడు మనస్సులో అనుకున్నాడు. మంగమ్మగారి మాటే నెగ్గాలని అభిలషించాడు. నెగ్గుతుందనే ఆశాభావం కలగడంతో అతను సంతృప్తుడయ్యాడు. అతనూ వృద్ధుడూ అంతఃపురానికి దారితీశారు.

కొందరు మంగమ్మగారి సంస్కార ప్రియత్వాన్ని ప్రశంసిస్తున్నారు.

కొందరు తరుణ వయస్కురాలైన ముద్దమ్మగారి సంప్రదాయ విధేయతను తలుచుకుని మురిసిపోతున్నారు.

చివరికి సంప్రదాయ విధేయత గెలుస్తుందా, సంస్కార ప్రియత్వం గెలుస్తుందా అని తమలో తామనుకుంటున్నారు.

చూస్తుండగానే జనప్రవాహం ఎక్కువయింది. ఆ ప్రవాహంలో కలిసిపోయి, ఎవరి మాటలూ స్పష్టంగా వినిపించడంలేదు.

అంత పెద్ద అంతఃపురమూ నిశ్శబ్దంగా వుంది.

దాసదాసీ జనులు జంత్రపుబొమ్మలుగా కనిపించారు. ఎవరి ముఖం లోనూ నెత్తుటి చుక్కలేదు. వెలుగుతున్న దీపాలలో కాంతి తక్కువైన ట్లుగా తోచింది.

ముద్దమ్మ శోకమూర్తి ! ఒకవైపు మశూచికంపోసి అకాలమరణానికి పాల్పడిన భర్త వికృతరూపం ! పరవశింపజేస్తున్న అతని ప్రియోక్తులు మనసులో ఎక్కడో ఒకమూల ప్రతిధ్వనిస్తున్నాయి. మరోవైపు నెలలు నిండడంవల్ల కలిగిన భారం. ఇంకొకవైపు సంప్రదాయం అనుసరించి సహగమనం చెయ్యలేకపోతినే అనే బాధ. అందువల్ల పాపమూ దుష్కీర్తీ సంక్రమిస్తాయనే బాధ మరోవైపు, సహగమనానికి పూనుకోవద్దని

అత్తగారు నయాన భయాన చెప్పిన మాటలు ఆమె మనస్సున తొలిచి వేస్తున్నాయి. అత్తగారు అందరిలాంటిదికాదు. ఆమె మాట ఒక్కొక్కసారి నవనీత సమానం. ఒక్కొక్కసారి వజ్రతుల్యం. ఆవిడను సరిగా అర్థం చేసుకున్నవారు లేకపోయినందుకు ముద్దమ్మ విచారించింది. తాను కనక సహగమనం ఆచరిస్తే, వంశం నశిస్తుంది; తత్ఫలితంగా మధురనాయక రాజ్యం అంతరిస్తుంది-అనేగదా ఆవిడ చెప్పింది. ఆ మాటా నిజమే మరి! కాని సంప్రదాయానికి విరుద్ధంగా సంచరించడంవల్ల కలుగుతున్న మానసిక క్షోభ! ఈ క్షోభను భరించలేకుండా వున్నాను-రకరకాల తలపులు ముద్దమ్మ మనస్సుని రంపపుకోత పెట్టసాగాయి.

తన్న కుమారుడు ముద్దు వీరప్ప అకాలమరణం చెందడంతో మంగమ్మగారికి లోకం శూన్యంగా తోచింది. యౌవనంలో అడుగుపెట్టిన కొడుకు, తాను పిడిరాయిలా వుండగా- తన కళ్ళముందే విగత జీవుడు అవుతాడని ఆమె కలలో కూడా అనుకోలేదు. ఆమె సహజ గాంభీర్యం త్రుటికాలంలో మటుమాయమయింది. ఆమె యిప్పుడు విశీర్ణ హృదయ శోక జలధిలో తూట్లుపడిన నౌకలో ఒంటరిగా పయనిస్తున్న అబల!

కోడలు ముద్దమ్మ అంత మొండిఘటమని మంగమ్మగారు ఎన్నడూ అనుకోలేదు. సహగమనానికి కోడలు సహర్షంగా సన్నద్ధురాలు కావడం చూసి ఆమె భరించలేకపోయింది. హృదయం వ్యథాభరితమయింది. ఆమె లావణ్య లతిక! శీలవతి! కోడలు గుణగణాలు తలుచుకుని ఎంతగానో మురిసిపోయిండి. కాని ఆమె పట్టుదల! మూర్ఖంగా తోచింది. భర్తృ మరణంవల్ల కోడలు పుట్టెడు దుఃఖంలో మునిగిపోయింది. తాను మాత్రం ఆ దుర్భర దుఃఖాన్ని అనుభవించలేదా? కాని తాను విందుచూలాలన్న విషయాన్ని విస్మరించి కోడలు మూర్ఖంగా ప్రవర్తించడం ఆమెకు అణు మాత్రమైనా నచ్చలేదు. దండనాథులు, మంత్రులు మరికొందరు ప్రముఖులు

ముద్దమ్మను సమర్థించడం ఆమెకు బాధాకరంగా తోచింది. తనకు మాత్రం సంప్రదాయంపట్ల ఆదరభావం లేదా! కాని పరిస్థితుల ప్రాబల్యంవల్ల తాను సంప్రదాయంపట్ల విముఖత్వం వహించవలసివచ్చింది. రాజ్యక్షేమం ముందు సంప్రదాయం బలవత్తర మనిపించలేదు ఆవిడకి. తనకు పౌత్రుడు కలిగితే, అతను మధురాధినేత అయితే, అతను తన తాతముత్తాతల్ని సాహసౌదార్యాలలో మరిపిస్తాడేమో! ఎవరు చూశారు! పౌత్రుడు కలగనీ కలగకపోనీ-ఒక నిండుచూలాలిని చూస్తూ చూస్తూ చితి నెక్కించడం ఆవిడ అమానుషంగా భావించింది. అందుకే కోడలికి కర్తవ్యబోధ చేసింది. ప్రముఖులు కొందరు తనను పరోక్షంగా విమర్శించినా, మొదట్లో కోడలు తన మాటల్ని పెడచెవిని పెట్టేసరికి, ఆమె సహనం కోల్పోయింది. కొంచెం కటువుగానే మాట్లాడింది—ఆవిడ మనస్సు రకరకాల భావాల పుట్ట!

మందిర ద్వారంవద్ద ఎవరో నుంచున్న అలికిడి అయింది.

రాణి వెనుదిరిగి చూసింది. వచ్చిన వృద్ధ పరిచారికను గుర్తించింది. అయినా ఏమీ మాట్లాడలేదు.

రాణిగారి అనుజ్ఞకోసం ఎదురుచూసింది వచ్చిన ఆ పరిచారిక. అనుజ్ఞ రాకపోవడంతో, సాహసంచేసి ఆమె రాణిని సమీపించింది. అప్పటికీ రాణి పలకలేదు.

"అమ్మా, పొద్దుటినుంచీ తమరు పచ్చిగంగ కూడా ముట్టుకోలేదు. అన్నీ తెలిసిన తమరే యిలా నిరుత్సాహపడితే, రాజ్యవ్యవహారాలు ఎలా సాగుతాయి?" చొరవచేసి అడిగింది.

అయినా రాణి పలకలేదు. ఎట్ట ఎదురుగా వున్న కుడ్యశిల్పాన్ని వెర్రిగా చూడసాగింది.

"అమ్మా, తమ మౌనాన్ని నేను భరించలేకపోతున్నాను. మిమ్మల్ని చూస్తుంటే నాకెందుకో భయం వేస్తున్నది. మాట్లాడరా?" పరిచారిక గద్గద స్వరంలో తహతహ పరాకాష్ఠ అందుకుంది.

"చొక్కమ్మా !"

రాణి కంఠస్వరం అతి నీరసంగా వుంది. దుస్స్వప్నానికి భయ కంపితురాలై గొంతు పెగల్చుకుని అతికష్టంతో మాట్లాడినట్టుగా వుంది.

స్వాతి చినుకుని చూసి ఉప్పొంగిపోయినంతగా హర్షించింది చొక్కమ్మ "అమ్మా !" అంది.

"నేను స్త్రీని కానా ! నా ప్రవర్తన స్త్రీ జాతికి కళంకమా ! నేను సంప్రదాయ విరోధినా ? పెనిమిటినీ కొడుకునీ పొట్టనపెట్టుకున్న నరరూప రాక్షసినా ?...." మంగమ్మగారి శోకం గట్లు తెంచుకుని ప్రవహించే కావేరి అయింది. చొక్కమ్మను కౌగిలించుకుని విలపించసాగింది.

అప్రయత్నంగా చొక్కమ్మ కళ్లు నీటి బుంగలయినాయి.

ఆమె రాణిని అనునయించింది.

"అమ్మా ! మీరీ శోకం మానండి, తమకిది తగదు...."

"కొడుకు అకాలమరణం చెందినందుకు దుఃఖించనా ? లోకులు కాకులైనందుకు దుఃఖించనా ?"

"అమ్మా ! తమకు నేను చెప్పదగినదాన్ని కాను. మరీ బాధ పడుతున్నారు...." అంటూ తన చీరకొంగుతో రాణి కన్నీటిని తుడిచింది. తాను తెచ్చిన క్షీరపాత్రను రాణి సముఖాన ఉంచి, "అమ్మా ! యీ పాలు కొంచెం సేవించండి, త్రాణ వస్తుంది" అంది. పాలు తాగడానికి మారాము చేసే తనయును బుజ్జగించే తల్లిలా.

ఎన్నడో స్వర్లోకం చేరిన తల్లి మంగమ్మగారికి దృగ్గోచరమయింది. చొక్కమ్మ ఆప్యాయంగా యిచ్చిన పాలను అమృతంలా స్వీకరించింది.

చొక్కమ్మ నయనాలలో నందనవనాలు వెలిశాయి.

"అమ్మా ! మీరిప్పుడు అప్రమత్తంగా వుండకపోతే, అధికార దాహంతో సతమతమైపోతున్న మంత్రులూ అధికారులూ రాక్షసులై ఊళ్ళ మీద పడతారు; ప్రజల్ని వేధించుకుతింటారు. ఇలా నివేదిస్తున్నందుకు తమరు అన్యథా భావించరని నమ్ముతున్నాను."

"నిజమే చొక్కమ్మా, సంప్రదాయమన్న పేరుతో మా మంత్రులు కొందరు మమ్మల్ని కించపరచడం చూస్తుంటే, రాజ్యమంటే విరక్తి పుడుతోంది."

"అది నాకు తెలుసునమ్మా. తమరు రాజ్యకాంక్ష గలవారనీ, అందు వల్లనే తమరు సహగమనం చెయ్యలేదనీ యిప్పటికి అంతఃపురంలో అప్పుడప్పుడూ అనుకుంటూ వుంటారు...."

"ఒకరిదాకా ఎందుకు చొక్కమ్మా.... మా కోడలికే అలాంటి అభిప్రాయం వున్నప్పుడు.... నిన్నరాత్రి ఆ మాట మొహానే అన్నది.... అందుకే ఒక్కొక్కసారి యీ రాజ్యమంటే ఎంత విరక్తి కలుగుతున్నదో, నీకేం తెలుసు! అయినవాళ్ళచేత కానివాళ్ళచేత మాటలు పడుతూ రాజ్యం చెయ్యాలా అనిపిస్తుంది...."

"అమ్మా! తమ సమక్షంలో అనకూడదు కాని ముందుచూపుతో వ్యవహరించి కోడలుగారి సహగమన ప్రయత్నాన్ని నివారించారు. కాబట్టి సరిపోయింది, లేకపోతే యీపాటికి ఉద్యోగులు వికటాట్టహాసం చేసివుండేవారు.... ప్రజలేమో వారికి బలిపశువు లయ్యేవారు."

"మేము సంప్రదాయ విరోధులమనే భావం ప్రజలలో కూడా వున్నట్టు మన వేగులవారు చెప్పగా తెలుసుకున్నాము. సంప్రదాయాన్ని గౌరవించాలన్నదే మా అభిప్రాయం. కాని పరిస్థితుల దృష్ట్యా కొన్ని సంప్రదాయాలలో మార్పులు అవసరమవుతూ వుంటాయి. మార్పులు అవసరమన్నంత మాత్రాన సంప్రదాయాన్ని గౌరవించనట్లా? ఈ విషయం మన వారికి ఎలా తెలియజెప్పాలో తెలియడంలేదు...."

"తమకు గుర్తున్నదో లేదో...."

చొక్కమ్మవైపు రాణి సాభిప్రాయంగా చూసింది.

"అమ్మా! మరేమీ లేదు.... ఒకనాడు తమతో మాట్లాడుతూ తాంబూలం అందించాను మాటల ధోరణిలో వున్న మీరు పరధ్యానం

కొద్ది ఎడమచేత్తో ఆ తాంబూలం స్వీకరించారు. అదీ గమనించిన మన ద్వారపాలకుడు తన మిత్రులతో ఏం చెప్పాడో యేమిటో, తాంబూలాన్ని కుడిచేత్తో గ్రహించాలనీ, తమకు సంప్రదాయాలపట్ల సద్భావం లేదనీ ఆరోజు రాత్రి అంతఃపురంలో నలుగురూ చెప్పుకుంటూంటే విన్నాను."

అతికష్టంమీద చిరునవ్వు తెచ్చుకుంది రాణి.

"సంప్రదాయంపట్ల మనవారికి ఎంత నమ్మకమో యిప్పుడు తెలుసుకున్నాం. ఇంత చిన్న విషయాన్ని ఎంత పెద్దగా చేశారో చూశావా?" రాణి బాధపడుతున్నట్టు చొక్కమ్మ గ్రహించింది. "తమరు బాధపడకండి" ఓదార్చింది.

"బాధ? కాదు.... ఏ పేరూ రానేరాకూడదు. వచ్చిన తర్వాత అదీ పొమ్మన్నా పోదు. మనవారు అంత సంప్రదాయ విధేయులు! నేనొక్కదాన్నే సంప్రదాయ విరోధిని!" అంటూ రాణి నిట్టూర్పు విడిచింది.

రాణి తాను కూర్చున్న ఉన్నతాసనం నుంచి లేచింది. గవాక్షం చెంతకు వెళ్ళింది. చొక్కమ్మ ఆమెను అనుసరించింది.

"చూశావా చొక్కమ్మా! వైఘని. మేము కాపరానికి వచ్చిన కొత్తల్లో వైఘ జలసమృద్ధమై వుండేది. ఒక్కొక్కసారి వెల్లువ పట్టణంలోకి వస్తుందేమోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని వుండేవారు. ఇప్పుడు చూడు, నదీ కళాకాంతులు లేకుండా కనిపిస్తోంది, మా జీవితంలా. ఇసుక మేటలు వేసింది, మా గుండెల్లో చీకుచింతలు పోగులు పడినట్టుగా...."

"అమ్మా! అధైర్యపడకండి. పడిన గోడలు పడినట్టే ఉండవు."

"వైఘ ఎండిపోతే, కర్షకుల బాధలకు అంతుండదు. పాపం, నదీ మీద ఆధారపడి చాలామంది జీవిస్తున్నారు. అదే మా బాధ...."

"అవును తల్లీ!"

"ఇదంతా మా దురదృష్టం. మహారాజావారు దైవికం చెందడం, తండ్రిని మించిన కొడుకుగా పేరు పెంపులు గడిస్తాడనుకున్న ముద్దు

వీరప్ప అకాలమరణం చెందడం మా దురదృష్టం కాకపోతే మరేమిటి! చిరంజీవి కనక బ్రతికివుంటే, మహారాజుగారిలా మేమూ సద్గ్రంథ కాలక్షేపం చేస్తూ వుండేవాళ్ళం.... ఈ బాధా సర్పాలు చుట్టుకునేవి కావు. అంత అదృష్టమా మాకు!"

వైఘా నదిని తిలకించేకొద్దీ మహారాణి మనస్సు శోకార్ణవమయింది. "తల్లిలాంటి వైఘ యిలా రోజురోజుకి కృశించిపోతే, మన పొలాలు ఎలా పండుతాయి? కర్షకులు అగచాట్లకు లోనవుతారు. వారి కష్టాలు తీరేలా కనిపించడంలేదు. ఎన్ని కాలువలు తవ్వించి మాత్రం ఏం లాభం? నదిలో నీళ్ళుండాలి గదా! కర్షకులు నలిగిపోతున్నారు...." రాణి కళ్ళు చెమ్మగిల్లాయి.

"అమ్మా!"

"చెప్పు చొక్కమ్మా!"

"పుట్టెడు దుఃఖంలో వున్నా ప్రజల కష్టనష్టాల గురించి మీరింతగా ఆలోచిస్తున్నారంటే, అది మా భాగ్యవిశేషం తల్లీ! మీ దయార్ద్ర హృదయాన్ని మనవారు గుర్తించకపోవడం దురదృష్టం.... మంచిని సమకాలం వారు అంత సులభంగా గుర్తించరు. గుర్తించేనాటికి పుణ్యకాలం దాటిపోతుంది...." అంది చొక్కమ్మ బాధపడుతూ.

ఒకరి మెరమెచ్చుల కోసం చేస్తామా? కర్షకుల కోసం పాటు పడడం మా ధర్మంగా భావించాము.... అది సరేగాని చొక్కమ్మా! రాజ్యవ్యవహారాలలో స్త్రీ పాల్గొనడం దోషమా?" ప్రశ్నించింది రాణి.

ఈ హఠాత్ ప్రశ్నకు చొక్కమ్మ నివ్వెరపోయింది.

"దోషమా? కాదు. కాని....

"సందేహిస్తున్నావు చెప్పడానికి. నువ్వు వయోవృద్ధురాలివే కాదు, జ్ఞానవృద్ధురాలివి కూడా. చెప్పు చొక్కమ్మా!" రాణి బలవంతపెట్టింది.

"ఇంతకుముందు మన రాజ్యంలో ఏ మహారాణిగారు కూడా

రాజ్యవ్యవహారాలు పర్యవేక్షించలేదు. తమరే యీ విషయంలో దారి చూపినవారయ్యారు...." జంకుతూ చెప్పింది.

"అందుకే ప్రజల నోళ్ళలో నానుతున్నాము." రాణి పెదవుల మీద మందహాసం కనిపించింది. "ఇంతకూ మా ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పలేదు. రాజ్యపాలనకు స్త్రీలు అనర్హులా? చెప్పు...."

"అనర్హులని కాదు. ఆనవాయితీ లేదు. దోషంగా సంప్రదాయ వాదులు భావించవచ్చు...."

"భావిస్తున్నారని చెప్పు, ధైర్యంగా...." అంటూ రాణి పెద్దగా నవ్వింది. ఆ నవ్వులో రాణి పరిహాస కళలత కనిపించింది. అలా ఆమె నవ్వి చాలా రోజులయింది.

అదే అదనుగా భావించి చొక్కమ్మ తన మనస్సులోని మాటను పైకి అంది. "రాజ్య వ్యవహారాలపట్ల తమకింత ఆక్కర ఎలా కలిగిందమ్మా."

"చెప్పాము గదా, మహారాజావారు అదృష్టవంతులని, వారికి రాజ్య వ్యవహారాలంటే ఎంతో ఆసక్తి. స్వయంగా వారే పర్యవేక్షించేవారు. అయినా భాగవత రామాయణ గ్రంథ కాలక్షేపమంటే వారికెంతో అభిమానం. అలా సద్గ్రంథ కాలక్షేపం చెయ్యడంలో ఆయన అపరిమితంగా ఆసక్తి ప్రదర్శించేవారు. అదీకాక మా మాదిరి ముద్దళగాద్రిగారి మీద అంతులేని అభిమానం వారికి. కనక రాజ్యవ్యవహారాల పర్యవేక్షణ ఆయనకి అప్పగించారు. కాని మాకెందుకో మా మరిదిగారి మీద మొదటినుంచీ అపనమ్మకం...."

"తమరు లెస్సగా వూహించారు. మొదట పిల్లిగా వున్నవాడు చివరికి పులిలా మీద పడ్డాడు. విశ్వాసఘాతుకుడనిపించుకున్నాడు...."

"నీకు తెలియదు చొక్కమ్మా— మా మరిదిగారిని తంజావూరులో ప్రతినిధిగా నియమించారా, ఆ మరుక్షణం నుంచీ ఆయనకి రాజ్యకాంక్ష

కలిగింది. అంతకుముందులేదు. చెల్లించవలసిన కప్పం కూడా చెల్లించడం మానివేశారు. సర్వస్వతంత్రులై వ్యవహరించసాగారు. అప్పుడు మహారాజావారు మా మరిదిగారితో యుద్ధం ప్రకటించవలసివచ్చింది. కాని మంత్రులు మహారాజావారిని ఆ ప్రయత్నం నుంచి విరమింపజేశారు. అంతకు ముందునుంచి కూడా మహారాజావారు అప్పుడప్పుడు రాజ్య వ్యవహారాలు మాతో చర్చిస్తూ వుండేవారు. అదీకాక మా నాయనగారు దండనాథులు కావడంవల్ల, యుద్ధవిషయాలు చెపుతూ వుండేవారు. మా మరిదిగారు కృతఘ్నులు కావడంతో, మేము మహారాజా వారికి తోడునీడగా మెలగుతూ రాజ్య వ్యవహారాలు పర్యవేక్షించసాగాము...."

"ఈ విషయాలు మావంటివాళ్ళకు ఎలా తెలుస్తాయి తల్లీ....తమకు రాజ్యకాంక్ష వున్నట్లు భావించాముగాని...."

"తెలియనివాళ్ళు అలా అనుకోవడంలో తప్పేమీలేదు. అన్ని విషయాలూ తెలిసిన మా బంధువులు కూడా అలా భావిస్తున్నప్పుడు మేమెంతగా బాధపడతామో ఆ చొక్కనాథుడికి తెలుసు! ఆ మీనాక్షికి తెలుసు! ఒక్కొక్కసారి అనిపిస్తుంది, ఎపుడెపుడు ఆ లోకంనుంచి పిలుపు వస్తుందా అని."

"అదేం మాట తల్లి! తమరింత జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు కనుకనే, మావంటి సామాన్యులం అదమరిచి నిద్రపోతున్నాం...."

"ఇంత కష్టపడ్డా, ప్రజలు మమ్మల్ని లెస్సగా అర్థం చేసుకుంటే అదే మాకు పదివేలు! రాజ్య వ్యవహారాల పర్యవేక్షణమంటే చంద్ర నిప్పుల్ని చెంగున కట్టుకు తిరగడమే! ఒకవైపు తంజావూరు రాజులూ మరోవైపు రామనాథపురం సేతుపతులూ యింకోవైపు మైసూరు పాలకులూ మన రాజ్యాన్ని కబళించాలని విశ్వప్రయత్నం చేస్తున్నారు. గోరుచుట్టుమీద

రోకటిపోటులా, మనవారు సంప్రదాయం పేరుతో లేనిపోని గొడవలు సృష్టిస్తున్నారు...."

"అమ్మా! ఎన్నాళ్ళని సృష్టిస్తారు? రేపు తమకు మనవడు కలిగితే, వాళ్ళ ఆటలన్నీ కట్టినట్లే...."

"మేమూ ఆ సుదినం కోసమే ఎదురు చూస్తున్నాము. రక్త మాంసాలు ధారపోసి మా పూర్వులు నిలబెట్టిన యీ రాజ్యం మా తదనంతరం కూడా వర్ధిల్లాలి, ఇదే మా అభిలాష."

దూరాన ఎక్కడో గుడిగంట మోగిన సవ్వడి వినిపించింది.

"చొక్కమ్మా!" రాణి కంఠంలో ఉత్కంఠ కనిపించింది.

"అమ్మా!"

"అడగడం మరిచిపోయాను. ముద్దమ్మ ఏమన్నా ఎంగిలి పడిందా?"

"లేదు తల్లీ, అదీ చెప్పడం కోసమే తమ వద్దకు వచ్చాను."

"ఎవరు చెప్పినా వినదు. మహా పట్టుదల మనిషి, దుఃఖంతో వున్నప్పుడు అన్నం రుచించకపోవడం సహజమే. దేనిమీద ధ్యాస నిలవదు. అయినా కడుపులో వున్న బిడ్డకోసమైనా తన ఆరోగ్యం చూసుకోవద్దా?"

"అందుకే తమరు ఒక్కసారి వచ్చి చెప్పాలని నా మనవి."

"వింటే మంచిదే."

"వింటారనే నా నమ్మకం."

ఆ నమ్మకం మాకు లేదు. తన సహగమన ప్రయత్నాన్ని వారించామని మామీద కినుక వహించింది. అంత పట్టుదల...."

చొక్కమ్మ వెంట నడవగా, ముద్దమ్మ శయ్యాగృహానికి రాణి బయలుదేరింది.

అభ్యంతర గృహాన్ని పరివేష్టించి ఆనాడు పలువురు వీరయోధులు కనిపించారు.

పరిచారికలు ముందు వెనకల నడవగా, రాణి అభ్యంతర గృహాన్ని సమీపించింది.

పరిసరాలు ప్రశాంత గంభీరంగా వున్నాయి.

రాణి వెనుక దళవాయి నరసప్పయ్య ప్రభృతులు నడుస్తున్నారు. నవ్వు మొగంతో కనిపించే దళవాయి ఆరోజు తద్భిన్నంగా కనిపిస్తున్నాడు. ఆందోళన ఆయన ముఖంలో కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. అది చూసి వీరయోధులు పరిచారికలు దిగ్భ్రాంతులయ్యారు. మిన్నువిరిగి మీదపడినా చలించని దళవాయిలో కలిగిన మార్పుని చూసి ఎవరికి వారు ఏమేమో అనుకున్నారు. అందరి దృష్టి రాణిమీద లగ్నమయింది. ధైర్య స్థైర్యాలకు మారుపేరని పేరు పెంపులు గడించిన ఆమె ముఖంలోనూ విషాదచ్ఛాయలు ప్రస్ఫుటము లవుతున్నాయి.

రాణి, నరసప్పయ్య ప్రభృతులు అభ్యంతర గృహం ప్రవేశించారు. పరిచారికలు ద్వారం వద్దనే ఉండిపోయారు. ఒక్క చొక్కమ్మ మాత్రమే లోపలికి వెళ్ళింది. ద్వారాలన్నీ మూసివేశారు. వీరయోధులు ఖడ్గపాణులై వెలుపల నిలబడ్డారు.

అభ్యంతర గృహంలోని సురభిళద్రవ్యాల సువాసనలు మైమరి పిస్తున్నా, రాణి వదనంలోని విషాదచ్ఛాయలు తొలగలేదు. ఏదో దీర్ఘా లోచనలో వున్నట్లు ఆమె ముఖకవళికలు వ్యక్తం చేస్తున్నాయి.

"మొగలాయీ చక్రవర్తి అంత బలవంతుడా ?"

రాణి ప్రశ్నించింది. ఆమె కంఠస్వరంలో ఆందోళన వ్యక్త మవుతోంది.

"అవును తల్లీ, మొగలు సైనికులు మహాబలశాలురనీ, శక్తి యుక్తులలో వారికి వారే సాటి అనీ విన్నాను." దళవాయి ప్రత్యుత్తర మిచ్చాడు.

"అలాగా!"

"తమరు అన్యథా భావించకపోతే, ఒక విషయం మనవి చెయ్య దలుచుకున్నాను."

"చెప్పండి దళవాయిగారు మీ మాటను మేము కాదనము."

"ఔరంగజేబు పాదుషా దక్షిణాపథాన్ని స్వాధీనం చేసుకోవాలని యత్నిస్తున్నారు...."

"మన వేగులవాండ్రు చెప్పగా మేమూ విన్నాము, కనక వారి మాటను తోసివెయ్యడం న్యాయం కాదనిపిస్తోంది."

"అవును తల్లీ."

"ఢిల్లీ పాదుషావారు మహాయుక్తిపరులనీ విన్నాము, నిజమేనా?"

"గోలకొండ కోటను ఆయన వశం చేసుకున్నాడంటే, ఆయన ఎంతటి యుక్తిపరుడో గ్రహించవచ్చు...."

"అవును నరసప్పయ్యగారు శత్రు దుర్భేద్యమైన ఆ కోటను వశం చేసుకున్నాడంటే, మీరన్నట్లు పాదుషా శక్తియుక్తులు కలవాడనే తోస్తున్నది.

"పాదుషావారి శక్తియుక్తుల మాట ఎలా వున్నా, మహామంత్రు లైన అక్కన్న మాదన్నల జీవితాలు విషాదాంతంగా ముగియడానికి మొగలాయీ సైనికుల ముట్టడి కారణమయింది," విచారంగా అన్నాడు.

ఆ ముట్టడికీ వారి మరణానికీ గల సంబంధమేమిటో మాకు సరిగా బోధపడలేదు...."

"అమ్మా, బీజాపురాన్ని స్వాధీనం చేసుకుని పాదుషావారు గోల్కొండమీదికి దండెత్తనున్న తరుణమది. అప్పటికే అక్కన్న

మాదన్నలకు శత్రువులు కొందరు ఏర్పడ్డారు. ఆ మంత్రులిద్దరూ ఒకరోజు దివాణంనుంచి గృహోన్ముఖులైనప్పుడు, కుట్రదారులు ఆకస్మికంగా వారిమీదపడి వారి తలలు ఛేదించారు. ఆ తర్వాత వారి తలల్ని పాదుషావారి సముఖానికి పంపించి, ఆ విధంగా ఆయన ప్రశంసకు పాత్రులయ్యారు. ఆ విషాద సంఘటన జరిగిన కొన్నాళ్ళకే గోల్కొండకోట ఔరంగజేబు పాదుషా హస్తగతమయింది ..."

రాణీ కళ్ళు చెమ్మగిల్లాయి.

కొన్ని క్షణాలు మౌనం ప్రభుతనెరపింది. ఆ మౌనాన్ని ఛేదిస్తూ రాణీ యిలా అన్నది.

"పాపం, ఆ మహామంత్రులు చివరికి దుర్మరణం చెందారు...."

"వారి తలల్ని పాదుషావారి సముఖానికి పంపిన ఆ కుట్రదారులు అంతటితో పూరుకోలేదు. తల్లీ.... వారి శవాలను వీధుల్లో లాగుతూ తీసుకువెళ్ళారు...."

"ఎంత దారుణంజరిగింది! విధి బలీయమని మన పెద్దలు చెపుతారు.... నిజమే అయింది."

"విధి బలీయం కావచ్చు. కాని పరిపాలకులు ప్రమత్తులైనప్పుడు, రాజప్రాసాదంలో విద్వేషాలు విషసర్పాలైనప్పుడు, మలిన మనస్కులు రాజ్యంలో వికటాట్టహాసం చేస్తున్నారు.... ఆ అట్టహాసానికి ఎందరెందరో బలిపశువు లవుతున్నారు...."

"మీరన్నది నిజం."

మంత్రులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"పాలకులు ఎప్పుడూ అప్రమత్తులుగా వుండాలి తల్లీ. అప్పుడే ప్రజలకు సుఖశాంతులు...."

"దళవాయిగారూ, ఇప్పుడు మీరన్న మాటలు మాకు వర్తిస్తాయేమో!" నవ్వుతూ అడిగింది.

"ఒకరు చెప్పినా చెప్పకపోయినా, తమరు ఎప్పుడూ అప్రమత్తం

గానే వుంటున్నారు. కనకనే మన రాజ్యంలో సుఖశాంతులు నెలకొన్నాయి. ప్రస్తుత పరిస్థితిలో తమరు మరికొంత ముందు చూపుతో వ్యవహరించాలని నా ప్రార్థన."

"అది కూడా మీరే చెప్పండి ?"

"తమరు సంప్రదాయ విరోధులని నగరంలో కూడా చెప్పుకుంటున్నారు తల్లీ.... అందువల్ల లేనిపోని గొడవలు వస్తాయేమోనని నా భయం...."

రాణి పెదవులమీద చిరునవ్వు కనిపించింది.

"అమ్మా, యిది చిన్న విషయం కాదు. సంప్రదాయం అన్న పేరుతో స్వార్థపరులు కొందరు తమరిని బలహీనపరచాలని ప్రయత్నిస్తున్నారు. ఆ విధంగా తమమీద ప్రజల్లో ద్వేషభావం కల్పించడానికి కృషి చేస్తున్నారు...."

"అవుననుకోండి.... మా ప్రజలు మాడూ బసవన్నలుకారని మా అభిప్రాయం. మా కోడలిని సహగమన ప్రయత్నం నుంచి వారించినందుకు మమ్మల్ని అభినందించినవారూ లేకపోలేదు. అయితే వారి సంఖ్య తక్కువ కావచ్చు.... నరసప్పయ్యగారూ, మీకు తెలియని విషయం కాదు. మహారాజావారు దైవికం చెందినప్పుడు మేము సహగమనం చెయ్యకుండా రాజ్య వ్యవహారాలు పర్యవేక్షిస్తున్నందుకు, ఆనాడు చాలామంది మా మీద నిందలెన్నో వేశారు.... కారాలు మిరియాలు నూరారు.

"అవును తల్లీ, తమ నిష్కల్మష జీవితాన్ని శంకించిన ఆ విషయాన్ని నేను అప్పుడే మరిచిపోయాను...."

"మీరు మరిచిపోవచ్చు, కాని మాకింకా గుర్తున్నది. అయినా మా ప్రజలంటే మాకు అనిర్వచనీయమైన అభిమానం. స్వార్థపరుల యుక్తులూ కుయుక్తులూ చాలాకాలం మనలేవు....''

"అదే నేను తమకు మనవి చెయ్యాలనుకున్నాను...."

"నీలాపనిందలకు తలయొగ్గే స్వభావం మాకులేదని మీకు తెలుసు... ఇంతకూ మీరు చెప్పవచ్చిన విషయాన్ని చెప్పలేదు."

చొక్కమ్మ రాణి సముఖాన క్షీరపాత్రం వుంచింది.

"దళవాయిగారికీ యితర మంత్రులకూ యివ్వమ్మా."

"చిత్తం తల్లీ."

"ఢిల్లీ పాదుషావారి అధికారాన్ని మైసూరు పాలకులు సహర్షంగా అంగీకరించినట్లు వార్తలు వస్తున్నాయి."

"ఎవరు! హగలు గగ్గోలు రాయలని పేరు పెంపులు గడించిన చిక్కదేవరాయలవారా!"

"అవును తల్లీ. ఆయన చండప్రచండుడే, మరి అంతటివాడే పాదుషావారి అధికారాన్ని అంగీకరించడం విధి విలాసం!"

"విధి విలాసమే! చిక్కదేవరాయలవారి ధైర్యసాహసాలు మాకు తెలును, ఆయన పాదుషావారికి లొంగిపోవడం విచిత్రమే!"

"ఆయనే కాదు తల్లీ! తంజావూరి పాలకులు శాహజీగారు కూడా పాదుషావారి ఆధిపత్యాన్ని శిరసావహించనున్నట్లు వార్తలు అందు తున్నాయి."

"ఊఁ...." రాణి శిరఃకంపం చేసింది.

తంజావూరనగానే రాణికి గతచరిత్ర స్ఫురణకు వచ్చింది. ఆమె కంఠం బొంగురుపోయింది.

"అదేమి దురదృష్టమో నరసప్పయ్యగారూ, మొదటినుంచీ తంజా వూరి పాలకులు మనతో కయ్యాలకు దిగరుకాని, వియ్యం అందుకునేందుకు విముఖత్వం వహించారు. లేకుంటే దక్షిణా పథంలో తెలుగువారి పరిపాలన యింకా దృఢంగా వుండేది: తంజావూరులో మరికొంతకాలం సాగివుండేది. మనకూ యిరుగుపొరుగుల్లో ఒక అండ వుండేది.

"గతచరిత్రను విస్మరించకూడదు....కాని ..."

"ఇప్పుడదంతా తలుచుకుని లాభం లేదంటారు. ప్రస్తుత కర్తవ్యం పరిశీలించడం శ్రేయస్కరమని మీ అభిప్రాయం.... అయినా మీరు తంజావూరనేసరికి అప్రయత్నంగా మా మనోనయనాలలో తంజావూరు పూర్వ వైభవం తళుక్కుమని మెరిసింది."

"అదీ సహజమే తల్లీ.... ప్రస్తుతం మైసూరు పాలకులూ తంజావూరు పాలకులూ పాదుషావారి అధికారాన్ని అంగీకరించి పాదుషావారికి సామంతులవుతున్న విషయాన్ని మనం గమనించాలని నా మనవి...."

నరసప్పయ్యగారి విజ్ఞప్తి రాణికి అంతగా నచ్చినట్లులేదు. ఆమె మంత్రి మీనాక్షయ్యవైపు సాభిప్రాయంగా చూసింది.

రాణి మనస్సుని గుర్తించిన మంత్రి సహజ వినయం వుట్టిపడేలా యిలా అన్నాడు.

"అమ్మా, ప్రస్తుత పరిస్థితుల్లో దళవాయిగారు సూచించినట్లుగా మనమూ మొగలు పాదుషావారి ఆధిపత్యాన్ని అంగీకరించడమే సముచితమని తోస్తున్నది, లేకుంటే ..."

"అనగా మన స్వాతంత్ర్యాన్ని మనమే కొంతవరకు కోల్పోవడం శ్రేయస్కరమని మీ అభిప్రాయం...."

"తమ రన్నదీ వాస్తవమే. కాని మన యిరుగు పొరుగుల వున్న పరిపాలకులు, ఒక విధంగా ప్రవర్తించి, మనం మరో విధంగా ప్రవర్తించడంవల్ల అనవసరంగా మనం పాదుషావారి ఆగ్రహానికి పాల్పడుతామేమోనని నా భయం...."

"మీ భయం సహేతుకమే. కాని పరస్పర వైషమ్యాలకులోనై సంచరిస్తున్న మైసూరు, తంజావూరు పరిపాలకులు పాదుషావారికి లోబడి ఆ విధంగా ఆయన అభిమానానికి పాత్రులు కావడం తప్ప వారికి మార్గాంతరం లేదు. శంభాజీ నాయకత్వంలో మహారాష్ట్రులు మైసూరు వారితో యుద్ధం చేశారు. విజయలక్ష్మిని వరించారు. మైసూరుకి కలిగిన నష్టం

అపారం ! ఆ యుద్ధంవల్ల మైసూరులోని కొన్ని గుళ్ళగోపురాలు కూడా

"అమ్మా, తమరు సెలవిచ్చినట్లు, మైసూరు వారికి విపరీతమైన నష్టం ఏర్పడింది. తత్ఫలితంగా అదనపు పన్నులు విధించబడ్డాయి. వాటిని ప్రతిఘటించారు ప్రజలు. కాని ప్రస్తుతం తంజావూరు మైసూరు పాలకుల పరస్పర వైషమ్యాలు చాలావరకు అంతరించినట్లుగా విన్నాను" అన్నాడు దళవాయి.

"బీజాపూరు గోల్కొండలను స్వాధీనం చేసుకున్న తర్వాతనే, పాదుషావారి పట్ల మైసూరు, తంజావూరు పాలకులు వినయవిధేయతలు ప్రకటించారు" అన్నాడు మీనాక్షయ్య.

"వారు వినయవిధేయతలు ప్రకటించారు కాబట్టి మనమూ పాదుషా పట్ల వినయవిధేయతలు ప్రకటించాలని మీరు భావిస్తున్నారా ?" రాణి సూటిప్రశ్న వేసింది.

మంత్రి మౌనం వహించాడు.

"మీకు గుర్తుండవచ్చు దళవాయిగారూ, మా ముద్దువీరప్ప రాజ్యం చేసే రోజుల్లో కూడా మొగలాయీలు మనకొక సమస్యగా తయారైనారు. పాదుషావారికి లోబడరాదనీ, మనం స్వతంత్రంగా వ్యవహరించాలనీ తమరప్పుడు సలహా యిచ్చారు."

"అవును తల్లీ, అబ్బాయిగారు ఆ సలహా పాటించి స్వతంత్రులుగా వ్యవహరించారు, కాని అప్పటి పరిస్థితులు వేరు."

"అదీకాక చిక్కదేవరాయలవారు యుద్ధసన్నద్ధులవుతున్నారని వార్తాహరులవల్ల విన్నాను" మీనాక్షయ్య అన్నాడు.

"ఇదే కనక వాస్తవమైతే, మనం అప్రమత్తంగా వుండడం శ్రేయస్కరం" దళవాయి మాటల్లో స్థయిర్యం కనిపించింది.

రాణి నవ్వుతూ, "యుద్ధవార్త వినగానే దళవాయిగారు ఉగ్రులయ్యారు. యుద్ధమే కనక చెయ్యవలసివస్తే అపర రుద్రులవుతారు" అన్నది.

దళవాయి మందహాసంచేసి, "అది నా ధర్మం తల్లీ, తమరు నాపట్ల వుంచిన విశ్వాసాన్ని ఎన్నడూ వమ్ము చెయ్యకూడదని నా అభిలాష" అన్నాడు. ఆ మరుక్షణమే గంభీరుడై, "ఈసారి మైసూరువారికి తగిన పాఠం చెప్పడం చాలా అవసరం తల్లీ. చీటికీమాటికీ వారు కయ్యానికి కాలు దువ్వుతున్నారు" అన్నాడు.

దళవాయి మాటల్లోని కరకుదనం అప్పుడు రాణికి అవగతమయింది. నిజమే! మైసూరు వారివల్ల ఎప్పటికప్పుడు బెడదగానే వుంటున్నది వారికి గుణపాఠం చెప్పడం అవసరమన్న దళవాయి అభిప్రాయం సమంజసమని తోచింది రాణికి.

"అయితే దళవాయిగారూ, మీరు సూచించినట్లు మనం పాదుషావారి ఆధిపత్యాన్ని అంగీకరిస్తే, అందువల్ల మనకు కలిగే ప్రయోజనం ?"

దళవాయికి ఉత్సాహం కలిగింది.

"మరేంలేదు తల్లీ. ప్రస్తుత పరిస్థితిలో మనం పాదుషావారి అభిమానం పొందడం అభిలషణీయం. లేకుంటే, అనవసరంగా ఆయన ఆగ్రహాన్ని కొనితెచ్చుకున్నవాళ్ళమవుతాం. అందువల్ల యుద్ధ ప్రమాదం ఏర్పడవచ్చు.

"అదీ అదనుగా చేసుకుని మైసూరు, తంజావూరు పరిపాలకులు మనమీదికి దండెత్తి రావచ్చు. లేదా పాదుషావారికి సహాయంగా యుద్ధంలో పాల్గొనవచ్చు. ఏకకాలంలో అందరినీ వైరులుగా చేసుకోవడం విజ్ఞతకాదు తల్లీ. తమకు తెలియని విషయం కాదిది" మీనాక్షయ్య తన అభిప్రాయం తెలియజేశాడు.

రాణి ఆలోచనా నిమగ్నురాలయింది. మనస్సు పరిపరివిధాల

పోయింది. శత్రువుల సమర సన్నాహాలు, యుద్ధప్రమాదం, మలిన మనస్కుల కుయుక్తులు— ఆమె మనస్సుని వశం చేసుకుని చిత్రవధ చేస్తున్నాయి. ఎటూ పాలుపోవడం లేదు. మంత్రుల సలహాని మన్నించడమా ? మన్నించి స్వాతంత్ర్యాన్ని కోలుపోవడమా ? మన్నించక మంత్రుల అసంతృప్తికి పాల్పడడమా ? అన్నీ తెగని ఆలోచనలే !

దళవాయి ప్రభృతులు మౌనం వహించారు.

మందిర ద్వారంవద్ద ఒక వృద్ధ పరిచారిక నిలబడింది. ఆమెను చూసీ చూడగానే రాణికి ఎక్కడలేని తహతహ కలిగింది.

వెంటనే చొక్కమ్మ ఆమెను సమీపించింది. ఆమె చొక్కమ్మ చెవిలో యేదో చెప్పింది. అంతవరకూ ప్రశాంతంగా వుండిన చొక్కమ్మ ముఖంలో మార్పు వచ్చింది.

ఆతురతను నిగ్రహించుకోలేకపోయింది రాణి. "ఎలా వుందీ కోడలికి ?" అడిగింది.

"నొప్పులు వస్తున్నాయట తల్లీ."

"రాజవైద్యులికి కబురు పంపారో లేదో కనుక్కోండి దళవాయి గారూ" అంటూ రాణి ఉన్నతాసనం దిగి గబగబ ముందుకి అడుగులు వేసింది, ఆమెను చొక్కమ్మ అనుసరించింది.

నరసప్పయ్య, మీనాక్షయ్య ప్రభృతులు వ్యగ్రులయ్యారు.

అభ్యంతర గృహంనుంచి సరాసరి ప్రసూతి గృహానికి దారితీసింది రాణి. చొక్కమ్మ మరికొందరు పరిచారికలు ముందు నడవసాగారు.

ముద్దమ్మ పడుతున్న ప్రసవవేదన అప్పుడే అంతఃపురమంతా వ్యాపించింది. చేస్తున్న పనులు కూడా మానుకుని పరిచారికలు ప్రసూతి గృహంవైపు నడిచారు.

కోడలుకి సుఖప్రసవం కావాలనీ, పౌత్రుడు కలగాలనీ, మధుర రాజ్యం నిలవాలనీ మీనాక్షీ సుందరేశ్వరులకు రాణి మనస్సులో వెయ్యి దణ్ణాలు పెట్టుకుంది. మీనాక్షీదేవికి సుందరేశ్వరునికి పట్టుపుట్టాలు సమర్పిస్తాననీ క్షీరాభిషేకం చేయిస్తాననీ మొక్కుకుంది. అమ్మవారికీ అయ్యవారికీ దివ్యాభరణాలు సమర్పిస్తానని సహర్షంగా మొక్కుకుంది. అలాగే మధురకు కొంచెం దూరంలో వేంచేసి వున్న సుందరరాజస్వామికీ సుబ్రహ్మణ్యస్వామికీ అమూల్యాభరణాలు చీని చీనాంబరాలు సమర్పిస్తానని మొక్కుకుంది.

రాణి ప్రసూతి గృహాన్ని సమీపిస్తుంటే, అప్పుడే ఒక వృద్ధ మంత్రసాని లోపలినుంచి వెలుపలికి వచ్చింది.

రాణిని చూడగానే ఆమె ముఖం వికసిత పద్మమయింది.

"మనవడు తల్లీ !" అంది.

"తల్లీ బిడ్డా క్షేమంగా వున్నారా ?"

"అమ్మవారి దయవల్ల క్షేమమే తల్లీ."

ప్రసూతి గృహంలో అడుగిడనున్న రాణి అక్కడే నిలిచిపోయింది. ఆమె ముఖంలో గూడుకట్టుకున్న ఉత్కంఠ మటుమాయమయింది. ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. నయనాలలో కొత్తకాంతి ఏదో తళుక్కుమంది. మనస్సులో ప్రశాంతత నెలకొన్నది. ఆ సంతోషంతో తన గళసీమను అలంకరించిన ఒక హారాన్ని తీసి, "శుభవార్త చెప్పినందుకిది బహుమతి" అని ఆ మంత్రసానికి బహూకరించింది.

ఉత్సాహంకొద్దీ, "ఆ మీనాక్షమ్మ మా రాజ్యాన్ని నిలబెట్టింది" అంటూ జగజ్జననికి మనస్సులో కృతజ్ఞత తెలుపుకుంది.

వెంటనే మంత్రసానిని చూస్తూ, "సుఖప్రసవమేగా ?" అడిగింది.

"అవును తల్లీ."

రాణి ప్రసూతి గృహంలోకి వెళ్ళింది.

చొక్కమ్మ మాత్రం రాణిని అనుసరించింది. కడమవారు ద్వారం వద్దనే ఆగిపోయారు.

నవజాత శిశువు రోదన ధ్వని వినిపించింది, రాణి మైమరచింది. ఎన్నాళ్ళకు మళ్ళీ అంతఃపురంలో యీ రోదన ధ్వని! అనుకుంది. పుట్టి నప్పుడు మా ముద్దువీరప్ప గొంతు కూడా యిలాగే వుండింది అనుకుని అనిర్వచనీయమైన తృప్తి చెందింది.

రాణి కోడలు ముద్దమ్మను తృప్తిగా తిలకించింది.

మేరలేని సంతోషంతో "పండంటి మగబిడ్డ" అంది.

కాని ముద్దమ్మ నవ్వు తెచ్చిపెట్టుకున్నదిగా తోచింది రాణికి.

అనూహ్యమైన భయమేదో వేసింది రాణికి. ఆ భయం ఆమెను క్రుంగదీసింది. కలిగిన ఆనందోత్సాహాలు కరిగిపోయాయి. తాను సుఖ ప్రసవం కావడం, తనకు పురుషసంతానం కలగడం, తమ వంశం నిలవడం, రాజ్యం నిలబడడం—ముద్దమ్మకు సంతోషమూ సంతృప్తీ యివ్వలేవా? ఆమె మనస్సు ఏదైనా అఘాయిత్యం మీదికి మళ్ళిందా? ముద్దమ్మ నవ్విన నవ్వు చూసి రాణి నిలువునా నీరైపోయింది. ఆమె మనో వీధిలో శంకలు స్వైరవిహారం చెయ్యసాగాయి.

చెంతనే వున్న చొక్కమ్మ రాణి ఆందోళనను కొంతవరకు గ్రహించింది, "అమ్మా!" అంది.

భూపతనమైన శిశువు ఏడుపు వినిపించింది.

రాణి యీ లోకంలోకి వచ్చింది.

ఆ పసిగుడ్డు వంక తదేకదీక్షగా చూసింది పెద్దవాడైతే మూమ్మూర్తులా తండ్రిలా వుంటాడు-అనుకుని తృప్తి చెందింది. తన కొడుకే ఆమెకు గుర్తుకు వచ్చాడు.

అక్కడినుంచి కదలడానికి రాణికి మనస్కరించలేదు ఎంతసేపు ఆ పసిగుడ్డుని చూసినా తనివితీరలేదు. శిశువుకి అంగములన్నీ సక్రమంగా

వున్నవో లేవో అని ప్రతి అంగం శ్రద్ధగా తిలకించింది. తృప్తిభావం ఆమె కళ్ళలో తిష్ఠ వేసింది.

రాణి అంతసేపు తనవద్ద నిలబడినా, శిశువుని కన్నార్పకుండా చూసినా, తనను పలకరించినా అత్తగారితో కోడలు ఒక్క పలుకైనా పలకలేదు. తెచ్చిపెట్టుకున్న నవ్వు నవ్వింది అంతే....

పండంటి మగబిడ్డ కలిగినా, ముద్దమ్మకు సంతోషం కలిగినట్లు తోచలేదు. ప్రసవవేదనపడి సుఖంగా ప్రసవించినా ఆ సంతోషమూ కలిగినట్లులేదు.

మనవడు కలిగిన సంతోషాన్ని మించిన విచారం కలిగింది రాణికి కోడలు ప్రవర్తన చూసి. కాని ఆ సమయంలో ఎవరు మాత్రం ఏం అనగలరు ?

"వైద్యులు చెప్పినట్లు నడుచుకో, అపథ్యం చెయ్యకు. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో....మాకు మనవణ్ణి యిచ్చి మాకెంతో వుపకారం చేశావు...." అక్కడినుంచి కదలబోతూ కోడలికి హితవు చెప్పింది రాణి. ఆమె ముఖంలో మార్పు ఏమైనా కనిపిస్తుందేమోనని కొండంత ఆశతో కోడలిని చూసింది, రాణికి నిరాశే మిగిలింది.

ముద్దమ్మను వెయ్యికళ్ళతో గమనిస్తూ వుండిన చొక్కమ్మ నివ్వెర పోయింది. కర్కశ హృదయంగా కనిపించింది. రాగద్వేషాలకు అతీతగా కనిపించలేదు. ఒక యువతిగా కనిపించలేదు. మాతృమూర్తిలా అసలు కనిపించలేదు.

అప్పటికప్పుడే శిశూదయవార్త అంతఃపురం యావత్తూ వ్యాపించింది. విన్నవారందరూ సంతోషించారు. కాని కొందరు మాత్రం వ్రతం చెడ్డా ఫలం దక్కిందని మనస్సులో అనుకున్నారు; బాధపడ్డారు, రాణి మ్రొక్కిన మ్రొక్కులు ఫలించినందుకు, వారికి యింకా ముద్దమ్మ సహగమన ప్రయత్నం చెయ్యడం రాణి ఆమెను ఆ ప్రయత్నం నుంచి వారించడం వంటి దృశ్యాలే కనిపించాయి.

రాణి ప్రసూతి గృహంనుంచి వెలుపలికి రాగానే, అక్కడ గుమిగూడినవారు జయజయధ్వానాలు చేశారు ఆనందోత్సాహాలతో.

వారి ఆనందోత్సాహాలలో రాణి పాలుపంచుకుంది.

ఒక పరిచారిక నలుగురికీ కలకండ పంచిపెట్టింది. ఆమె విజ్ఞతను మెచ్చుకుంటూ రాణి, "ప్రభువులు పుడితే యింతేనా?" అంది.

"ప్రస్తుతానికి యింతే అయినా, త్వరలోనే మాకందరికీ షడ్రసోపేతంగా విందుభోజనం లభిస్తుంది తల్లీ" అంది ఆ పరిచారిక.

రాణి మందహాసం చేసింది.

"మీనాక్షీదేవి కరుణించింది. తమ కోరిక ఫలించింది." అంటూ దళవాయి తన హర్షాన్ని వ్యక్తం చేశాడు.

ఇతర మంత్రులు కూడా తమ సంతోషాన్ని తెలియజేశారు.

ఆ తర్వాత అక్కడ చేరిన వారందరూ రాణి అనుజ్ఞ తీసుకుని ఎవరి యిళ్ళకు వారు వెళ్ళిపోయారు. చొక్కమ్మ మరికొందరు ముఖ్య పరిచారికలు మాత్రం మిగిలారు.

"తల్లీబిడ్డల్ని జాగ్రత్తగా చూస్తూ వుండండి. ఏ లోపమూ రాకూడదు." అని రాణి పరిచారికల్ని కొంచెం కఠినంగానే హెచ్చరించింది.

"చిత్తం తల్లీ," అన్నారు వినయ విధేయతలు మూర్తీభవించిన ఆ పరిచారికలు.

రాణి తన నివాసానికి బయలుదేరింది. మూడడుగులు ముందుకు వేసినదల్లా ఆగి, "తల్లి ఆరోగ్యాన్ని బిడ్డ ఆరోగ్యాన్ని ఎప్పటికప్పుడు వైద్యులకు తెలియపరచండి. అశ్రద్ధ చెయ్యవద్దు. మాకూ తెలియజేస్తూ వుండండి." అని అధికార స్వరంతో అన్నది.

రాణి తన నివాసం చేరుకుంది. ఎందుకో వెనుదిరిగి చూసింది చొక్కమ్మ !

"చొక్కమ్మా, యింటికి వెళ్ళలేదా? ఇందుమించు రోజంతా యిక్కడే వున్నావు."

"వెడతాను తల్లీ."

"బిడ్డ బాగున్నాడు కదూ!"

బిడ్డ అనబోయి "ప్రభువుల కేవమ్మా .. లక్షణంగా వున్నారు. మహారాజా వారిలా వున్నారు. ఆ కళ్ళు అచ్చం మహారాజావారివే...."

"నిజంగా!"

"అవునమ్మా."

"అమ్మవారిదయవల్ల కోడలు సుఖంగా ప్రసవించి, పండంటి మనవణ్ణి యిచ్చింది. ఈ రాజ్యాన్ని నిలిపింది....ప్రసవం ఎక్కడ కష్ట మవుతుందో అని చాలా భయపడ్డాను. అసలే చిన్నవయస్సు. అందులో రాకూడని కష్టం ముందుకు వచ్చింది....అమ్మవారు కరుణించింది...."

"తమతో అనలేదు కానీండి, నేనూ భయపడ్డాను. ప్రసవం కష్ట మవుతుందేమోనని, ప్రసవ సమయంలో పెద్ద మంత్రసాని చాలా భయ పడింది...."

"అలాగా! కోడల్ని చూస్తే, జాలివేస్తుంది. చిన్నపిల్ల....ఏమీ తెలీదు. తెలిసీ తెలియని వయస్సు కాబట్టి మొండిపట్టు పడుతుంది, ప్రతి దానికి ..."

"అమ్మా!"

చొక్కమ్మ గొంతు గాద్గదికమయింది.

"ఏమిటి చొక్కమ్మా!"

"కోడలుగారెందుకో సంతోషంగా లేరమ్మా...."

"నువ్వా గ్రహించావన్నమాట!"

"బిడ్డను చూపించినా, నవ్వలేదు. చూసీ చూడనట్టుగా వుండి పోయారు.... తమరు బాధపడతారని నలుగురిముందు యీ మాట చెప్పలేక పోయాను మన్నించాలి."

"చొక్కమ్మా, మా మనస్సులోని బాధను ఎవరితో చెప్పుకోవాలి పైకి యిలా నవ్వుతూ వున్నాము గాని మనస్సులో అగ్నిపర్వతాలు మండ తున్నాయి."

"తమరు అధైర్యపడకండి...."

"అది కాదు చొక్కమ్మా, ప్రసవం పునర్జన్మతో సమానమంటారు. అమ్మవారి దయవల్ల సుఖప్రసవమయిందా! ఒక తల్లి అయిందా? అయినా కోడలు ఎందుకిలా విరక్తంగా మూగనోముపట్టి సంచరిస్తున్నదో మాకేమీ అర్థం కావడంలేదు. తన దారికి మేము అడ్డు తగిలాము కనక, మాపై కినుక వహించడంలో తప్పులేదు. మేము పలకరించినా, పలకకపోవడం ఒక దోషంగా భావించడంలేదు. పోనీ మీ అందరితో సంతోషంగా మాట్లాడవచ్చు గదా! మీరేం తప్పు చెయ్యలేదు. అందరూ దోషులేనా? అందరూ తన దారికి అడ్డు నిలిచిన వారేనా? కొడుకునికన్న సంతోషంతో నైనా మాట్లాడవచ్చు గదా? మాట్లాడకపోతే పోయె, మాటవరసకైనా నవ్వవచ్చు గదా!...." రాణి కళ్ళు అశ్రుపూరితాలయినాయి, గొంతు బొంగురుపోయింది.

రాణి పడుతున్న మానసికక్షోభను చొక్కమ్మ గ్రహించింది. ముద్దమ్మ అంటే మనస్సులో ఎక్కడో ఒక మూల లేశమాత్రంగా మిగిలిన సానుభూతి ఆమెలో నశించింది. పైపెచ్చు ద్వేషభావం పొటమ రించింది. రాణి యింకా బాధపడుతుందేమోనని ఆమె మాట్లాడలేదు. అవనతవదనయై నేలను చూడసాగింది.

"చొక్కమ్మా!"

"తమ ఆజ్ఞ సెలవివ్వండి."

"ఎందుకో కోడలుమీద మాకు అపనమ్మకం కలిగింది. ఏదో అఘాయిత్యానికి పాల్పడుతుందని మా అంతరాత్మ ఘోషిస్తున్నది. ఈ

పరిస్థితిలో నువ్వు కోడలిని వెయ్యి కళ్ళతో కనిపెట్టి వుండాలి. అయితే నువ్వు కనిపెట్టి వున్నట్లు కోడలు గ్రహించకూడదు. మరి ఎలా మసలుకుంటావో యేమో! ఆ పసికందుకి అన్యాయం జరగకూడదు. వాడు మాతృహీనుడు కాకూడదు...."

"అలాగేనమ్మా, తమ బాధను అర్థం చేసుకున్నాను."

రాణి శయ్యాగృహానికి దారితీసింది, ద్వారం వద్దనే ఆగింది చొక్కమ్మ.

రాణి మనస్సంతా కోడలుమీదనే లగ్నమయింది. ఉన్నట్టుండి ఆమె చూపులు ఎదెదుట వున్న నిలువుటద్దంమీద పడ్డాయి.

జీవితంలో దెబ్బలెన్నో తిన్నా, తానింకా సౌందర్యవతిగానే కనిపించింది దర్పణంలో. ఈమధ్య ఆమె యెన్నడూ అంత శ్రద్ధగా దర్పణం వైపు చూడలేదు. తన సౌందర్యమే తన మానసికక్షోభకు కారణమనుకుంది.

వివాహోదంతం ఆమెకు స్ఫురణకు వచ్చింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

మహారాజావారితో — చొక్కనాథనాయనింవారితో — తనకు వివాహం జరగకపోతె తాను సామాన్యురాలిగానే ఉండి వుండేది. తండ్రి తుపాకుల లింగమనాయకుడు పేరు మోసిన దండనాథుడు. దైవభక్తుడు.... మహారాజావారు తంజావూరు విజయరాఘవనాయకుని కుమార్తె మోహనాంగిని పరిణయమాడ దలచారు. పేరుకితగ్గట్టె ఆమె లావణ్యలతిక! కాని అందుకు తంజావూరు పాలకులు అంగీకరించలేదు. తగు మనుష్యుల్ని పంపించారు, చెప్పించి చూశారు. అయినాసరే విజయరాఘవనాయకుడుగారు సమ్మతించలేదు. తాము అభిజాత్య సంపన్నులమని తంజావూరు పాలకులకు మొదటినుంచీ దురభిమానం.... అంతే ... ఉభయులకూ భీకర యుద్ధం జరిగింది. బలాబలాలు తేల్చుకోవాలనుకున్నారు. పరిపాలకుల

పట్టుదలలు భయంకర సంగ్రామాలుగా పర్యవసిస్తాయి! ఆ యుద్ధంలో వీరవరేణ్యులు ఎందరెందరో క్షతగాత్రులైనారు. కొందరు దప్పి తాళలేక కిందపడి పొర్లాడుతూ కాలవలు కట్టి పారుతున్న రక్తాన్ని మంచినీళ్ళనుకుని త్రాగారట........

ఆ భయంకర యుద్ధదృశ్యాలు మనోనేత్రం ముందు గోచరించడంతో రాణి హృదయం శోకార్ణవమయింది. పరిపాలకుల పట్టుదలలవల్ల అమాయకులు ఎంతమంది వీరస్వర్గం అలంకరించారో, ఎందరు వికలాంగులై బాధావహులయ్యారో అనుకుంది....

ఆ యుద్ధంలో మహారాజావారికే విజయం లభించింది. ఆ విజయోత్సాహంతో ఆయన తంజావూరు అంతఃపురానికి వెళ్ళారు. అది అంతఃపురంగా వుందా? రుద్రభూమిగా కనిపించింది. విజయరాఘవ నాయకులుంగారు యుద్ధభూమిలో స్వర్గస్థులైన వార్త వినగానే, అంతఃపుర స్త్రీలందరూ చితి పేర్చుకుని ప్రాణత్యాగం చేశారు.... మహారాజావారు వలచిన మోహనాంగి కూడా ఆత్మత్యాగం చేసింది.... మహారాజావారికి పట్టుదల ఎక్కువయింది.... ఏమిటో మొండిపట్టుదల....

ఆ తర్వాత మహారాజావారు మేము మహారూప యవ్వన కళా సమేతయై వుండే వర్తమానం విన్నారట! వెంటనే తగు మనుష్యుల్ని మా నాయనగారి వద్దకు అంపించారట. వచ్చిన ప్రముఖులు మమ్మల్ని చూశారు.... మా అందచందాలను పూసగుచ్చిన రీతిగా మహారాజావారికి తెలియజేశారు.... మమ్మల్ని వివాహం చేసుకున్నారు....

లోకానికి ఇవన్నీ పాత విషయాలే.

కాని రాణికి! నిన్న మొన్న జరిగినట్టుగా కనిపించాయి.

మహారాజావారినీ, కన్న కుమారుడినీ పొట్టన పెట్టుకున్నాము. ఇప్పుడు మాకు కన్నీళ్ళు తప్ప ఏం మిగిలాయని! కోడలువల్ల యింకేమి

పేరు వస్తుందో! ఇప్పటికే సంప్రదాయ విరోధినని భూషిస్తున్నారు! తిన్న యీ దెబ్బలు చాలక, యింకా జీవించి మరెన్ని దెబ్బలు తినాలో....

రాణికి గత విషయాలన్నీ స్ఫురణకు వస్తున్నాయి. జీవితమంటే అసహ్యం కలుగుతోంది ఆమెకు.

ఎవరికోసం తాను జీవించాలి? రాజ్యవ్యవహారాలు పర్యవేక్షించాలి? అయోమయంగా కనిపించింది.

అభమూ శుభమూ ఎరగని ఆ పసికందు— తన పుత్రుడు— గుర్తుకి వచ్చాడు. జీవితంపట్ల ఆసక్తి కలిగింది. రాజ్యవ్యవహారాలను మరింత శ్రద్ధగా పర్యవేక్షించాలనుకుంది. ఎలాగో శోకాన్ని దిగమింగింది. ఆ పసికందుకోసం అన్నిటినీ సహించి జీవించడం అవసరమనుకుంది.

అలా రాణి ఆలోచనల దొంతరలో నలిగిపోతుంది.

ఎప్పుడు నిద్రపోయిందో యేమో!

ఉదయం లేచేసరికి మీనాక్షీసుందరేశ్వరుల ఆలయంనుంచి ఘంటా నాదం వినవస్తున్నది. ఎప్పుడు నిద్ర పట్టిందో— అనుకుంటూ రాణి లేచింది. ఎదుట వున్న మీనాక్షి నిలువెత్తు విగ్రహానికి సభక్తికంగా అంజలి ఘటించింది. ఉన్నతంగా కనిపించే అమ్మవారి ఆలయ గోపురాలకు గవాక్షం చెంత నిలబడి నమస్కరించింది.

పూజాగృహం నుంచి శంకరభగవత్పాదాచార్యులవారు రచించిన మీనాక్షి స్తోత్రం వీనులవిందుగా వినిపిస్తున్నది.

'ఉద్యద్భాను సహస్రకోటి సదృశా
కేయూరహారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మిత దంత పంక్తి రుచిరాం
పీతాంబరాలంకృతాం
విష్ణుబ్రహ్మసురేంద్ర సేవిత పదాం
తత్త్వ స్వరూపాం శివాం

మీనాక్షీం ప్రణతోస్మి సంతత మహం
కారుణ్య వారాం నిధిం.'

మీనాక్షీం ప్రణతోస్మి.... అనుకుంటూ శయ్యాగృహం దాటి రాణి వెలుపలికి వచ్చింది.

ద్వారంవద్ద నిలబడివున్న పరిచారికలు మహారాణికి జయజయ ధ్వానాలు పలికి, ఆమె ఆజ్ఞకోసం నిరీక్షించసాగారు.

"చొక్కమ్మ రాలేదా ?" రాణి ప్రశ్నించింది.

"ఇంతకుముందే వచ్చి వెళ్లారు తల్లీ."

"విశేషం ఏమన్నా వుందా ?"

"చిన్నరాణిగారు నిన్న రాత్రి సరిగా నిద్రపోలేదట. రాత్రంతా కలవరిస్తూ వున్నారట. ఆ వర్తమానం వెంటనే వైద్యులకు తెలియజెయ్యగా, ఆయన వచ్చి చూసి వెళ్లారట— అని తమకు నివేదించమని చొక్కమ్మ గారు చెప్పారు...."

"అలాగా !"

రాణి మనస్సులో మళ్ళీ తుఫాను !

ఆమె కాలకృత్యాలు తీర్చుకుంది.

తెల్లని పట్టుపుట్టం ధరించి, నుదుట విభూతి దాల్చి, రాణి పూజా గృహానికి వెళ్ళింది.

రాణిగారి రాకను గ్రహించిన వృద్ధబ్రాహ్మణుడు లేచి నిలబడ్డాడు. ప్రీతిపూర్వకంగా ఆమెకు నమస్కరించాడు. రాణి ప్రత్యభివాదం చేసి, అమ్మవారి విగ్రహానికి అభిముఖంగా ఆసీన అయింది.

"అప్పుడే పూర్తి అయిందా పూజ !"

"పురిటిల్లు గదా తల్లీ ! అమ్మవారికి దీపారాధన మాత్రం చేశాను తల్లీ."

"అవును మరిచిపోయాను.... అయ్యవారూ, మా మనవడు పుట్టిన నక్షత్రం మంచిదేనా ?"

"దివ్యంగా వుంది తల్లీ."

"మంచిది."

రాణి ఆ తర్వాత కొన్ని క్షణాలు ధ్యాన నిమగ్నురాలయింది.

పూజాగృహం నుంచి ఆమె కోడలిని చూడడానికి వెళ్ళింది.

చొక్కమ్మ ఆమెకు ఎదురువెళ్ళి ఆహ్వానించింది.

"రాత్రంతా నిద్రపోలేదమ్మా చిన్నరాణిగారు....ఏమిటో కలవరిస్తూనే వున్నారు...."

"ఊఁ!"

రాణి ముద్దమ్మ మంచం వద్దకు వెళ్ళింది.

ఉయ్యాలలో ఉన్న మనవణ్ణి ముద్దాడింది.

"ఏమిటమ్మా ! రాత్రంతా సరిగా నిద్రపోలేదట నువ్వు ! వైద్యులేమన్నారు ?" రాణి కోడలిని ప్రశ్నించింది.

"ఏదో మందిచ్చారు తల్లీ" చొక్కమ్మ ప్రత్యుత్తర మిచ్చింది.

"ముద్దమ్మా !"

కోడలేమీ పలకలేదు.

రాణి అక్కడే కూర్చుంది. చొక్కమ్మ చెంత నిలబడింది! మిగిలిన పరిచారికలు వెళ్ళిపోయారు.

ఉన్నట్టుండి ముద్దమ్మ, "నాకు జీవించాలనిలేదు" అంది.

ఆ మాటలు రాణికి అశనిపాతంలా తోచాయి. కాలి క్రింది నేల కంపించినట్లనిపించింది, పరిసరాలు అంధకార బంధురాలయినాయి.

"ఆ రోజు నేను సహగమనం చెయ్యబోతుంటే నన్నెందుకు వారించారు ? నా భర్తకు నన్నెందుకు దూరం చేశారు ? నేనింక జీవించడం అనవసరం. అసలు నాకు జీవించాలని లేదు...."

ముద్దమ్మ మాటలు రాణిని చిత్రవధ చేశాయి. ముద్దమ్మ ముఖతః యిలాంటి కర్కశవాక్యాలు వెలువడతాయని ఆమె యెన్నడూ అనుకోలేదు.

"ముద్దమ్మా...."

"ఇప్పుడు మీరేమీ నాకు చెప్పనక్కరలేదు."

"అది కాదమ్మా, నీ మంచిని కోరే నేనలా చేశాను...."

"మీరు చేసింది మంచిపనా? పైగా నా మంచిని కోరే మీరలా చేశారా? ఎవరైనా వింటే నవ్విపోదురు...."

"నిండుమూలాలు బలవంతంగా ప్రాణత్యాగం చెయ్యడం మంచిది కాదనుకున్నాను. పైగా నీ కడుపున వున్న శిశువుని చేజేతులారా చంపడం మహాపాపమని భావించాను. అది శిశుహత్య అవుతుంది. శిశుహత్యను మించిన పాపం మరొకటి లేదు...."

"మీరెన్ని చెప్పండి. నేను తీరని అపచారం చేశాను. అనుగతంగా వస్తున్న ఆచారాన్ని అతిక్రమించి పాపం మూటకట్టుకున్నాను" అంటూ చెంతనున్న తలగడతో ముఖం కప్పుకుంది ముద్దమ్మ.

"ముద్దమ్మా, కంట తడిపెడుతున్నావా! పచ్చివాళ్ల ఆరోగ్యం పాడవుతుంది. ఆ తర్వాత ఏమనుకునీ లాభంలేదు...."

"ఆ విధంగానైనా నేను త్వరగా కన్నుమూస్తే...."

"ఏమిటమ్మా, యీ పిచ్చిమాటలూ నువ్వూను ..." అంటూ ముద్దమ్మ ముఖంమీద కప్పుకున్న తలగడను రాణి యివతలికి లాగింది.

రాణి హతాశురాలయింది. ముద్దమ్మ యేడుస్తోంది, కళ్లు జ్యోతుల్లా వున్నాయి.

"పిచ్చిపిల్లా, యేడుస్తున్నావా! నీకేం తక్కువ చెప్పు? పండంటి కొడుకుని కన్నావు. ఎవరనుకున్నావు నీ కొడుకు? ఈ రాజ్యానికి ప్రభువు! ఆ పసికందుని చూస్తూ కాలక్షేపం చెయ్యవచ్చు...." రాణి కోడల్ని అనునయించింది.

ముద్దమ్మ ముఖం తిప్పుకుంది.

ఆమె ప్రవర్తన రాణికి నచ్చలేదు. కోడలితో ఏం మాట్లాడినా ఆమెను రెచ్చగొట్టినట్లవుతుందనీ, మౌనం వహించడమే శ్రేయోదాయకమనీ భావించింది. అక్కడ కూర్చోడానికి కూడా మనస్కరించలేదు. మనవణ్ణి ఒక్కసారి చూసి, రాణి వెలుపలికి వచ్చింది.

ద్వారందాకా వెంటవచ్చిన చొక్కమ్మ రాణివద్ద అనుజ్ఞ తీసుకుని పురిటిమంచం వద్దకు వచ్చింది.

రాణిని సాగనంపి చొక్కమ్మ తన వద్దకు రావడం గమనించింది ముద్దమ్మ.

"ఏం చొక్కమ్మా, నా మాటలు విని అత్తగారు నొచ్చుకున్నారా?"

"మీ మాటలకు నేనే నొచ్చుకున్నానమ్మా."

"అవునవును, నువ్వు మా అత్తగారి మనిషివి గదా !"

చొక్కమ్మ అభిమానం దెబ్బతిన్నది. ఆమె నరనరాలలో వున్న స్వామిభక్తి రెక్కలు విప్పుకుంది.

"నేను మీ అత్తగారి మనిషిని కాదమ్మా. మహారాణి మంగమ్మగారి మనిషిని! మేము కొన్ని తరాలుగా మీ పెద్దల దయాదాక్షిణ్యాలవల్లనే బ్రతుకుతున్న వాళ్ళం. మాకు రాజభక్తి తప్ప మరొకటి తెలీదు. కనుకనే మహారాణిగారి సమక్షంలో మీరావిధంగా మాట్లాడేసరికి నా మనస్సు చివుక్కుమంది.... రాణిగారు కాబట్టి సరిపెట్టుకున్నారు గాని, మరొకరైతే యీపాటికి పెద్దగొడవ జరిగివుండేది...." చొక్కమ్మ, అదను దొరికింది గదా అనుకుని, తన మనస్సులో అక్కసుని వెళ్ళగక్కింది.

చొక్కమ్మ ప్రదర్శించిన రాజభక్తిని చూసి ముద్దమ్మ నివ్వెరపోయింది.

"నా మనస్సులో ఏమున్నా, మా అత్తగారిముందు నేనలా మాట్లాడడం అసమంజసమే చొక్కమ్మా," చాలా విచారిస్తున్నాను."

"ఎన్ని మాటలనుకున్నా, మీరూ మీరూ అత్తాకోడళ్లు" అంటూ మందహాసం చేసింది చొక్కమ్మ.

పౌత్రిళ్ళ నిదురిస్తున్న శిశువు ఉన్నట్టుండి కెవ్వుమన్నాడు.

చొక్కమ్మ సముదాయించింది, అయినా యేడుపు మానలేదు.

"అమ్మా, ఆకలయినట్లుంది అబ్బాయిగారికి...."

ముద్దమ్మ మౌనం వహించడంతో, చొక్కమ్మ సహనం నశించింది. "అమ్మా, మీ పట్టుదల కట్టిపెట్టి, అబ్బాయిగారికి పాలివ్వండి" అంది.

ఆ రోజు రాణి చాలా బాధపడింది.

రాజ్య వ్యవహారాలు మాట్లాడే నిమిత్తం అధికారులు కొందరు ఆమె నివాసానికి వచ్చారు. సాధారణంగా మంత్రులు, దండనాథులు, ఉన్నతోద్యోగులు రాణిగారి దర్శనార్థం వచ్చి వెడుతూ వుంటారు. వారి యోగ క్షేమాలు విచారించడంతోపాటు, రాజ్యవ్యవహారాలు కూడా చర్చించడం రాణికి అలవాటు. ఆ అధికారులు చాలాసేపు రాణిగారి రాకకోసం నిరీక్షించారు.

"మహారాణిగారు అస్వస్థులుగా వున్నారు" అని ఒక పరిచారిక వచ్చి చెప్పింది.

"రెండు మూడు గంటలుండి రావచ్చునా ?" ఒక అధికారి ప్రశ్నించాడు.

"మహారాణిగారెందుకో నేడు చాలా నీరసంగా వున్నారు. ఇంత వరకూ పచ్చిగంగ కూడా ముట్టుకోలేదు."

రేపు వచ్చి దర్శిద్దాము అని వాళ్ళల్లో వాళ్ళు చర్చించుకుని, ఆ అధికారులు వచ్చిన దారిని వెళ్ళిపోయారు. మనవడు కలిగినా, రాణిగారెందుకు నిరుత్సాహంగా వున్నారో అంతుపట్టక తికమక చెందారు. తలోరకంగా వ్యాఖ్యానించుకుని తృప్తిపడ్డారు.

ఆనాడు రాణి మనస్సు బాగా వికలమయింది. కోడలు ఎప్పుడు తనముందు ఆ విధంగా మాట్లాడలేదు. కనుకనే విభ్రాంతపోయింది. కోడల మనస్సు ఎలాంటిదో తెలిసేసరికి హతాశురాలయింది. ఆమె మాటల వినగానే, కోపం వచ్చింది. కాని తమాయించుకుంది. ఎంత తమాయించు కున్నా, కోడలు ఏదో అఘాయిత్యానికి పాల్పడుతుందనే సందేహం కలిగింది, రాణి భయవిహ్వల అయింది.

పరిచారికలు రాణిని చాలా బలవంతం చేశారు, భోజనం చెయ్యమని మొదట్లో నిరాకరించినా, చివరికి వారి అభ్యర్థనను మన్నించింది. కోడల గురించి ఇక ఆలోచించడం అనవసరమనుకుంది. పరిస్థితులకు అనుగుణంగా సంచరించడమే కర్తవ్యమనుకుంది. అనుకున్నదే గాని అలా వుండలేక పోయింది.

భోజనానంతరం ఆనాడు రాణి విశ్రాంతి తీసుకోలేదు.

శయ్యాగృహంలో కూర్చుని గవాక్షం ద్వారా మార్చి మార్చి వైఘా నదినీ, మీనాక్షీ అమ్మవారి గుడి గోపురాలనూ తిలకించసాగింది. తాను కాపురానికి వచ్చినప్పటినుంచీ, వాటిని ఆమె చూస్తూనే వున్నది. కాని అవి ఆనాడెందుకో క్రొత్తగా కనిపించాయి. తమ పెద్దలు అమ్మవారి ఆలయానికీ అయ్యవారి గుడికీ చేసిన దానధర్మాలు స్ఫురణకు వచ్చాయి. దానశీలం, ధర్మగుణం ఎంత విశిష్టమైనవి. ముఖ్యంగా ముద్దు తిరుమలశౌరి నాయనింవారి నిర్మాణాలు గుర్తుకి వచ్చాయి. రాణికి మేను గగుర్పొడిచింది. ఆ మహారాజువంటి కళాభిజ్ఞులు చరిత్రలో ఎందరున్నారని! ఒక్క సారి మధురానగరం ఆమె మనోనేత్రం ముందు గోచరించింది. మధుర సుందర నగరం కావడానికి ఆ మహారాజు నిర్మించిన అద్భుత నిర్మాణాలు కారణం గదా! ఆ మహనీయుడు నిర్మించిన రాజగోపురాలు, పునరుద్ధరించిన జీర్ణాలయాలు అన్నిటినీ గుర్తు చేసుకుంది. మనస్సు పరవశించింది. నా వ్యథాభరిత జీవితానికి యీ మధురస్మృతులే స్వాతిచినుకులు అనుకుని

తృప్తి చెందింది. ఆ మధురస్మృతులు మనస్సుని ఆక్రమించుకునేసరికి జీవితంపట్ల అనురక్తి కలిగింది. మా పెద్దలు నిర్మించిన యీ కళాఖండాలను పరిరక్షించడం మా విధ్యుక్త ధర్మం ! ఈ శిల్ప సంపదని చూసి భావితరాల వారు ఆశ్చర్యావహులవుతారు.... అనవసరంగా జీవితాన్ని ద్వేషించాను. జీవితంపట్ల విరక్తి పెంచుకున్నాను. ఒడుదుడుకులూ తప్పవు ! ధైర్యంగా సమస్యల్ని ఎదుర్కొంటాను.... ధైర్యస్థయిర్యాలు కూడగట్టుకుంది....

గవాక్షం నుంచి వెనక్కి తిరుగుతూ, "ఎవరక్కడ ?" అంది. ఆ కంఠస్వరంలో ఎంత గాంభీర్యం !

"అమ్మా !" ద్వారంచెంత నిలబడిన పరిచారిక ప్రత్యుత్తర మిచ్చింది.

"పౌరాణికులు వచ్చారా !"

"వచ్చి చాలాసేపయింది తల్లీ ! "

"మరి మాతో చెప్పలేదే ?"

"తమరేదో ఆలోచిస్తూ గవాక్షంచెంత వున్నారు. తమకు అంతరాయం కలిగించకూడదని నేనిక్కడే నిలబడ్డాను."

రాణి స్నాన మందిరానికి వెళ్ళి ముఖ ప్రక్షాళనం చేసుకుని తిరిగి వచ్చింది. ఆ పరిచారిక చీర మార్చింది. ఆమె ముందు నడవగా, శయ్యా గృహానికి అనుకుని వున్న విశాలమందిరానికి వెళ్ళింది రాణి.

పౌరాణికుడు లేచి నిలబడ్డాడు. ముకుళితహస్తుడయ్యాడు.

"తాము వచ్చి చాలాసేపయిందట ! కూర్చోండి."

"తమరు బహుకార్య నిమగ్నులు. మావంటి వారివల్ల తమకు ఎలాంటి అంతరాయమూ కలగకూడదని తమ పరిచారికకు చెప్పాను. అందుకనే ఆమె తమకు గుర్తుచేసి వుండదు.

"అయ్యవారూ, పురిటికి వచ్చిన మీ అమ్మాయి ఆరోగ్యంగా వున్నదా ?"

"ఆరోగ్యంగా వుంది తల్లీ. అంతా తమ దయ. తమరు కనిక రించారు కనుక వైద్యసదుపాయాలు బాగా జరిగాయి...."

"అమ్మవారి అనుగ్రహమనండి....అది సరే, మీ అమ్మాయి అత్తవారి వూరు ఏ వూరన్నారు ?"

"తిరునవ్వేలి తల్లీ."

"ఏమిటి, అంతదూరాన కూడా మన తెలుగువాళ్ళున్నారన్నమాట!"

"లేకేం తల్లీ ! దక్షిణాపథంలో పట్టణాలలోనేకాక పల్లెటూళ్ళలో కూడా మన తెలుగు కుటుంబాలు చాలా వున్నాయి...."

"తిరునవ్వేలి అంటే గుర్తుకి వస్తోంది. మా పూర్వులు విశ్వనాథ నాయనయ్యవారు మధురలో అడుగిడిన మరుక్షణమే ప్రాచీన పాండ్య రాజుల సంతతికి చెందిన అయిదుగురు రాజులు ఆయన్ని ప్రతిఘటించారు. ఆ పంచపాండ్యులు లేవదీసిన తిరుగుబాటుని అణచివేయడంకోసం విశ్వనాథనాయనయ్యవారు తిరునవ్వేలిమీదికి దండెత్తి వెళ్ళవలసి వచ్చింది. ఆయన పంచపాండ్యులతో స్వయంగా యుద్ధం చేశారు. ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాలకు ఆశ్చర్యపోయి, పంచపాండ్యులు చివరికి సంధి చేసుకున్నారు. తదాదిగా తిరునవ్వేలిసీమ మా అధీనంలోనే ఉంది."

"నిజమే తల్లీ, ఆ రోజుల్లో విశ్వనాథనాయనయ్యవారితోపాటు మా పూర్వులు తిరునవ్వేలికి వెళ్ళి అక్కడే స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు...."

"అవును అయ్యవారూ, ఎక్కడో తిరునవ్వేలిలో ఉంటూ కూడా మీరూ మీ బిడ్డలూ తెలుగు ఎలా నేర్చుకున్నారు ?"

"మాతృభాషను మరిచిపోవడం అసాధ్యం తల్లీ. అయితే మా తెలుగులో తిరునవ్వేలిసీమకు చెందిన కొన్ని మాటలు ప్రవేశించి ఉండ వచ్చు. అంతమాత్రాన మాది తెలుగు కాకపోదు...."

రాణి మందహాసం చేసింది.

"మీరు లెస్సగా అన్నారు. మధురలో మాట్లాడినా, తంజావూరులో మాట్లాడినా తిరునవ్వేలిలో మాట్లాడినా తెలుగు తెలుగే...."

"నిజం తల్లీ. ఎందరో తమిళులు కూడా తెలుగు నేర్చుకుని తెలుగులో పాండిత్యం గడించారు. నిజం చెప్పాలంటే, నేను మొదట్లో ఒక తమిళ విద్వాంసుడివద్దనే తెలుగు అభ్యసించాను...."

"మరి భాగవత రామాయణాలు ?"

"లింగనమఖి కామేశ్వరకవిగారి బంధువు ఒకరు మా వూళ్ళో ఉండేవారు. ఆయన వద్ద శుశ్రూషచేసి క్షుణ్ణంగా చదివాను."

"అలాగా....విన్న కృష్ణావతార ఘట్టం మొదలు పెట్టారు.... దళవాయిగారు రావడంతో అంతరాయం కలిగింది...."

"అవును తల్లీ, మళ్ళీ మొదటినుంచీ ప్రారంభించమంటారా ?"

"ఎన్నిసార్లు విన్నా యింకా వినాలనిపించే రమణీయమైన ఘట్టం.... తమకు అభ్యంతరం లేకపోతే మొదటినుంచీ ప్రారంభించండి."

పౌరాణికుడు కృష్ణావతార ఘట్టం ప్రారంభించాడు. శ్రావ్యమైన శారీరం. ప్రతిపద్యం పరమ రమణీయం.

రాణి మధ్య మధ్య కనులు మూసుకుని తల ఊపుతూ రసాస్వాదన చేస్తున్నది.

పౌరాణికుడు తన సహజ ధోరణిలో చదువుతూ వ్యాఖ్యానిస్తూ, నడుమ నడుమ రాణిగారి ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు యిస్తున్నాడు....ఈశ ! విశ్వమెల్ల నీవ, వేరు లేదు-అని చదివి, అ పద్యానికి అర్థతాత్పర్యాలు వివరించడానికి ఉపక్రమించాడు.

"అయ్యవారూ, ఆత్మవలన....ఏదీ ఆ పద్యం మళ్ళీ చదవండి...."

'ఆత్మవలన గలిగి అమరు దేహాదుల
నాత్మకంటె వేరు లవి యటంచు
దలచువాడు మూఢతముడు, గావున నీశ !
విశ్వమెల్ల నీవ, వేరు వేరు.'

ఆత్మవలన కలిగి.... ఆత్మకంటె వేరులవి.... మూఢతముడు.... విశ్వమెల్ల నీవ.... అని మననం చేసుకుంటూ రాణి తన్మయత్వంతో, “పోతన్నగారు ఎంత రమ్యంగా చెప్పారండి! మా వంటి సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తేటతెలుగులో ఆధ్యాత్మిక భావాలను తేటతెల్లం చేశారు. విశ్వమంతా భగవత్‌స్వరూపమే!.... అయ్యవారూ, మేము చదువుకున్నది తక్కువ. కాని పోతన్నగారి పద్యాలు వింటుంటే, అమృతం కూడా చప్పగా వుంటుంది. మాకు తెలిసినంతవరకూ, పోతన్నగారి భాగవతాన్ని మించిన రసవద్గ్రంథం తెలుగులో మరొకటి లేదేమో!....” అన్నది.

“తమరు సెలవిచ్చింది వాస్తవం కాదనను, అయినా....”

“చెప్పండి అయ్యవారూ, తెలుసుకుంటా.”

“కవిత్రయం వారి మహాభారతం కూడా పోతన్నగారి కృతివంటిదే తల్లీ.”

“కావచ్చు. కాని మహారాజావారు భాగవతాన్ని ఎందుకు అభిమానించే వారో యిప్పుడు మాకు తెలియవస్తున్నది....”

“రామాయణమన్నా మహారాజావారికి అంతులేని అభిమానం తల్లీ.”

“అవునవును. సకల రాజ్యవ్యవహారాలను మా మరిదిగారిని చూడమని చెప్పి, ఆయన భాగవత రామాయణ గ్రంథ కాలక్షేపం చేస్తూ వుండేవారు.... కాని మాకెందుకో భాగవతం మీదనే చెప్పనలవికాని మక్కువ యేర్పడింది....”

“భాగవతం సామాన్య గ్రంథమా తల్లీ! కృష్ణమూలం! పైగా పోతన్నగారి కవిత్వం పండితపామర రంజకం.... తేనెకన్న తియ్యనిది. ఆయనేమో భక్తుడు....”

రాణి ఆలోచనా నిమగ్నురాలయింది. ఆమె మనస్సుని పసిగట్టి తన ప్రవచనాన్ని ఆపివేశాడు పౌరాణికుడు.

అలా కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి.

"అయ్యవారూ, మా పూర్వులు గుళ్లు గోపురాలు ఎన్నో కట్టించి ప్రజలకు మహోపకారం చేశారు. దానధర్మాలెన్నో చేశారు. లలితకళల్ని ఆదరించారు. వర్ణచిత్ర విద్యను ఎంతగానో ప్రోత్సహించారు. ముద్దులు మూటగట్టే వర్ణచిత్రాలు అనేకం వెలయింపజేశారు. ఆలయంలో కప్పుల్లో అద్భుతమైన వర్ణచిత్రాలు వేయించారు...."

"అవును తల్లీ. తమ పూర్వుల చిత్రకళాభిమానాన్ని వేనోళ్ళ పొగడినా, పూర్తిగా పొగడలేము. మధురలో చిత్రకారులకోసం విడిగా వీధి ఒకటి వెలిసింది...."

"సమయానికి గుర్తు చేశారు. చిత్రకారులకు ప్రత్యేకంగా వీధి యేమిటని పెద్దలు కొందరు మొదట్లో ఆక్షేపించారట.....చిత్రకారులంటే మా పూర్వులు ఎంత అభిమానమో చెప్పడానికే యీ సంగతి మీకు చెప్పాము.... కాని మన తెలుగు సాహిత్యాన్ని అంతగా మా పూర్వులు ఎందుకో పోషించలేదు...."

"పోషించకేం తల్లీ ! ముద్దు తిరుమలశౌరినాయనింవారూ ముద్దళగిరి నాయనింవారూ యథోచితంగా కవి పండితుల్ని సమాదరించారు."

"మావారి కళాభిజ్ఞత ముందు, అది నామమాత్రమనే మా ఉద్దేశం. లింగనమఖికామేశ్వర కవి, గణపవరపు వేంకటకవి వంటి ఉద్దండపండిత కవులు మన మధురలో జీవించారు...."

"లింగనమఖివారు ఎంత గొప్పవారకున్నారు! అయినా నలుగురికి అర్థమయ్యేలా కవిత చెప్పాలన్నదే ఆయన ధ్యేయం. తమరు అనుమతిస్తే, ఆయన తనను గురించి చెప్పుకున్న ఒక పద్యం మనవి చేస్తాను."

"మహారాజావారికి ఆయన తమ ధేను మాహాత్మ్యం కృతియిచ్చారు. కృతి యిచ్చిన సందర్భంగా ఆయన్ని దర్శించాము. ఆయన రచనల్లా

ఆ కృతి కూడా గంభీరం.... ఆయన చెప్పుకున్న ఆ పద్యం చెప్పండి...."

"కాకులవలె ఇంటింటను
కాకవులున్నారు, హంస కైవడి భువిలో
శ్రీకామ! నీకె తగురా
యేకడ నుడిపాలు నీరు నేర్పరుపంగన్.

ఆయన కవుల్లో హంసవంటివాడు...."

"చాలా గడుసువారే! సౌమ్యస్వభావులనుకున్నాను.... శ్రీకామా అని చెప్పుకున్నారు. కామేశ్వరకవి కాదా ఆయన పేరు?" రాణి ప్రశ్నించింది.

"అమ్మా, ఆయన్ని కామేశ్వరకవి అని వ్యవహరించేవారు. పెద్దలు పెట్టిన పేరు శ్రీకామేశ్వరుడే.... తమరు పేర్కొన్నారు చూడండి, ధేను మాహాత్మ్యంలో ఆయన 'సత్కవి తిరుకామకోవిద శిఖామణి'— అని చెప్పుకున్నారు...."

"లెస్సగా వుంది! తిరుకాముడన్నా శ్రీకాముడన్నా ఒకటే.... కళా హృదయులైన మా పూర్వులు కవిపండితులపట్ల ప్రదర్శించవలసినంత ఆదరాభిమానాలు ప్రదర్శించకపోవడం శోచనీయమే ..."

"ఒక్క తెలుగువారినే కాదు, తమిళ కవిపండితుల్ని కూడా ఆదరించిన సహృదయులు ముద్దు తిరుమలశౌరినాయనయ్యవారు."

"ఆ పుణ్యాత్ముడు అక్షరాలా అన్నివిధాల మహనీయులే. తమిళ కవుల్ని ఆదరించి ఆయన తమ సహృదయతను చాటుకున్నాడు. మాతృ భాషాభిమానంతోపాటు ప్రాంతీయ భాషాభిమానం కూడా తప్పనిసరిగా వుండాలని ఆ మహనీయుడు మాకు తెలియజేశారు.... కుమర గురుపరర్ అనే మహాపండితుడు మీనాక్షియమ్మన్‌కురం కావ్యాంతంలో నాయనింవారిని ప్రస్తుతిస్తూ మంచి పద్యం చెప్పారు.... అది మీకు గుర్తుందా, అయ్య వారూ...."

"అది ఆశీః పూర్వకంగా చెప్పిన పద్యం తల్లీ....
సీర్ వాళి, తెన్ మదురై నిన్మలర్ అరుళ్‌వాళి,
కార్‌వాళి, అంగయర్కణ్ కన్ని త్తిరుమరుళ్ వాళి,
సీర్ వాళి, కూడల్‌నగర్ త్తిరుమలై బూపతి వాళి,
పేర్‌వాళి, అవన్ చెల్వం పెరితూళి వాళియవే."

"మంచి పద్యం వినిపించారు.... నాయనింవారి కోరికను పురస్కరించుకుని ఆయన అమ్మవారి మీద 'పిళ్ళైత్తమిళ్' వెలయించినట్లు చెపుతారు ... అది భక్తి రసప్రధానమైన రచన అనీ చెపుతారు.... అయ్యవారూ, పిళ్ళైత్తమిళ్ అంటే యేమిటి? చాలాకాలంగా తెలుసుకోవాలని కోరిక...."

"అమ్మా, క్షమించాలి. ఆ విషయం నాకంతగా తెలియదు. తమిళ దేశంలో ఆ బాల్యం జీవిస్తున్నా, తమిళ సాహిత్యం గురించి తెలుసుకోక పోవడం ఒక లోపంగానే భావిస్తున్నాను...."

"పోనీ మీకు తెలిసినంతవరకే చెప్పండి."

"చిత్తం తల్లీ. పిళ్ళైత్తమిళ్ ఒక సాహిత్య ప్రక్రియ. నాకు తెలిసినంతవరకూ యిది ఇతర భాషలలో లేదు. పెరియాళ్వారు నామాంతరం కలిగిన విష్ణుచిత్తులవారు శ్రీకృష్ణుని శిశువుగా సంభావించి యిందుమించు యిన్నూరు గీతాలు ఆలపించారు. బిడ్డతో ఆటలాడగా చందమామను రమ్మని పిలవడం, బిడ్డ తప్పటడుగులు వెయ్యడం, చప్పట్లు కొట్టడం, బిడ్డకు బూచిని చూపడం, చెవులు కుట్టడం, తల దువ్వేటప్పుడు బిడ్డను మరిపించేందుకుగాను కాకిని పిలవడం, సంజవేళలో బిడ్డకు దృష్టి తియ్యడం, బిడ్డచేసే చిలిపిపనులు భరించలేక యిరుగుపొరుగు వారు మొరయిడగా అది విని తల్లి దుఃఖించడం — యిలా ఒక్కొక్క దశనూ పదేసి గీతాలలో ఆయన అభివర్ణించారు. కాని తరువాతి కాలంలో పది

దశలను మాత్రమే అభివర్ణించడం జరిగింది. శివుడికి సంబంధించిన వంద గీతాల రచనకు పిళ్ళైత్తమిళ్ అనే వ్యవహార నామం కలిగింది. మొదట్లో పిళ్ళై రచన భగవంతుని పరంగానే వుండింది. రాను రాను మహారాజులను గురించీ మహనీయులను గురించీ కూడా పిళ్ళైత్తమిళ్ రచనలు వెలువడ్డాయి."

"తెలీదంటూనే పిళ్ళైత్తమిళ్ గురించి ఎన్నో విషయాలు చెప్పారు. చాలా సంతోషం అయ్యవారు.... మీకెప్పుడైనా వీలుంటే అమ్మ వారిని గురించి ఆయన చేసిన రచననుంచి మూడు నాలుగు గీతాలైనా మాకు వినిపించాలి...."

"చిత్తం తల్లీ."

"ఎవరో ఒక తమిళకవి తిరుమలశౌరి నాయనయ్యవారిని అధిక్షే పిస్తూ 'తొన్డి వడుగన్ అన్నారట! నాయనింవారికి చిరుబొజ్జ వుండేదని చెపుతారు. అంతమాత్రాన బొజ్జగల తెలుగువాడని అధిక్షేపించాలా?" అడిగింది రాణి.

"అమ్మా, తమకు తెలియందేముంది? కొందరు కవులు అలాగే ప్రవర్తిస్తారు. నచ్చితే ఆకాశానికి ఎత్తివేస్తారు. నచ్చకపోతే అధఃపాతాళా నికి తొక్కివేస్తారు. ఏమిటో వింత ప్రవృత్తి!"

ఇదీ మనిషిలో కనిపించే సామాన్య లక్షణం. పెడితే పెళ్ళి, పెట్టక పోతే శ్రాద్ధం అనే లోకోక్తి వూరికే వచ్చిందంటారా? ఇంతకూ ఆ కవి గారి పేరేమిటి, అయ్యవారూ?"

"సుప్రదీప కవిరాయర్ అని ఒక మహాపండితుడు వుండేవాడు. ఆయన తిరుమలై నాయక్కర్ కాదల్ అనే కావ్యం వ్రాశాడు. ఆ కావ్యాన్ని నాయనయ్యవారు ఎందువల్లనో ఆదరించకపోవడంతో, కూళప్పనాయక్కన్ కాదల్ అని పేరు మార్చి, ఒక సామంతరాజుకి అంకితమిచ్చాడు...."

రాణి నవ్వి ఊరుకుంది.

# 5

రాణి శంకించినట్లుగా చివరికి జరిగింది. మనవడు మాతృ విహీను డయ్యాడు.

చొక్కమ్మ మరికొందరు పరిచారికలు వెయ్యికళ్లతో చూస్తున్నా, జరగకూడని దుర్ఘటన జరిగింది.

ఆనాడు అంతఃపురం శోకార్ణవమయింది.

మధురానగరవాసులు అది దుర్దినమని భావించారు.

కొందరు ముద్దమ్మను బహువిధాల ప్రశంసించారు. కొందరు ఆమె చేసిన అఘాయిత్యాన్ని నిశితంగా విమర్శించారు. కొందరు ఆమెను దేవతగా అభివర్ణించారు. కొందరు ఆమెను కర్కశ హృదయగా పేర్కొన్నారు. ఎవరేమనుకుంటే యేం, ముద్దమ్మ ఆత్మత్యాగం చేసుకుంది!

సంతానం కలిగిన తర్వాత, ముద్దమ్మకు జీవితేచ్ఛ సహజంగా కలుగుతుందని రాణి కలలు కన్నది. కాని ముద్దమ్మకు జీవితేచ్ఛ సమూలంగా నశించింది. జీవితమంటే రోత కలిగింది. మాతృత్వం కూడా ఆమె మనస్సుని మార్చలేకపోయింది. భర్తృ మరణానంతరం తాను జీవించి వుండడం మహాదోషమనుకుంది. సంప్రదాయాన్ని పాటించకపోవడంవల్ల తనకు తీరని కళంకం సంక్రమించినట్టు తలచింది. సంప్రదాయాన్ని పాటించడమే శ్రేయోదాయకమని మనసార భావించింది. స్త్రీ సహజమైన సారళ్యం ఆమెలో మటుమాయమయింది.

ఆత్మహత్య చేసుకుని ప్రాణత్యాగం చెయ్యాలని ముద్దమ్మ నిశ్చయించుకుంది. కాని చొక్కమ్మ ప్రభృతులు తనను వెయ్యికళ్ళతో గమనిస్తూ వున్నారు. వాళ్ళ కళ్ళుకప్పి సంచరించడం ఆమెకు గగన మనిపించింది. తన వజ్రపు టుంగరంలోని వజ్రాన్ని వెలికితీసి, పొడిచేసి

ఆ పొడిని నీటిలో కలిపి, తాగి, ప్రాణత్యాగం చెయ్యాలనుకుంది. ఉంగరం వెలికి తీస్తుంటే చొక్కమ్మ చూసింది.

"అమ్మా, ఉంగరం తీస్తున్నారెందుకు?" అడిగింది.

"ఊరికే."

"అమ్మా, మీరేమన్నా అఘాయిత్యానికి పాల్పడితే నేను సహించలేను. పైగా తమకిది తగని పని. పసికందుకి అన్యాయం చెయ్యడం మహాపాపం!" కొంచెం గట్టిగానే మందలించింది.

గత్యంతరంలేక వేలికి ఉంగరం పెట్టుకుంది ముద్దమ్మ.

అప్పటికప్పుడే ఒక పరిచారిక, బాణంలా దూసుకెళ్ళి, రాణికి విషయం తెలియజేసింది.

ముద్దమ్మ హతాశురాలయింది. కాని తన నిశ్చయాన్ని మాత్రం మార్చుకోలేదు. పైపెచ్చు ఆమెలో పట్టుదల పెరిగింది. మార్గాంతరం ఆలోచించసాగింది. పురుడు వెళ్ళేంతవరకూ చన్నీళ్ళు తాగకూడదు-అన్న వైద్యుని మాటలు గుర్తుకి వచ్చాయి. అందుకే తనకు కాచిన నీళ్ళు యిస్తున్నారని గ్రహించింది.

వైద్యుని మాటలు స్ఫురణకు రావడంతో ముద్దమ్మకు ఎక్కడలేని సంతోషం కలిగింది. కొత్త ఉత్సాహం వచ్చింది. ఆమెను చూసి చొక్కమ్మ ఆశ్చర్యపోయింది.

"ఇప్పుడు మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో సంతోషంగా ఉందమ్మా."

"నిజంగానా చొక్కమ్మా!"

"అవునమ్మా, మీ సంతోషమే నా సంతోషం."

ముద్దమ్మలో ఆకస్మికంగా వచ్చిన యీ మార్పుని రాణికి తెలియజేయాలన్న సంబరంకొద్దీ, "యిప్పుడే వస్తానమ్మా" అంటూ చొక్కమ్మ రాణి నివాసానికి బయల్దేరింది.

చొక్కమ్మ వెళ్ళడం తరువాయి, తన అదృష్టం పండినట్లు భావించింది ముద్దమ్మ. "ఎవరక్కడ ?" అంది.

మరుక్షణంలో ద్వారంవద్ద వున్న పరిచారిక పురిటి మంచానికి దూరంగా నిలబడి,

"అమ్మా !" అని ఆజ్ఞకోసం ఎదురుచూసింది.

"అళగమ్మా ! నువ్వా ! ఇలారా."

నవ్వుతూ ముద్దమ్మ పిలిచేసరికి ఆమె పురిటి మంచం సమీపించింది.

"అళగమ్మా ! నువ్వంటే నాకు చాలా అభిమానం."

చిన్నరాణి అభిమానానికి పాత్రురాలనయ్యాననే వెర్రిసంబరం అళగమ్మకు కలిగింది.

"ఒళ్ళు బంకలు సాగుతోంది. చన్నీళ్ళు తీసుకురా, నేను తుడుచుకుంటాను."

"తమ కెందుకమ్మా ఆ పని ! నేనున్నానుగా" అంటూ ఆమె చన్నీళ్ళు తెచ్చింది.

"ఇంత చిన్నపని నీ చేత చేయించుకోవడం నాకు నచ్చదు అళగమ్మా. ఆ పాత్ర అక్కడుంచి, నువ్వు వెళ్ళి నీ పని చూసుకో" అంది ముద్దమ్మ, ప్రేమ ఒలకబోస్తూ.

ఆమె మాటలు నమ్మింది అమాయకురాలు అళగమ్మ.

అంతే, ముద్దమ్మ గడగడ ఆ చల్లనినీళ్లు తాగింది. దుప్పటి కప్పుకుని పడుకుంది.

చొక్కమ్మ వచ్చింది. పడుకున్న చిన్నరాణిని లేపడం ఎందుకని ఆమె మందిర ద్వారం వద్దకు వెళ్ళి అళగమ్మతో లోకాభిరామాయణం ముచ్చటించసాగింది.

చీకటి పడింది.

అంతఃపురంలో దీపాలు వెలిగించారు. తెల్లని కాంతులతో ధగధగ మెరిసిపోతోంది అంతఃపురం.

పురిటి గదిలో దీపాలు పెట్టారు.

ఎంతసేపటికి ముద్దమ్మ లేవలేదు. చొక్కమ్మకు ఎందుకో సందేహం వచ్చి, మంచం దగ్గరకు వచ్చింది. ముద్దమ్మ ఉంగరం వేలు చూసింది. ఉంగరం వుంది. సంతోషించింది. వెనక్కి తిరిగి వెళ్ళ బోతుంటే....

"అత్తగారంటే నాకు భయమా ? ఆ బ్రహ్మదేవుడు దిగి వచ్చినా నేను భయపడను...." ముద్దమ్మ మాటలు వినిపించాయి.

చొక్కమ్మ పురిటిమంచం దగ్గరికి వచ్చింది. ముద్దమ్మ కళ్ళు మూసుకునే వుంది. మళ్ళీ ఆమె మాటలు వినిపించాయి.

"మహారాణి చెప్పినంత మాత్రాన నేను వింటానా ? నా మనస్సు మార్చుకుంటానా ? ఆవిడ పిచ్చిది...."

"అమ్మా, అమ్మా" చొక్కమ్మ గొంతు గాద్గదికమయింది." అమ్మా, ఏమిటమ్మా యీ పిచ్చి మాటలూ మీరూను...."

అళగమ్మ మంచం వద్దకు వచ్చింది, నిర్ఘాంతపోయింది.

ముద్దమ్మ కళ్లు మూసుకునే వుంది. "నాకు భయమా ! ఎవ్వరూ నా మనస్సుని మార్చలేరు.... ఈ పాడు లోకంలోంచి నేను నిష్క్రమించాలి."

"వెంటనే వైద్యులికి కబురుపెట్టు.... రాణిగారికి కూడా వర్తమానం తెలుపు...."

అళగమ్మ అప్పుడే మందిరద్వారం దాటి వెళ్ళింది.

ముద్దమ్మ ఆరోగ్య వార్త రకరకాలుగా వ్యాపించింది అంతఃపుర మంతా.

చొక్కమ్మ భయకంపితురాలయింది. వణుకుతున్న చేతులతో ముద్దమ్మ కప్పుకున్న దుప్పటిని తొలగించి, ఒళ్లు తాకింది. వేడిగా లేదు. ముక్కు దగ్గర వేళ్ళు పెట్టింది. శ్వాస తగలడం లేదు.... విశీర్ణ హృదయ

అయిన చొక్కమ్మ కెవ్వుమని కేకపెట్టింది. ఆ కేక అంతఃపురమంతా ప్రతిధ్వనించింది. పరిచారికలు పురిటి గదికి వచ్చారు.

ఇద్దరు ముగ్గురు సహవైద్యులతో రాజవైద్యుడు వచ్చాడు.

రాణి హుటాహుటి వచ్చింది.

కళ్ళనీళ్ళు గుక్కుకుంటూ చొక్కమ్మ ఒక మూల నిలబడింది.

వైద్యుడు ముద్దమ్మను పరిశీలనగా చూశాడు, నాడి పరీక్షించాడు.

"కోడలికెలా వుంది ?" తడబడుతూ రాణి ప్రశ్నించింది.

ముద్దమ్మకేదో మందిస్తూ, "తల్లీ ! క్షమించాలి. కోడలుగారికి సంధి కొట్టింది" అన్నాడు వైద్యుడు.

సంధి అని వినేసరికి రాణి ఉన్నచోటనే కుప్పలా కూలిపోయింది.

"అసలే పచ్చిఒళ్ళు. చల్లని నీళ్ళు తాగి వుండాలి. అందుకే సంధి కొట్టింది...." అంటున్నాడు వైద్యుడు.

ఎన్నడూ కంటతడి పెట్టని రాణి విలపించసాగింది.

తప్పు తనద్వారా జరిగినందుకు అళగమ్మ లోలోన కుమిలిపో సాగింది. ముద్దమ్మ తనకు చెప్పినవన్నీ కల్లబొల్లి మాటలని ఆమె గ్రహించింది. తన పర్యవేక్షణలో జరగకూడని దుర్ఘటన జరిగినందుకు చొక్కమ్మ తనను తాను నిందించుకుంది. పరిచారికలు ముద్దమ్మను చూసి కన్నీరు మున్నీరుగా విలపించసాగారు.

ఆ రోదన ధ్వనులకు ఉయ్యాలలోని శిశువు మేల్కొన్నాడు. పెద్దగా ఏడవసాగాడు.

ఆ రోదన ధ్వనికి కొయ్యబారిపోయిన రాణికి స్పృహ వచ్చింది. వెర్రిగా వైద్యులవైపు చూస్తూ, "ఎలాగైనా బతికించండి" ప్రార్థించింది.

ముద్దమ్మ నాడిని పరీక్షిస్తున్న రాజవైద్యుడు పెదవి విరిచాడు. కూర్చున్న చోటునుంచి లేచి, అవనత శిరస్కుడై ఒకవైపు నిలబడ్డాడు. ఇతర వైద్యులుకూడా ఆయన్ని అనుసరించారు.

ఎలాగో ఓపిక తెచ్చుకుని రాణి లేచి, పురిటి మంచంమీద కూర్చుని కోడలిని వెర్రిగా చూడసాగింది. కోడలి బుగ్గలు తడివిందీ. మనవడి యేడుపు కూడా ఆమెకు వినిపించలేదు.

గుక్కబట్టి యేడుస్తున్న శిశువుని చొక్కమ్మ రాణి శయ్యాగృహానికి తీసుకువెళ్ళింది. సముదాయించింది. కొంతసేపటికి ఏడుపు తగ్గింది. ఉయ్యాల తెప్పించి, అందులో పడుకోబెట్టింది.

పురిటి గదిలో యింకా రోదన ధ్వనులు తగ్గలేదు.

రాణి వెర్రిచూపులు చూసి చెంత వున్న పరిచారికలు భయభ్రాంత లయ్యారు. చొక్కమ్మకేమీ తోచలేదు.

"అమ్మా, తమరే యిలా అధైర్యపడితే ఎలా చెప్పండి" అన్నాడు అప్పుడే వచ్చిన దళవాయి.

రాణి యేమీ మాట్లాడలేదు.

"ఇక జరగవలసిన కార్యం చూడాలి" అంటూ యితర మంత్రుల వైపు తిలకించాడు.

"చొక్కమ్మా !"

"అయ్యా !"

"చూడు చొక్కమ్మా, రాణిగారు యిక్కడ వుండడం మంచిది కాదు. రాణిగారిని వెంటబెట్టుకుని తీసుకువెళ్లు" అన్నాడు చొక్కమ్మ చెవిలో.

ఆమె రాణిని సమీపించింది. చెయ్యి పుచ్చుకుని మెల్లగా లేపింది. శోకభారంతో రాణి కోడలు మృతశరీరంమీద వాలిపోయింది.

"అమ్మా, నా మాట వినండి. తమకిప్పుడు విశ్రాంతి చాలా అవసరం" అంటూ దళవాయి రాణిని అనునయించాడు.

రాణి చొక్కమ్మను చూసింది. ఆ ఆలోకనం రాగద్వేష రహితం.

"ఎంత పని చేసిందో చూశావా కోడలు అంటూ చొక్కమ్మతో

కౌగిలించుకుని విలపించింది. అదీ చూసి పరిచారికలు కూడా కంటతడి పెట్టారు దేనికీ చలించని కొండలా కనిపించే రాణి నేడు మైనపుబొమ్మ కావడం చూసి అక్కడున్న వారందరూ ఆశ్చర్య విషాదాలు ప్రకటించారు. ఘాతాతప్తమైన రాణి మనస్సుని అర్థం చేసుకోగలిగారు.

చొక్కమ్మ భుజంమీద వాలి అడుగులో అడుగు వేస్తూ తన నివాసానికి బయలుదేరింది. నడగొండలా కనిపించింది.

ముద్దమ్మ ఆత్మత్యాగ వృత్తాంతం మధుర రాజ్యమంతటా కార్చిచ్చులా పాకిపోయింది. ప్రజలు రకరకాల అభిప్రాయాలు ప్రకటించారు.

"ముద్దు వీరప్పనాయనింవారు ఏకపత్నీవ్రతులు. ఆయన సహధర్మచారిణి ముద్దమ్మగారు పరమ పతివ్రత, భర్తృసేవా పరాయణ."

"ఎంత సంప్రదాయ విధేయరాలైతే మాత్రం, కన్న శిశువుమీది మమకారాన్ని కూడా చంపుకుని యిలా ప్రవర్తించి వుండకూడదు."

"ఆమెకు సంప్రదాయమే మిన్నగా తోచింది. స్త్రీ సహజమైన మాతృప్రేమను కావాలని చంపుకున్న కఠినురాలు."

"అత్తగారిమీద కోపం వుండవచ్చు. కాని అశుభమూ శుభమూ ఎరగని ఆ పసికందు ఏం అపకారం చేశాడని!

రాణి కనుసన్నల్లో, ముద్దమ్మ కన్న ఆ నెలల శిశువుని యితర పరిచారికల సహాయంతో చొక్కమ్మ పెంచసాగింది. ఆ అదృష్టహీనునికి యిప్పుడు చొక్కమ్మే తల్లీ అన్నీను! ప్రాణప్రాణంగా భావించి ఆమె చూడసాగింది.

ఆ శిశువుకి మూడవనెల వచ్చింది.

అల్లారుముద్దుగా పెరుగుతున్న ఆ శిశువుకి దళవాయి, మంత్రులు, ఉన్నతోద్యోగులు, పురప్రముఖులు ప్రభృతుల సమక్షంలో విజయరంగ

చొక్కనాథుడని నామకరణం చేసింది రాణి. ఆ విధంగా స్వర్గస్థులైన మహారాజావారి పేరు మళ్ళీ ప్రచారంలోకి వస్తుందని ఆమె ఆశించింది.

నామకరణ మహోత్సవంనాడు మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయములో అమ్మవారికీ అయ్యవారికీ అభిషేకాదులు జరిగాయి. అలాగే అళగర్- నామాంతరం గల సుందరరాజస్వామివారికీ, తిరుప్పరంకుండ్రంలోని సుబ్రహ్మణ్యస్వామివారికీ అభిషేకాదులు సభక్తికంగా నిర్వర్తించబడ్డాయి. ఆ అభిషేకాది కార్యక్రమాలను ఎందరెందరో తిలకించారు.

నామకరణం జరిగిన ఆనాటి ఉదయం రాణి సపరివారంగా మీనాక్షీదేవి ఆలయానికి వెళ్ళింది. ఆమె రాకను పురస్కరించుకుని ఆలయాధికారులు ఆలయాన్ని కనులపండువుగా అలంకరించారు. ఆలయంలోని తటాకాన్ని పరిశుభ్రం చేశారు. ఎటు చూసినా పరిశుభ్రత తాండవిస్తోంది. పరిశుభ్రతను ఎంతో పవిత్రంగా రాణి భావిస్తుందని వారికి తెలుసు. మంగళవాద్యాలతో వేదాశీస్సులతో రాణిని ఆహ్వానించారు.

సకలాభరణాలతో కైసేయబడిన అమ్మవారిని దర్శించేందుకుచర్మ చక్షువులు చాలవు! ముఖ్యులైన రాజ బంధువులను తప్ప మరెవ్వరినీ గర్భాలయంలోకి రానివ్వలేదు. దళవాయి కూడా వెలుపలే నిలబడ్డాడు. అమ్మవారి దివ్యమంగళ విగ్రహానికి రాణిసభక్తికంగా కృతజ్ఞతాపురస్సరంగా అంజలి ఘటించింది. దివ్యాభరణాలు సమర్పించింది. పట్టుపుట్టాలు సమర్పించింది. ఆమె సమక్షంలో సహస్ర నామార్చన జరిగింది. అర్చన జరిగినంత సేపు మనస్సుని అమ్మవారిమీదనే కేంద్రీకరించింది. రాజ్యవ్యవహారాది ప్రాపంచిక విషయాలను విస్మరించింది. అంతసేపు ఆమె ఎన్నడూ అమ్మవారి సమక్షంలో ఉండలేదు. అమ్మవారి వివిధాభరణాల వివరాలు అడిగి తెలుసుకుంది. ఆ తర్వాత చొక్కనాథస్వామిని సేవించింది. స్వామివారికి కూడా అర్చన జరిపించింది. ప్రదక్షిణం చేస్తూ ఆలయప్రాంగణంలో ప్రతిష్ఠితములైన వివిధ దేవతామూర్తుల్ని హృదయస్ఫూర్తిగా సేవించింది.

దుర్గాదేవి సన్నిధిని రాణీ నిలబడిపోయింది. ఆనాటి అలంకారం విశిష్టమై నేత్రోత్సవం గొలుపుతోంది. శ్రీఖండంతో (చందనం) దేవిని అలంకరించారు. ఆ అలంకారంలో దేవి సజీవమూర్తిగా దర్శనమిస్తోంది. ఆ విగ్రహాన్ని భక్తిభావంతో కన్నార్పకుండా తిలకిస్తున్నది.

చెంతనే వున్న దళవాయి, "అమ్మా, యిది విశ్వనాథనాయనింవారు ప్రతిష్ఠించిన విగ్రహం" అన్నాడు.

ఆ విగ్రహంపట్ల రాణికి గల ఆదరభావం ఇనుమడించింది.

"విశ్వనాథనాయినయ్యవారు విజయనగర సమ్రాట్టు రాయలవారిచే అనుజ్ఞాతులై మధురకు తొలిసారిగా వచ్చినప్పుడు, ఈ విగ్రహాన్నీ మహాలక్ష్మి విగ్రహాన్నీ తమతోపాటు తీసుకువచ్చారు. ఈ ఆలయంలో ప్రతిష్ఠించారు...."

"మేము గుడికి చాలాసార్లు వచ్చాము. కాని యీ విషయం మా కెవ్వరూ చెప్పలేదు...." అంటూ దళవాయిని కృతజ్ఞతా పూర్వకంగా చూసింది.

ఆలయాధికారులు భయభ్రాంతులయ్యారు.

"ఆలయాన్ని సందర్శించ వచ్చే ప్రముఖులకు వివిధ దేవతామూర్తులకు సంబంధించిన విషయాలను మీరు వివరించాలి. ఇది మీ విద్యుక్త ధర్మం." అన్నది ఆలయాధికారుల్ని ఉద్దేశించి.

"చిత్తం తల్లీ."

"రాణిగారు అనుమతిస్తే, ఈ విగ్రహప్రతిష్ఠాపన మొదలైన విషయాలను తెలియజేస్తూ మా మిత్రులు చెప్పిన పద్యం చదువుతాను." అన్నాడు రాణికి కొంచెం దూరంలో నిలబడిన ఒక కవి.

"అలాగే, చదవండి."

గొంతు సవరించుకుని ఆయన పద్యం చదవసాగాడు. అందరూ సావధాన చిత్తులయ్యారు.

"అచ్యుతరాయ లే యవనీశ మౌళికి
        నరుదులౌ పలువగ బిరుదు లిచ్చె
దక్షిణ సింహాస నా క్షీణ సామ్రాజ్య
        ధౌరేయు డయ్యె నేధరణి విభుడు
ఘనముగా విజయదుర్గను మహాలక్ష్మి నే
        ధీరుడు తెచ్చి ప్రతిష్ఠ జేసె
మధురా పురంబున, మహనీయ పాండ్య భూ
        మండలం బేలె నే మహిపమౌళి
అతడు నృప మాత్రుడా! మహాహవజయాంక
భూవరాహాది బిరుద సంభూత కీర్తి
కార్తికీ చంద్ర ధవళిత గగనవాటి
నలఘుడౌ విశ్వనాథ నాయక కిరీటి!"

"చాలా మంచి పద్యం. నాయనింవారి మూర్తిని కవిగారు పద్యంలో నిబద్ధం చేశారు" దళవాయి అన్నాడు.

విశ్వనాథనాయనయ్య కీర్తిప్రతాపాలను ఒక్కసారి మననం చేసుకుంది రాణి మనస్సులో.

తర్వాత ఆమె అర్చకులు సబహుమానంగా ముద్దు తిరుమలశౌరి నాయనయ్యవారినీ ఆయన దేవేరుల్నీ ఆహ్వానిస్తున్న అద్భుత శిల్పాన్ని దర్శించింది. కొంతసేపు అక్కడ నిలబడి, తిరుమలశౌరినాయనిం వారి దానధర్మాలను స్ఫురణకు తెచ్చుకుంది.

ఆలయంలో ఎటు చూసినా ఆమెకు తన పూర్వుల దానధర్మాను రక్తి గోచరించింది!

కానుకలిచ్చి ఆలయంలోని అర్చకులనూ పరిచారకులనూ రాణి తృప్తి పరిచింది. "మీ విధుల్ని మీరు సక్రమంగా నిర్వర్తించాలి. దేవాలయాన్ని సందర్శించవచ్చే భక్తుల్ని ఆదరభావంతో చూడండి. వారు ఏమి

అడిగినా, విసుగు చెందకుండా సమాధానాలు చెప్పండి. నిజమైన భక్తుడికీ భగవంతుడికీ మధ్య భేదమేమీ లేదన్న పరమసత్యాన్ని విస్మరించకండి." అంటూ వారిని హెచ్చరించింది. "ఆదరభావంతో తీర్థప్రసాదాలు ఇవ్వండి. అంతేకాని విసిరివేసినట్లుగా యివ్వకండి. మీరెంత శుచిగా నిష్ఠగా వుంటే అంత మంచిది." అని అర్చకుల్ని ఉద్దేశించి చెప్పింది.

రాణి హెచ్చరికలు ఆలయాధికారులకూ అర్చకులకూ ఔషధ ప్రాయంగా కనిపించాయి.

ఆనాడు ఆలయంలో పేదసాదులకు అన్నదానం జరిగింది. వారితో తాను మాట్లాడినప్పుడు వారు పొందిన తృప్తినీ సంతోషం చూసి రాణి ఉప్పొంగిపోయింది. అంత సంతోషం ఆమె యెన్నడూ పొందలేదు. పేదసాదల కళ్ళల్లో కనిపించే సంతృప్తిని మించిన సంతోషం మరొకటి లేదనుకుని రాణి బ్రహ్మానందం చెందింది.

ఆ తర్వాత రాణి అంతఃపురానికి తిరిగి వచ్చింది.

ఆనాడు మధురానగరానికి పండుగకళ వచ్చింది. ఎక్కడ చూసినా మామిడాకుల తోరణాలే. పురప్రముఖులు, ధనికులు, ఉన్నతోద్యోగులు మొదలైనవారు తమ భవనాలను అరటి కంబాలతోనూ మామిడాకుల తోరణాలతోనూ అలంకరించారు. ఉన్నవారూ లేనివారూ అనే భేదం లేకుండా అందరూ తమ యిళ్ళముందర రకరకాల రంగవల్లులు తీర్చి దిద్దారు. ధనికులు కొందరు నిరుపేదలకు వస్త్రదానం చేశారు. దళవాయి, రాయసం మొదలైన ప్రముఖులు పేదవారికి అన్నదానం చేశారు. నగరంలోని వివిధ దేవాలయాలలోనూ విజయరంగ చొక్కనాథునిపేర అర్చనలూ అభిషేకాలూ జరిగాయి.

అంతఃపురంలో సభాభవనం కన్నులకైలాసంగా అలంకరించబడింది. ఎటుచూసినా మల్లెపూలదండలు వ్రేలాడుతున్నాయి. అసలే మల్లెలు

అందులో మధుర మల్లెలు. సువాసనలతో సభాభవనం గుమగుమలాడి పోతోంది.

సామంతులు, దండనాథులు, మంత్రులు, కవిపండితులు, పురప్రముఖులు సభాభవనంలో ఉచితాసనాలు అలంకరించారు. అందరి దృష్టి చుక్కలలో చంద్రునిలా గోచరిస్తున్న సభావేదిక మీద లగ్న మయింది.

వేదికమధ్య భాగాన వున్న రత్నఖచిత సింహాసనం సభాసదుల్ని బహుధా ఆకర్షించింది. సింహపీఠికి వెనుకా మనోజ్ఞంగా చిత్రించబడిన మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణ మహోత్సవపు వర్ణచిత్రం !

సుముహూర్తం సమీపిస్తోంది.

లావణ్యలతికలైన పరిచారికలు జయజయధ్వానాలు చేస్తూ సభా భవనం ప్రవేశించారు. రాణిగారి రాకను గ్రహించిన సభాసదులు లేచి నిలబడ్డారు. నలువైపుల ప్రశాంతత నెలకొన్నది. చీమ చిటుకుమన్న సవ్వడి కూడా వినిపించగల ప్రశాంతత ! సభాసదుల్లో అవధిలేని కుతూహలం !

దళవాయి నరసప్పయ్యముందు నడవగా, కొందరు పరిచారికలు అయన్ని అనుసరించగా, ఉభయపార్శ్వములందు వీరవరేణ్యులు నడవగా రాణి వేదికవైపు నడుస్తున్నది. ఎంత గంభీరమూర్తి ! పొడవుకి తగ్గలావు. గుండ్రని ముఖం. దబ్బపండు ఛాయ. ముఖంలో అనిర్వచనీయమైన ఆకర్షణ శక్తి! చారల పట్టుపుట్టం ధరించింది. పాదాలకు మణి మంజీరాలు. చేతులకు రవ్వల గాజులు. చెవులకు రవ్వల దిద్దులు. రవ్వల ముక్కుపుడక అవి ధగధగ మెరుస్తున్నాయి. ఆ కాంతుల్లో ఆమె కొట్టవచ్చినట్లు ప్రతిభా సిస్తోంది. నుదుట విభూతి రేఖలు. ఆమెను అనుసరించి చొక్కమ్మ. ఆమె చేతిలో మూడునెలల శిశువు విజయరంగ చొక్కనాథనాయనయ్య.

రాణి వేదికను సమీపిస్తూ వుండగా, ఒక్కసారిగా మంగళవాద్యాలు నలుదిక్కులూ పిక్కటిల్లేలా మ్రోగాయి.

తర్వాత వేదవిప్రుల ఘోష ప్రతిధ్వనించింది. వారి మంగళా శాసనాన్ని రాణి సభక్తికంగా స్వీకరించింది.

మీనాక్షీ దేవాలయం నుంచి వచ్చిన ప్రధానార్చకుడు అమ్మవారికి కప్పిన పట్టుపుట్టమూ అమ్మవారికి నైవేద్యమిడిన అతిరసాలూ, అమ్మవారి గళసీమను వేసిన సుమహారం, కుంకుమాక్షతలు మొదలైన వాటిని రాణికి సవినయంగా సమర్పించాడు. వాటిని కనులకు అద్దుకుని రాణి స్వీకరించింది. అలాగే సుందరరాజస్వామి ఆలయం, సుబ్రహ్మణ్యస్వామి ఆలయంనుంచి వచ్చిన ప్రధానార్చకులు తీర్థప్రసాదాలు సవినయంగా సమర్పించారు.

సభాసదుల జయజయధ్వానాలు తగ్గుముఖం పట్టిన తర్వాత, దళవాయి నరసప్పయ్య వేదిక నెక్కి రాణికి అంజలి ఘటించాడు. సభా వందనం కావించాడు.

రాణి అనుజ్ఞ తీసుకుని ఆయన యిలా ప్రసంగించాడు.

"సభాసదులారా!

మీనాక్షీ సుందరేశ్వరులు కరుణా కటాక్షములవల్ల మన రాజ్యంలో సుఖశాంతులు నెలకొన్నాయి. మధురను పరిపాలిస్తున్న ఆ జగజ్జనని కరుణా కటాక్షాలు మనకు సర్వకాల సర్వావస్థలలోనూ లభించగలవని నా ప్రగాఢ విశ్వాసం.

ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా, ఆ అమ్మవారి స్థిరతర కరుణా కటాక్షాలకు పాత్రులైన మన మహారాణిగారు మనల్ని కన్న సంతానంలా కాపాడగల్గుతున్నారు. వారికి మీ పక్షాన కృతజ్ఞతా పూర్వకంగా అభినందనము లర్పిస్తున్నాను...."

సభాసదుల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

దళవాయి తన ప్రసంగాన్ని కొనసాగించాడు.

"మనం ప్రస్తుతం క్లిష్ట పరిస్థితిలో వున్నాము. ఢిల్లీ పాదుషావారి ఆధిపత్యాన్ని మన యిరుగుపొరుగుల వున్న మైసూరు, తంజావూరు

పాలకులు సహర్షంగా అంగీకరించారని వార్తలు వస్తున్నాయి. ఇవి విశ్వసనీయములనే మేము భావిస్తున్నాము. పాదుషావారు చండ ప్రచండులనీ వింటున్నాము. ఈ విపత్కర పరిస్థితిలో శాంతిభద్రతలు సుస్థిరంగా వుండాలంటే, అందుకు మీ యందరి సహకార సానుభూతులు చాలా అవసరం. మహారాణిగారు వాంఛిస్తున్నది యిదే.

విజయరంగ చొక్కనాథనాయనయ్యగారు పసిబిడ్డగా వున్నందువల్ల మహారాణి మంగమ్మగారు బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకుని సంరక్షణ కర్త్రిగా రాజ్యవ్యవహారాలు పర్యవేక్షించాలని అభిలషిస్తున్నారు...."

హర్షధ్వానాలతో సభాభవనం కంపించిపోయింది.

జయజయధ్వానాల మధ్య మందస్మితవదన అయిన మహారాణి మంగమ్మగారు విజయరంగ చొక్కనాథనాయనయ్యను చొక్కమ్మ చేతి లోంచి తీసుకుని తన ఒడిలో కూర్చుండబెట్టుకుంది.

మంగళ తూర్యారవాలు దిశాష్టకం వ్యాపించాయి.

వేదవిప్రులు మంగళాశాసనం చేసి, మంగళాక్షతలు విజయరంగ చొక్కనాథుని శిరసున ఉంచారు. అప్పుడు రాణి లేచినుంచుని తన చేతిలో శిశువుని ఉంచుకుంది.

విజయరంగచొక్కనాథులు వర్థిల్లాలి, విజయరంగ చొక్కనాథులు వర్థిల్లాలి— అని సభికులు సంతోషాతిశయంకొద్దీ నినాదాలు చేశారు.

సభాభవనం వెలుపల బాణసంచా కాల్చబడింది. ఆ వేడుకలు తిలకించడానికి పౌరులు గుమిగూడారు.

జయఘోష తగ్గిన తర్వాత, దళవాయి వేదికనెక్కి యిలా అన్నాడు. "ఈ శుభసమయంలో మహారాణిగారు నాలుగుమాటలు చెప్పడానికి దయతో అంగీకరించారు. అదీ మనపై వారికి గల అనుగ్రహం; మన భాగ్యవిశేషం."

ఒడిలో వున్న బిడ్డను చొక్కమ్మ చేతి కందించి, నిలబడి, రాణి సభకు నమస్కరించింది. సభలో మళ్ళీ హర్షధ్వానాలు. రాణి ప్రసంగించింది.

"జగజ్జనని మీనాక్షి దయవల్ల మేము యథాశక్తిని యీ రాజ్య వ్యవహారాలు పర్యవేక్షించగలుగుతున్నాము. మీ సహకారం మా కెప్పుడు లభిస్తున్నందువల్ల, ఎన్ని అవాంతరాలు వచ్చినా, వాటిని అధిగమించగలుగు తున్నాము. ఆ సహకారం ముస్ముందు కూడా లభించగలదని ఆశిస్తున్నాము. మేము సంరక్షణ కర్త్రిగా మాత్రమే వ్యవహరించదలచాము. ప్రభువులు విజయరంగ చొక్కనాథులే.

మేము సంప్రదాయ విరోధులమని కొందరు భావిస్తున్నట్టు విన్నాము. మీ అందరివలె, మాకూ సంప్రదాయంపట్ల విశేష గౌరవం ఉంది. అయితే పరిస్థితులుబట్టి కొన్ని సంప్రదాయాలలో మార్పులు చేసుకోవడం వాంఛనీయ మని మా నిశ్చితాభిప్రాయం. అంతేకాని సంప్రదాయాన్ని విచ్ఛిన్నం చెయ్యాలన్నది మా ధ్యేయంకాదు.

మన రాజ్యంలో విభిన్న మతాలవారు వున్నారు. కనుక మత సహిష్ణుత కూడా చాలా అవసరం. మత సహిష్ణుత నశిస్తే, మనలో మనకు లేనిపోని గొడవలు తలెత్తుతాయి. ఈ దృష్టితోనే మేము ఇతర మతాల వారిని కూడా సముచితరీతిని ఆదరిస్తున్నాము.

మా పూర్వులవలె, మేముకూడా దేవాలయాలకు దానధర్మాలు ఉదారంగా చెయ్యాలనే ఆశిస్తున్నాము. ముఖ్యంగా సత్రాలు, చావిళ్ళు నిర్మించి ప్రజలకు సహాయపడాలని మా అభిలాష. కొన్ని గ్రామాలలో సరిఅయిన బాటలు లేవు. తటాక కూపములు లేవు. కనుక ప్రజోపయోగ కరములైన యీ వివిధ కార్యాలు సత్వరం నిర్వర్తించాలని మా ఆశయం. కొన్ని గ్రామాలలో దుష్టమృగాల భయమింకా తగ్గలేదని వింటున్నాము. చోరభయం కూడా తగ్గనట్లు తెలుసుకుని బాధపడుతున్నాము. మీ సహకారం, మునపటిలా, లభిస్తే మా ఆశయాలు నెరవేరగలవనే మా విశ్వాసం.

మరొకతూరి జగదంబ మీనాక్షి అమ్మవారి కరుణాకటాక్షాల కోస
ఆ తల్లిని ప్రార్థిస్తున్నాము. ఆ తల్లి చల్లని చూపులే ప్రభువు
విజయరంగ చొక్కనాథులకు శ్రీరామరక్ష !"

జయ జయ ధ్వానాల మధ్య రాణి సపరివారంగా తన నివాసాని
బయలుదేరింది.

నరసప్పయ్య ప్రభృతులు కూడా గృహోన్ముఖులైన తర్వాత పు
ప్రముఖులు ఇతరులు తమ తమ యిండ్లకు దారితీశారు.

రాణికి గల ప్రజాభిమానం తలుచుకుని పురప్రముఖు
ముగ్ధులయ్యారు. ఆమె తప్పక ప్రజోపయోగకరములైన పనుల
జయప్రదంగా నిర్వర్తించగలదనీ, ఆమె పరిపాలన సుఖశాంతులక
ఆలవాలం కాగలదనీ భావించి తృప్తి చెందారు.

'మాటలు తియ్యగానే వున్నాయి. చేతలు చేదుగా ఉండకపోతే
మంచిదే.' అనుకున్నారు సంశయ మనస్కులు కొందరు.

'యుద్ధభీతి అంతగా వుండదేమో' అని సంతోషించారు కొందరు.

'రాణిగారు మన సంప్రదాయాలకు అంత ప్రాధాన్యం యివ్వరు.
ఆవిడ సంప్రదాయ విరోధి' అని కొందరు అనుకున్నారు.

బండి కళ్ళవలె రోజులు గడిచిపోతున్నాయి.

మంత్రులు మొదలైన ప్రముఖుల సహాయంతో రాణి రాజ్య
వ్యవహారాలు పర్యవేక్షిస్తున్నది. ముఖ్య విషయాలలో మంత్రుల్ని ఉన్నతో
ద్యోగుల్ని సంప్రతించేది. వారి సలహాలను యథాతథంగా స్వీకరించేది
కాదు. ఏకాంతంగా కూర్చుని రాత్రివేళల్లో ఆ సలహాలను క్షుణ్ణంగా
పరిశీలించేది. ఒక్కొక్కసారి మంత్రుల మాటలకు అంతగా ప్రాధాన్యం
ఇచ్చేదికాదు. ప్రజాదృష్టితో ప్రతి విషయాన్ని పరిశీలించేది. తత్ఫలితంగా
రాజకీయంగా ఆమెకు ఉన్నతోద్యోగులలో కొందరు శత్రువులైనారు.
మరికొందరు ఆమెపై నీలాపనిందలువేసి తమలో తాము తృప్తి
చెందేవారు.

ఒకరోజు ఉషఃకాలాన రాణి పల్లకిలో నగర దర్శనానికి బయలు దేరింది. వెంట ఎవ్వరూ లేరు, పరిచారికలు కూడా లేరు.

వైఘా నదిలో స్నానంచేసి తడిబట్టలతో గృహోన్ముఖులైన కొందరు బ్రాహ్మణులు ఎదురయ్యారు. కాని వారెవ్వరూ పల్లకిలో తెరచాటున వున్న రాణిని గుర్తించలేదు. అంతఃపుర స్త్రీ యెవరో అమ్మవారి ఆలయానికి వెడుతున్నట్టు భావించారు.

స్త్రీ పురుషులు కొందరు సుస్నాతులై మీనాక్షి సుందరేశ్వరుల గుడికి వెడుతున్నారు. కొందరు స్త్రీలు యిళ్ళముందు కలాపి చల్లి రంగవల్లులు తీరుస్తున్నారు.

అంగడి వీధులు ముఖ్యమైనవి కోలాహలంగా వున్నాయి. పొరుగూళ్ళనుంచి ఎడ్లబండ్లలో వచ్చిన అరటాకుల కట్టలను వర్తకులు పరిమాస్తున్నారు. అరటిపళ్ళ గెలలను, కాయలను పరిశీలిస్తున్నారు. రైతులు పెద్ద పెద్ద గంపలలో తీసుకువచ్చిన కాయగూరలను కొందరు బేరం చేస్తున్నారు. అప్పుడే నవనవలాడే తమలపాకుల తట్టలు మొదలైనవి కూడా వచ్చి చేరాయి. ఉషఃకాలాన కూడా కలకలలాడుతున్న ఆ అంగడి వీధుల్ని చూసి రాణి సంతోషించింది. కాని బాటలు సరిగా లేకపోవడం చూసి పరితపించింది. నగరపు రథ్యలే అధ్వాన్నంగా వుంటే, పల్లెలలోని బాటలు మరీ అధ్వాన్నంగా వుండి వుంటాయని భావించింది. బాటలు సరిగా లేకపోయినా పొరుగూళ్ళనుంచి కాయగూరల గంపలు మొదలైనవి మోసుకువచ్చే రైతుల్ని కార్మికుల్ని చూసి జాలి చెందింది. గగన వీధినంటే గాలి గోపురాలు నిర్మించిన తన పూర్వులు బాటల నిర్మాణ విషయంలో ఎందుకు అశ్రద్ధ చేశారా? అని బాధపడింది. సుందర భవనాలెన్నో నిర్మించిన తన పూర్వులు పట్టణాలలో పల్లెలలో ప్రజలకు వసతులెందుకు కల్పించలేదా అని ఆలోచించసాగింది! ఆమె మనస్సు వికలమయింది.

రాణి దృష్టి ఉన్నట్టుండి ఒక జీర్ణాలయం వద్ద విశ్రమించిన

నలుగురైదుగురు మీదికి ప్రసరించింది. ఆ శిథిలాలయం దగ్గరగా పల్లకిని ఆపమన్నది. ఆమె పల్లకి దిగింది. విశ్రమిస్తున్నవారిని పరీక్షగా చూసింది. ప్రథమ వీక్షణంలోనే వారు తమిళులుకారనీ మధురకు కొత్తవారనీ గ్రహించింది. ఆ నలుగురిలో ఇద్దరు మహిళలు, ఒకామెను ప్రశ్నించింది.

"అమ్మా, మీది యీ వూరు కాదనుకుంటాను."

"అవునమ్మా."

"ఎక్కడినుంచి వస్తున్నారు ?"

"తిరుపతి నుంచి."

"తిరుపతా !"

"అవును తల్లీ. కష్టపడి కాశీయాత్ర చేశాము. అలాగే రామేశ్వరం కూడా దర్శిద్దామని యాత్ర చేస్తున్నాము."

తిరుపతి అనగానే రాణికి చంద్రగిరి స్ఫురణకు వచ్చింది. తన తల్లిదండ్రులు, తన బాల్యం గుర్తుకి వచ్చాయి. ఆ మధురస్మృతులు ఒకటా, రెండా....

"చంద్రగిరిమీదుగా వస్తున్నారా ?"

"అవునమ్మా....చంద్రగిరిలో మీకు బంధువు లెవరైనా ఉన్నారా ?"

తీగ కదిపితే డొంకంతా కదులుతుందేమోనని రాణి విషయం మార్చింది.

"అమ్మవారిని దర్శించి వెడదామని యిక్కడ మజిలీ చేశారా ?"

"అవునమ్మా, ఇంతదూరం వచ్చి మీనాక్షమ్మవారిని చూడకపోతే ఎలా ?"

"అవునవును. మంచిపని చేశారు.... ఈ వూళ్ళో మీకు బంధువులు గాని తెలిసినవాళ్ళుగాని యెవరూ లేరా ?"

"లేరమ్మా."

"మరి యిన్ని సామాన్లతో యిక్కడ దిగారు. మరెక్కడైనా దిగకపోయారా ?"

"ఎక్కడ దిగము తల్లీ...." అని ఆమె సమాధానం చెపుతుంటే, ఆమె వెంట ఉన్న యువకుడు ఉద్రేకంతో అన్నాడు.

"ఇంత పెద్ద వూళ్ళో దిగడానికి మంచిసత్రం ఒక్కటైనా లేదు. ఏం వూరమ్మా యిది! పేరు గొప్ప, ఊరు దిబ్బ అన్నట్టుంది...."

"తప్పు నాయనా....అలా మాట్లాడకూడదు. మనం పొరుగూరికి వచ్చి ఆ వూరినే దుయ్యబడితే విన్నవాళ్ళు ఏమన్నా అనుకుంటారు" తల్లి యువకుణ్ణి మందలించింది.

రాణి నవ్వింది. "తొందరపాటు మంచిదికాదు బాబు. ఈ వూరు నువ్వేం చూశావని! ఈ వూళ్ళో ఉన్న తిరుమల నాయకుని మహలు వంటి సుందర నిర్మాణం ఈ చుట్టుపక్కలా ఎక్కడాలేదు ..."

"ఏమో, మీ వూరు చూసి మీరే మెచ్చుకోవాలి!" యువకుని ఉద్రేకం యింకా తగ్గలేదు.

"అవును బాబు, కాకిపిల్ల కాకికి ముద్దు...."

"అమ్మా, యీ వూళ్ళో మంచి సత్రాలు లేవా ?"

"రెండు మూడున్నాయి కానీండి, అవి పెద్దవి కావు."

"మేము యీ జీర్ణాలయం నిన్న సాయంకాలం చేరుకున్నాం. ఏ మాట కామాటే చెప్పుకోవాలి తల్లీ.... యిక్కడ దొంగల భయం లేదు."

"అలాగా !"

"ఇక్కడ సామాన్లు దింపుకుంటూ చాలా భయపడ్డాం. ఒకమూల నడిచి వచ్చిన బడలిక. చీకటిపడేకొద్దీ దొంగల భయం వుంటుందేమోనని మరోవైపు ఆందోళన. బడలికవల్ల కాబోలు ఆదమరిచి నిద్రపోయాం ... ఎక్కడుంచిన సామాను అక్కడే వుంది.... చాలా మంచి వూరని పిస్తోంది."

"ఈ మాట మీ అబ్బాయికి చెప్పండి" అంది రాణి నవ్వుతూ.

"వాడి మొహం. వాడి మాటలకు మీరేమీ నొచ్చుకోకండి. వాడి స్వభావమే అంత...." ఆమె అనునయంగా అన్నది.

"మీ అబ్బాయి అన్న మాటల్లోనూ తప్పేముంది ? ఇంత పెద్ద వూళ్లో ఒక మంచి సత్రం లేనిమాట నిజమే. ప్రతిరోజూ వచ్చే పోయే యాత్రికులతో ఈ వూరు కిటకిటలాడుతూ వుంటుంది. ఇది పెద్ద పుణ్యక్షేత్రం కాబట్టి, యీ వూరికి వస్తారు ఎక్కడెక్కడివారు...."

"అవునమ్మా మధుర మీనాక్షి, కంచి కామాక్షి, కాశీ విశాలాక్షి అనడం లోక వ్యవహారం."

"మీరన్నది నిజం. అమ్మవారిని చూడాలని వస్తారు యీ వూరికి. మరి యిటువంటి వూళ్లో మంచి సత్రం లేకపోవడం ఒక కొరతే...."

"అయితే మీరూ మా అబ్బాయి మాటనే నమ్ముతున్నారన్న మాట !"

"నిజం ఎవరు చెప్పినా నిజమేనమ్మా.... మీ మటుకు మీరు ఎంత యిబ్బంది పడుతున్నారో చూడండి.... మంచి సత్రం లేకపోబట్టి, మీరు ఆరుబయట యీ మొండిగోడల మధ్య పడుకోవలసి వచ్చింది."

"ఇక్కడ అంత ఇబ్బంది పడలేదు గానీండి, ఆ వూరు పేరేమిటి.... చోళ....సరిగా గుర్తు రావడంలేదు "

"చోళవందానా ?"

"ఆఁ ! అదే చోళవందాను.... ఆ వూళ్లోనమ్మా రామేశ్వరం వెళ్ళే యాత్రికులు ఎన్ని యిబ్బందులు పడుతున్నారో చెప్పతరం కాదు...."

"ఆ వూరు మంచిదేనే ?"

"ఏం మంచి శామంచి.... ఒక్క సత్రంలేదు, తలదాచుకుందామంటే. పైగా అక్కడికి వచ్చేటప్పటికి చీకటి పడిందేమో, ఏమీ కనిపించ లేదు."

"అక్కడికి చాలామంది యాత్రికులు వస్తారా, అమ్మా.... తెలీక అడుగుతున్నాను."

"అవును తల్లీ. దొంగల భయం విపరీతంగా వుంది. ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకున్నామంటే నమ్మండి."

"పాపం, చాలా యిబ్బంది పడివుంటారు...."

"మా వస్తువులేం పోలేదుగానీండి. మాతోపాటు వచ్చిన వాళ్ళని నిలువుదోపిడీ చేశారనుకోండి. వాళ్ళ అవస్థ ఆ పరమాత్ముడికి ఎరుక...."

"నలుగురూ సహాయం చేసి వుంటారు."

"సహాయం చెయ్యకపోతే ఎలాగమ్మా.... కట్టుగుడ్డలతో వున్నారాయె.... ఎవరికి తోచింది వారు యిచ్చారు. దారిబత్తానికి కొంచెం డబ్బుకూడా పోగుచేసి యిచ్చామనుకో."

"చాలా మంచిపని చేశారు. మీ యాత్రా ఫలమంతా ఆ సహాయంలోనే వుంది. పరోపకారమే పుణ్యం, పర పీడనమే పాపం అని మన పెద్దలు చెపుతారు."

తెల్లవారుతోంది, వెలుతురు వస్తోంది. వీధుల్లో జనసమ్మర్దం ఎక్కువయింది. ఇక అంతఃపురానికి తిరిగివెళ్ళడం మంచిదనుకుంది రాణి.

"అమ్మా పొద్దెక్కుతోంది, నేను వెళ్ళి వస్తాను."

"వెళ్ళిరా తల్లీ.... మీరెవరో కాని ముక్కూ మొగం తెలియని యీ వూళ్ళో మా యోగక్షేమాలు కనుక్కున్నారు మీరు."

"దానికేముందమ్మా— సాటిమనుషుల మంచిచెడుల్ని కనుక్కోవడమూ ఒక ఘనకార్యమేనా ?"

"మీలా ఎందరమ్మా మంచిచెడ్డలు విచారించేవాళ్ళు ? కొందరైతే పలకరించినా పలకరించరు. అందులోనూ కొత్తవాళ్ళని చూస్తే ఏమిటో బెదురు."

"అమ్మవారి దర్శనం అయిన తర్వాత, యీ వూళ్లో చూడవలసినవి చూసి వెళ్ళండి."

"అలాగేనమ్మా."

వాళ్ళవద్ద సెలవు తీసుకొని రాణి కొంచెం దూరంలో ఆగిన పల్లకిని సమీపించింది.

రాణి పల్లకిని సమీపించడం, పల్లకీ ఎక్కి వెళ్ళడం వాళ్ళు చూశారు. తమతో యింతసేపు మాట్లాడిన ఆవిడ అంతఃపురస్త్రీ కావచ్చునని అనుకున్నారు.

రాణి పల్లకీ ఎక్కుతుంటే, ఎవరో ఒకతను ఆమెను గుర్తుపట్టాడు. అతను సంతోషంకొద్దీ, "రాణిగారు, రాణిగారు" అంటూ చెంత వున్న మిత్రులికి చెప్పాడు. ఆ మాటలు విని జీర్ణాలయం వద్ద విశ్రమించిన వాళ్ళు దిగ్భ్రమ చెందారు. ఉద్రేకంగా మాట్లాడిన యువకుడైతే బాధపడ్డాడు. రాణిగారిని తెలుసుకోలేకపోయామే అని నొచ్చుకున్నారు.

ఆ రోజు మంత్రులు అచ్చయ్య, మీనాక్షయ్యలతో రాజ్యవ్యవహారాలు చర్చిస్తున్న రాణి మనస్సు ఆ చర్చలో నిమగ్నం కాలేదు. వేకువజామున తాను చూసిన దృశ్యాలు, యాత్రికులతో జరిపిన సంభాషణ ఆమె మనస్సుని వశం చేసుకున్నాయి.

చర్చ ముగిసింది. మంత్రులిద్దరూ రాణిగారి ఆజ్ఞకోసం ఆమెవైపు చూశారు.

"పట్టణంలో రెండు మూడుతప్ప కడమ వీధులన్నీ అధ్వాన్నంగా వున్నాయి. ఈ విషయాన్ని మీరెప్పుడూ మా దృష్టికి తీసుకురాలేదు."

రాణి ఉన్నట్టుండి యిలా అడగడం చూసి మొదట్లో వారిద్దరూ ఆశ్చర్యపోయినా, ప్రత్యుత్తరం ఏం చెప్పాలా అని భయభ్రాంతులయ్యారు. ఎలాగో ధైర్యం కూడగట్టుకుని, "అమ్మా మీరన్నది వాస్తవమే" అన్నాడు అచ్చయ్య.

"చూడండి అచ్చయ్యగారూ, రోజూ వచ్చేపోయే యాత్రికులతో మన పట్టణం జనసమ్మర్దంగా వుంటున్న విషయం మనకందరికీ తెలిసిందే. అయినా బాటల దుస్థితిని మాత్రం మనం గుర్తించకపోవడం దురదృష్టం."

"అందుకు విచారిస్తున్నాను తల్లీ."

"విచారించి యేం లాభంలేదు. అందుకు ఏదో ఒక పరిష్కార మార్గం మనం ఆలోచించాలి. అది ఎంత త్వరగా చేస్తే అంత మంచిది."

"చిత్తం తల్లీ."

"బాటల్ని దృఢతరం చేసేందుకు మనం వెంటనే చర్యలు తీసుకోవాలి. మంచి బాటలవల్ల యాత్రికులూ సుఖపడతారు; మనమూ సుఖ పడతాం."

మంత్రులిద్దరూ రాణి సూచనను ఆజ్ఞగా శిరసావహించారు. ఆమె అనుజ్ఞ తీసుకుని వాళ్లు వెళ్ళబోతుంటే రాణి యిలా అన్నది.

"నేటి ఉదయం మేము పట్టణం చూశాము. మన బాటల అధ్వాన్న పరిస్థితి అప్పుడే మాకు తెలియవచ్చింది. ఆయా అధికారులతో సంప్రతించి రేపటినుంచే యీ కార్యక్రమంలో నిమగ్నులు కావాలి. మొదట మన నగరంలోని బాటల్ని దృఢతరం చెయ్యండి. ఆ తర్వాత నగరాన్ని అనుకున్న గ్రామాలలోని బాటల విషయం శ్రద్ధ వహించండి. మన రాజ్యంలోని ప్రధానమైన మార్గాలన్నీ సక్రమంగా వుండేటట్లు చూడడం మన అందరి కర్తవ్యం. ఇందుకు ఎంత ధనం అవసరమైనా సరే ముందు వెనకలు చూడవద్దు. ప్రజోపయోగకరమైన యీ కార్యనిర్వహణకు నిధులు లేవన్నమాట మా చెవిని పడకూడదు. ఒక్క విషయం. ఈ సాకుతో కొత్త పన్నులు విధించడానికి పూనుకోవద్దు. ఉన్న నిధుల్ని సక్రమంగా వినియోగిస్తే, ఎన్ని బాటలైనా వెయ్యవచ్చు. నిర్ణయాలు తీసుకునేముందు దళవాయిగారిని కూడా సంప్రతించండి...."

"అలాగే తల్లీ."

మంత్రులు నిష్క్రమించినా, రాణి ఆ విషయం గురించే ఆలోచిస్తూ కూర్చుంది.

"అమ్మా !"

"ఎవరు ?"

"నేనేనమ్మా, అళగమ్మని."

"ఏమిటి విశేషం ?"

"తమరేదో ఆలోచిస్తున్నారు. అంతరాయం కలిగించాను.... క్షమించండి...."

"ఊఁ...."

"మరేంలేదమ్మా.... యిప్పటికే కాలాతీతమయింది. తమరింకా భోజనం చెయ్యలేదు. అది గుర్తుచెయ్యడం కోసమే వచ్చానమ్మా...."

రాణి ఎక్కడ విసుక్కుంటుందేమోనని ఆమె భయపడింది. కాని రాణి చిరునవ్వు నవ్వడంతో ఆమెకు ధైర్యం వచ్చింది.

"నేను చెపుతున్నానని తమరు అన్యథా భావించవద్దని మనవి. తమ ఆరోగ్యం మునపటిలా లేదమ్మా...."

"ఇంకా చెప్పడానికి ఏమైనా మిగిలిందా ?"

"తమ ఆరోగ్యం మాకు ఆందోళన కలిగిస్తోంది తల్లీ. రాత్రిం బవళ్లూ తమరు ఆలోచిస్తూనే వుంటున్నారు...."

"ప్రభువులు పెద్దవారైతే, మా బాధ్యత తీరిపోతుంది. అంతవరకే యీ ఆలోచనలూ ఆవీను. ఆ తర్వాత కృష్ణారామా అనుకుంటూ ప్రశాంతంగా కాలం గడపాలని మా కోరిక.... అన్నట్టు అడగడం మరిచిపోయాను.... ప్రభువులు భోజనం చేశారా ?"

"చేశారు తల్లీ."

అళగమ్మతోపాటు రాణి భోజన గృహానికి బయలుదేరింది. దారిలో

విజయరంగచొక్కనాథుల గదివద్ద కొంచెంసేపు ఆగింది. ఆదమరచి నిద్రపోతున్నాడు.

భోజనానంతరం రాణి కొంచెంసేపు విశ్రమించింది.

తర్వాత పౌరాణికుడు రాగా, సద్గ్రంథ కాలక్షేపం చేసింది.

అంతరంగిక సేవకుని ద్వారా దళవాయిగారికోసం కబురు పంపింది.

కబురు చేరిన కొద్దిసేపటికి ఆయన వచ్చాడు. వారిద్దరూ అభ్యంతర గృహానికి వెళ్లారు. మంగమ్మగారే తొలుత మాట్లాడసాగింది.

"దళవాయిగారూ, ఆ మధ్య మీరు ఢిల్లీ పాదుషావారి విషయం ప్రస్తావించారు...."

"అవును తల్లీ."

"ఆ తర్వాత కొత్త విశేషాలేమైనా తెలియవచ్చాయా ?"

"పాదుషావారు తమ సేనాధిపతిని దక్షిణ భారతానికి పంపుతున్నట్లు వార్తలు వచ్చాయి. ఆ వార్తలు నిజమనే రూఢి చేసుకున్నాను...."

"కనుక పాదుషావారు తమ మనస్సుని మార్చుకోలేదన్నమాట !"

"అమ్మా, ఎందుకు మార్చుకుంటారు ? రాజ్యకాంక్ష అలాంటిది."

"మేమూ యీ విషయం గురించి దీర్ఘంగా ఆలోచించాము. మైసూరు, తంజావూరు పరిపాలకులు పాదుషావారి ఆధిపత్యాన్ని అంగీకరించారు. కనుక యీ పరిస్థితిలో, మీరు ఆనాడు సూచించినట్లు మొగలాయీ చక్రవర్తి ఆధిపత్యాన్ని అంగీకరించడమే వివేకమనిపిస్తున్నదీ. పాదుషావారి అండదండలు మనకు అవసరమనే తోస్తున్నది. రామనాథపురం, కిళవన్ సేతుపతిగారు స్వాతంత్ర్యం ప్రకటించదలచినట్లు మొన్న మీరే చెప్పారు...."

"అవును తల్లీ."

"మహిళ యేం చేస్తుందనేగా యీ మగధీరుల ధీమా ! అందుకే మొన్నమొన్నటిదాకా విసయవిధేయతలు ప్రకటిస్తూ సామంతులుగా

వ్యవహరించిన వారు ఈనాడు స్వాతంత్ర్యం ప్రకటించాలని ఆశిస్తున్నారు...." అని దళవాయిని చూసింది, ఆయన యేమీ మాట్లాడలేదు.

"మగధీరులన్నందుకు మీరు నొచ్చుకున్నారా, దళవాయిగారు...."

"అదేంలేదు తల్లీ.... ఈ పురుషాధిక్య సమాజంలో తమవంటి ఒక మహిళ యేం చేస్తుందనే అభిప్రాయం ఆనోటా ఆనోటా నేను విన్నాను. వారిని మందలించాను."

"మేమూ విన్నాము...."

"ఆ మాటలకు తమరేమీ నొచ్చుకోవద్దని నా మనవి.... ఈ తాటాకు మంటలకు తమరేమీ జంకరని నాకు తెలుసు...."

"ఏదీ యేమైనా, మేము మీ ముందు మగధీరులనడం సమంజసం కాదు. విచారిస్తున్నాము...."

"మనస్సులోని బాధవల్ల మీరలా అన్నారని నా అభిప్రాయం. అలా అనకపోతే, ఆ బాధ మనస్సుని తొలిచివేస్తుందమ్మా...."

"మీరు లెస్సగా వూహించారు." అంటూ మందహాసం చేసింది రాణి.

"ఇంతకూ తమ అభిప్రాయం యేమిటి?"

"పాదుషావారి సైన్యాల సహాయంతో మన శత్రువుల్ని మనం అణచివెయ్యడానికి ప్రయత్నించాలి. అలాగే మనం కోల్పోయిన రాజ్య భాగాల్ని తిరిగి సంపాదించడానికి కృషి చెయ్యాలి...."

"తమ అభిలాష సవ్యమైనదే తల్లీ...."

"మీరు ఆమోదించారు కనుక, మా ఆశయం నెరవేరినట్లుగానే భావిస్తున్నాము."

"అయితే పాదుషావారి సైన్యాధిపతికి వర్తమానం పంపమంటారా?"

"మనం కొంచెం ఓపిక పడదాం. ఈలోపుగా పాదుషావారే మనకు వర్తమానం పంపినా పంపవచ్చు...."

"తమరన్నట్లు ఆయనే వర్తమానం పంపవచ్చు."

"పాదుషావారు పంపనున్న సైన్యాధిపతి యెవరో తెలుసు కున్నారా ?"

"జుల్ఫిర్ఖానని...."

"సౌమ్యుడేనా ?"

"అనే విన్నాను."

"సరే, మనం ఒక నిర్ణయానికి వచ్చాము కనుక, జుల్ఫిర్ఖాను వస్తే ఆయన్ని మనం ఘనంగా సత్కరించాలి. ఆయన అభిమానం మనకు చాలా అవసరం."

"ఆ యేర్పాట్లు నేనే స్వయంగా చూస్తాను...."

"మరేంలేదు.... మే మిందాక చెప్పినట్లు, మనం ఆయన సహాయంతో కోల్పోయిన రాజ్యభాగాలు సంపాదించాలని మా అభిలాష...."

"తమ అభిలాష నెరవేరగలదనే నా నమ్మకం."

"మీతో మరో విషయం కూడా ముచ్చటించాలని అభిలషిస్తున్నాం. అందుకే మీకు కబురు పంపించాం."

దళవాయి రాణివైపు సాభిప్రాయంగా చూశాడు.

ద్వారంవద్ద చొక్కమ్మ నిలబడడం రాణి చూసింది.

"చొక్కమ్మా, నువ్వు లోపలికి రావచ్చు."

ఫలహారం పళ్ళెరాలతో చొక్కమ్మ లోపలికి వచ్చింది.

"అతిథిమర్యాద చెయ్యడంలో మా చొక్కమ్మ తర్వాతనే మరొకరు...." రాణి మందహాసం చేసింది.

ఆ వెండిపళ్ళెరాలు అక్కడుంచి చొక్కమ్మ వెళ్ళిపోయింది. వాటిలో రకరకాల పళ్ళముక్కలు, అవి అరగిస్తూ "ఈ చెరకుముక్కలు ...లకండను తలపిస్తున్నాయి" అన్నాడు దళవాయి.

"ఇంకా రెండు ముక్కలు తీసుకోండి, మన రాజ్యంలో పండిన చెరకిది!"

"అమ్మా! మొన్న సేలం ప్రాంతంనుంచి ఒక పండితుడు వచ్చాడు. మాటల మధ్య 'తింటే చెరుకు తినాలి, వింటే భారతం వినాలి' అన్నాడు. నేను కొంచెం ఆశ్చర్యపోయాను...."

"అవునవును. తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి—అని మన వ్యవహారం. అయినా సేలంవారి వ్యవహారం సబబుగానే తోస్తోంది. గారెలు తిన్నా, చెరుకు తిన్నా బాగుండడం ముఖ్యం.... దళవాయిగారూ...."

"అమ్మా!"

"మన పట్టణంలో మంచి సత్రం ఒక్కటైనా లేకపోవడం యాత్రికులకు చాలా యిబ్బందిగా వున్నట్టు స్వయంగా తెలుసుకున్నాము. రామేశ్వరానికి వెళ్ళే యాత్రికులందరూ మన పట్టణం మీదుగా వెడుతున్నారు. వాళ్ళకి తగిన సౌకర్యాలు కల్పించడం మన కర్తవ్యం...."

"తమ రన్నట్టు మంచి సత్రం లేకపోవడం నిజంగానే పెద్దలోపం. దూరప్రాంతాలనుంచి వచ్చే యాత్రికులు యమయాతనలు పడుతున్నారు."

"యాతనలంటే గుర్తుకి వస్తోంది. చోళవందాన్ మొదలైనచోట్ల చోరభయం విపరీతంగా వున్నట్లు విన్నాము."

"ఆ మధ్య అలాంటి వార్తలు వచ్చాయి కాని, యీ మధ్య చోర భయం తగ్గినట్లే విన్నాను తల్లీ...."

"తగ్గితే మంచిదే. మా పూర్వులు ఎంతగా శ్రమించినా పల్లెపట్టుల్లో చోర భయం పూర్తిగా నశించినట్లు కనిపించడం లేదు."

"ఈ విషయంలో తగినంత శ్రద్ధ వహించాలని మన అధికారులకు వెంటనే వర్తమానం పంపుతాను."

"మరి, సత్రాల విషయంగా మీ అభిప్రాయం?"

"సత్రాలు చాలా అవసరమే, కాదనను. పాదుషావారి సైన్యాధిపతిని ఘనంగా సత్కరించాలని మనం అనుకున్నాం. మైసూరు వారివల్ల యుద్ధ భీతి పూర్తిగా తొలగలేదు. తంజావూరి వారు ఏ క్షణాన అయినా మనతో యుద్ధానికి దిగవచ్చు...."

"అవుననుకోండి. ఈ యుద్ధభీతి తప్పదు; ధనవ్యయమూ తప్పదు. ధనరాసులు కరిగిపోతున్నాయిగాని, యుద్ధభీతి మాత్రం తొలగడంలేదు. తరగని యీ యుద్ధాలకోసం ధనవ్యయం చెయ్యడం కంటె శాశ్వతమైన ధర్మకార్య నిర్వహణకుగాను ధనవ్యయం చెయ్యడం సముచితమని మాకనిపిస్తున్నదీ. సత్ర నిర్మాణంవల్ల ప్రజలకూ లాభం. మంచిపని చేశామన్న సంతృప్తి మనకు మిగులుతుందీ...."

రాణి ధర్మచింతన తలుచుకుని దళవాయి లోలోన సంతోషించాడు. కాని ఆ సంతోషాన్ని వ్యక్తం చెయ్యలేకపోయాడు.

"దళవాయిగారేదో ఆలోచిస్తున్నట్టున్నారు ?"

"మరేంలేదు తల్లీ, తమ ధర్మచింతన నన్ను ముగ్ధుణ్ణి చేస్తున్నదీ."

"మీరు మమ్మల్ని ప్రశంసిస్తున్నారుగాని, మా పూర్వులు చేసిన దానధర్మాల ముందు మేము చేసిందీ, చెయ్యదలచిందీ హనుమంతుని ముందు కుప్పిగంతులే ! మీరు భావిస్తున్నట్టు శత్రువుల్ని ప్రతిఘటించడమూ చాలా అవసరమే...."

"రాజ్య భద్రతకోసం ప్రతిఘటించక తప్పదు."

"రాజ్యక్షేమం ఎంత అవసరమో, అలాగే ప్రజల కుపకరించే పనులు కూడా అంతే అవసరం. అప్పుడే రాజ్యంలో శాంతిభద్రతలు సుస్థిరంగా వుంటాయి...."

"మీరన్నది అక్షరాలా సత్యం."

"కనుక ధనాభావం సాకుతో ధర్మకార్యాలు ఆగిపోకూడదని మా ఆకాంక్ష...."

"ఒక్క మనవి...."

"చెప్పండి దళవాయిగారూ- మీరేం చెప్పినా, అది మా క్షేమం కోరే చెపుతారని మాకు తెలుసు...."

"కోశం నిండుకున్నట్లుగా ఆ మధ్య కోశాధ్యక్షులు చెప్పారు...."

"మాతోనూ చూచాయగా చెప్పారు. ఆ విషయాన్ని రాయసంగారూ సమర్థించారు. కనుక ఏం చేస్తే, వుచితమో మీరే చెప్పండి."

"ప్రస్తుతానికి మధురలోనే సత్రనిర్మాణం కావిద్దాము. ఆ తర్వాత చోళవందాన్ మొదలైనచోట్ల సత్రాలు నిర్మించడం సముచితమని నా అభిప్రాయం...."

"మీ సూచన మా కెంతో నచ్చింది. అయితే సత్వరంగా జరగాలి నిర్మాణం...." తలమీది బరువుని దించినంత తృప్తి రాణి మాటలో కనిపించింది.

"అమ్మవారి ఆలయానికి దగ్గరగా, ప్రధాన మార్గంలో సత్రం నిర్మించడం మంచిదని నా మనవి...."

"ఈ సూచన చాలా లెస్సగా వుంది. ప్రధానమార్గంలో వున్నప్పుడే నలుగురికి అందుబాటులో వుంటుంది సత్రం. మంచిరోజు చూసి పని మొదలు పెట్టించండి. పెద్ద సత్రమే నిర్మించండి...."

"ఏకకాలంలో వెయ్యిమందికి పైగా నివసించేలా నిర్మించడం మంచిదని అనుకుంటున్నాను...."

"అలాగే.... ఎంత త్వరగా పూర్తి అయితే, అంత మంచిది. ఇక్కడ పని పూర్తయిన తర్వాత, చోళవందాన్‌లో పని మొదలు పెట్టించండి. నిధులంటారా, అమ్మవారి అనుగ్రహంవల్ల లోపం వుండదని మా నమ్మకం. ధర్మకార్యానికి ఆ జగజ్జనని తప్పక సహాయం చేస్తుంది!"

"తమ ఆత్మప్రత్యయమే అస్మదాదులకు పెన్నిధి వంటిది."

"అమ్మవారు అనుగ్రహిస్తే, చిన్న గ్రామాలలో కూడా సత్రాలూ

చావిళ్లూ నిర్మించి గ్రామస్థులకు తోడ్పడాలని మా అభిలాష. అవసరమైన చోట్ల తటాకాలూ, కూపాలూ, తవ్వించి జానపదులకూ బాటసారులకూ మేలు చెయ్యాలని మా సంకల్పం. మా ఆశయాలు నెరవేరే సుదినం ఎన్నడో మరి!"

"నేను మిమ్మల్ని ప్రశంసిస్తున్నట్టుగా భావించరాదు. మీ చిత్తశుద్ధే మీ సంకల్పాలకు శ్రీరామరక్ష! తమ ఆశయాలు నెరవేరగలవనే నా నమ్మకం తల్లీ."

"మీ నోటివాక్యాన ఫలిస్తే చాలు, అదే మాకు పదివేలు...."

"ఈ ధర్మకార్య నిర్వహణకోసం ఒక ప్రత్యేకాధికారిని నియమించడం అవసరమని భావిస్తున్నాను. తమ ఆజ్ఞ అయితే...."

"ఇప్పుడున్న అధికారులు యీ పనులు నిర్వర్తించలేరని మీరు భావిస్తున్నారా?"

"నిర్వర్తించలేరనికాదు నా అభిప్రాయం. పనిలో జాప్యం జరుగుతుంది. ఈ వివిధ కార్యాలలో చూపవలసినంత శ్రద్ధాసక్తులు చూపలేరని నా నమ్మకం. ప్రత్యేకాధికారి అయితే ఆ పనుల్లోనే తన పూర్తి కాలాన్ని వినియోగించగలుగుతాడు. అప్పుడు తమరు సంకల్పించిన యీ ధర్మకార్యాలు సత్వరంగా పూర్తి అవుతాయి."

"అలాగే నియమించండి. ఆయన మధురలోనే వున్నా, నెలకు ఒక్కసారయినా ఆయా గ్రామాలు పర్యటించి, ఎప్పటికప్పుడు ఆ పనులు జరిగే తీరు తెన్నుల్ని మాకు తెలియజేస్తూ వుండాలి."

"అవశ్యం తల్లీ."

"దళవాయిగారూ, ఒక్క విషయం. సంపాదనమే ధ్యేయంగా కలిగిన వ్యక్తిని మాత్రం అలాంటి అధికారిగా నియమించకండి. ధర్మకార్య నిర్వహణకు పూనుకునే వ్యక్తిలో ధర్మచింతన వుండాలి. అతనికి స్వామి

భక్తితోపాటు పాపభీతి కూడా వుండాలి. అప్పుడే మా సంకల్పం నెరవేరు తుందని మా నమ్మకం...."

"తమ అభిప్రాయం నాకూ సమ్మతమే తల్లీ. ధర్మచింతనలేని వ్యక్తి ధర్మకార్యాలు సక్రమంగా నిర్వర్తించలేడు. తమరు సెలవిచ్చినట్లుగా, లెస్సగా పరీక్షించి తగిన వ్యక్తినే ఆ పదవికి నియమిస్తాను...."

మీ శక్తి సామర్థ్యాలలో, మాకు పరిపూర్ణ విశ్వాసం వున్నది."

## 6

ఆనాడు మధురానగరం జనార్ణవంగా కనిపించింది.

పరిసర గ్రామప్రజలు సకుటుంబంగా తరలివచ్చారు. దూరప్రదేశాల నుంచి కూడా ప్రజలు వచ్చారు. కొందరు తాము వచ్చిన ఎడ్లబండ్లలోనే వంటవార్పులు సాగించారు. కొందరు వటవృక్షచ్ఛాయల్లో తిండి తీర్థాలు సాగించారు. కొందరు తమ బంధుమిత్రుల గృహాలలో తిష్ఠ వేశారు. మధురానగర పౌరులు ఆరోజుకోసం సంవత్సరకాలంగా నిరీక్షించారు, చాతక పక్షుల్లా, మధురకే పెళ్ళి కళ వచ్చింది!

నిత్యోత్సవాదులతో కలకలలాడుతూ నిత్యకళ్యాణంపచ్చతోరణంలా కనిపించే మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయం చైత్రోత్సవ సందర్భంగా మరింత శోభ సమకూర్చుకుంది. చైత్రోత్సవం మధురలో జరిగే ఉత్సవాల కన్నిటికీ తలమానికం! అది పదిరోజుల ఉత్సవం.

అళగర్ కోయిలులో వేంచేసివున్న సుందరరాజస్వామివారికి కూడా మహోత్సవం జరిగేది. ఆ చైత్రోత్సవ సందర్భంగానే, శివకేశవులకు సంబంధించిన మహోత్సవ మది: పన్నెండురోజుల గొప్ప ఉత్సవం. అదీ అపూర్వ ఉత్సవం!

మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయంలో ధ్వజారోహణం నుంచి ఉత్సవం ప్రారంభమవుతుంది. కాని మీనాక్షీ సుందరేశ్వరుల

కళ్యాణోత్సవం, ఆ మరునాడు జరిగే రథోత్సవం అతి ప్రధానమైనవి. తన సోదరి అయిన మీనాక్షి వివాహ వైభవాన్ని కళ్ళారా తిలకించే కుతూహలంతో సుందరరాజస్వామి అళగర్ కోయిల నుంచి తరలి వస్తాడు. మధ్య వున్న వైఘానదిని దాటితేగాని, అమ్మవారి ఆలయంరాదు. సుందరరాజస్వామి నదిలో ప్రవేశించేసరికి వివాహ మహోత్సవం ముగిసినట్లు తెలుసుకుంటాడు. విఫల మనోరథుడైన సుందరరాజస్వామి ఏరు దాటకుండానే తిరుగుముఖం పడతాడు. ఆ చైత్రోత్సవాన్ని సందర్శించే కుతూహలంతో ఎక్కడెక్కడి ప్రజలు గుమిగూడుతారు. అందుకే ఆనాడు మధురానగరం జనార్ణవం !

పూర్వం మీనాక్షీ సుందరేశ్వరుల వివాహమహోత్సవమూ, సుందరరాజస్వామివారి మహోత్సవమూ వేర్వేరు కాలాల్లో జరిగేవి. శైవ వైష్ణవుల మధ్య సామరస్యం నెలకొనాలనే సదుద్దేశంతోనూ, ప్రజల సౌకర్యార్థమూ ముద్దుతిరుమలశౌరి నాయనయ్యవారు తన పరిపాలనా కాలంలో ఈ ఉత్సవాలు రెండూ చైత్రమాసంలో జరిగేలా కట్టడి చేశాడు. పూర్వం మీనాక్షి కళ్యాణమహోత్సవం చైత్రంలో జరిగేదికాదు. పరిసర గ్రామప్రజలు ఆ ఉత్సవాన్ని తిలకించేందుకు యిబ్బంది పడేవాళ్ళు. పైగా రథోత్సవంనాడు రథం లాగడానికి తగినంతమంది భక్తులు లభించేవారు కారు. చైత్రమాసం కర్షకలోకానికి ఆటవిడుపు ! అందువల్ల లక్షల సంఖ్యలో ఉత్సవాన్ని దర్శించ వచ్చేవారు.

తిరుమలశౌరి నాయనయ్యవారి కాలంనుంచీ ఏకకాలంలో ఆ రెండు ఉత్సవాలు మహావైభవంగా జరగసాగాయి. ఆ మహోత్సవమే చైత్రోత్సవం !

సుందరరాజస్వామి వైఘానదిని ప్రవేశించే ఆ అద్భుత దృశ్యాన్ని దర్శించి తరించాలనే వుద్దేశంతో వచ్చే భక్తలోకం ఆ దృశ్యం సందర్శించి ఆనంద పారవశ్యం చెందుతుంది.

తిరుమలశౌరి నాయనయ్యవారు చేసిన ఆ మార్పు రాణికి ఎంతో నచ్చింది. ఎక్కడెక్కడి ప్రజలూ చైత్రోత్సవాన్ని పురస్కరించుకుని మధురకు రావడం, ఆ జనసముద్రాన్ని తిలకించే సదవకాశం కలగడం భాగ్యవిశేషంగా భావించింది. సంప్రదాయాన్ని గౌరవిస్తూనే, ప్రజల సౌకర్యానికి అనుగుణంగా ఆ సంప్రదాయంలో చిన్నమార్పు చేసిన తిరుమలశౌరి నాయనయ్య ఆమెకు మహోన్నతుడుగా గోచరించాడు. 'మాకు ఆదర్శం ఆయనే' అనుకుంది.

చైత్రోత్సవం సందర్భంగా బంధువులతో అంతఃపురం కలకలలాడింది. వచ్చిన వారిని సముచితరీతిని గౌరవించడం, వారికి సపర్యలు చెయ్యడంతో పరిచారికలకు ఊపిరాడలేదు. అందరికీ చేతినిండుగా పని. వారినందరినీ రాణి నూతన వస్త్రాలతో సత్కరించింది. వారు కూడా ఆమెకు విలువగల కానుకలు బహూకరించారు.

ఉత్సవం ముగియడంతో మధుర యథాస్థితికి వచ్చింది.

నిర్మాణంలో వున్న సత్రం మధురకు వచ్చిన వారినందరినీ బహుధా ఆకర్షించింది. రాణిని మధుర పౌరులేకాక యాత్రికులు సైతం బహువిధాల ప్రశంసించారు. ఆ సత్రానికి మంగమ్మగారి సత్రం అని ప్రజలే నామకరణం చేశారు.

"ఇంత పెద్ద సత్రాన్ని నేనింతవరకు ఎక్కడ చూడలేదు."

"సత్రం పూర్తయితే, యాత్రికుల యిబ్బందులన్నీ తీరిపోతాయి. మధురలో ఎక్కడ బస చెయ్యాలా అనే సమస్య వుండదు."

"ఇందరు రాజులు పరిపాలించారు. సత్రం నిర్మించి ప్రజలకు సహాయపడదామని ఎవ్వరూ అనుకోలేదు."

"అదే మన మహారాణిగారి విశిష్టత."

"రాణిగారి మనస్సు నవనీత సమానం. ప్రజాక్షేమంపట్ల ఆ తల్లికి ఎంతో అక్కర!" అని సత్రాన్ని మెచ్చుకున్నారు గ్రామాలనుంచి వచ్చిన

ప్రజలు. కొందరు చైత్రోత్సవం సందర్భంగా జరిగిన రథోత్సవం గురించి చెప్పుకోసాగారు.

"ఈసారి రథోత్సవం కనులపండువుగా జరిగింది. గత సంవత్సరం కూడా రథం లాగడానికి యాతనపడ్డాం. గతుకుల బాట. ఆ బాటమీద రథం సాగుతుంటే ఎంత భయపడ్డాం...."

"అవునవును. ఈసారి ఆ భయం రవ్వంతైనా కలగలేదు. బాట దృఢంగా పరిశుభ్రంగా వుంది. రథం లాగుతున్నట్టే అనిపించలేదు...."

"మన కష్టాలు తీరిపోయినట్లే, ఈసారి వానాకాలంలో జర్రు బుర్రుమని జారుతూ నడవనక్కరలేదు."

"మన మహారాణిగారు చల్లగా వుండాలి. ఆ తల్లికి మనమీద ఎంత దయ!"

"మనం విన్నవించుకోకుండానే, మన కష్టాలు తీరుస్తున్న తల్లి."

"మన మధురను చాలామంది పరిపాలించారు. ఎంతసేపూ వాళ్ళు గుళ్ళు గోపురాలు, సుందర భవనాలు మొదలైనవి నిర్మించారే కాని ప్రజలకిలా ఉపయోగపడే బాటలు వెయ్యాలని వారెవ్వరూ అనుకోలేదు."

ప్రజాభిప్రాయాలను చారులు ఎప్పటికప్పుడు దళవాయికీ మంత్రులకూ తెలియజేస్తున్నారు.

ఒకనాటి రాత్రి సౌధోపరిభాగం. రాణి అటూ యిటూ తిరుగుతున్నది. మేనికి తగులుతున్న మందమారుతంగాని, కింద సుందరోద్యానం నుంచి వస్తున్న సువాసనలుగాని ఆమెకు అంత హాయి అనిపించలేదు. ప్రజాభిప్రాయాలను నెమరువేసుకోసాగింది. యుద్ధభీతి లేకుంటే ఎంత బాగావుంటుంది! యుద్ధాలకయ్యే ఖర్చువల్ల మంచిపనులకు అంతరాయం ఏర్పడుతోంది.... అది తలుచుకుని ఆమె బాధపడింది.

"అమ్మా!" వెనుకనుంచి చొక్కమ్మ పిలుపు.

"ప్రభువులు నిద్రపోయారా?"

"లేదమ్మా. మామూలుగా భోజనంచేసి పడుకున్నారు. ఎందుకో ఒళ్లు చూద్దునుగదా, వేడిగా వుంది. మీకు చెపుదామని యిలా వచ్చాను."

"అలాగా !" తల్లిలేని పిల్లవాడు! ఎలా పెంచి పెద్ద చెయ్యాడమో! అనుకుని బాధపడింది.

"వైద్యుడికి వర్తమానం పంపారా ?"

"చెప్పడానికి అళగమ్మ వెళ్ళిందమ్మా."

ఇద్దరూ కిందికి దిగి విజయరంగ చొక్కనాథనాయనయ్య మందిరం చేరుకున్నారు.

వైద్యుడు కూడా వచ్చాడు. నాడి పరీక్షించి, తేనెతో రంగరించి యిమ్మని చూర్ణం యిచ్చాడు.

"మామూలు జ్వరమే గదా !" ఆదుర్దాగా అడిగింది రాణి.

"ప్రభువులకి కొంచెం అజీర్ణం చేసింది. అందువల్ల వచ్చిన జ్వరం తల్లీ."

"అవసరమైతే మళ్ళీ మీకు వర్తమానం పంపుతాను" అంది చొక్కమ్మ.

"ఒకరాత్రికల్లా తగ్గిపోతుంది, భయపడనవసరం లేదు...."

"ఎందుకో యీమధ్య ప్రభువులు కొంచెం నలతగా వుంటు న్నారు...."

"అవును. సమయానికి గుర్తు చేశావు" అంది రాణి.

"అమ్మా, జ్వరం పాంతం తగ్గనివ్వండి. మళ్ళీ చూస్తాను. ప్రభువుల ఆరోగ్య విషయంలో మీరేమీ ఆందోళన పడనవసరంలేదు...."

"మీరు చెప్పినట్లుగా అన్నపానాల విషయంలో ఎంతో జాగ్రత్తగా వుంటోంది మా చొక్కమ్మ."

"చొక్కమ్మ లోపంకాదు తల్లీ. ప్రభువుల్ని కంటికి రెప్పలా చూసు కుంటోంది చొక్కమ్మ."

ఆ తర్వాత రాణిగారి అనుజ్ఞ తీసుకుని వైద్యుడు వెళ్ళిపోయాడు. ప్రభువులకు మందివ్వడానికి చొక్కమ్మ వెళ్ళింది.

రాణి శయ్యాగృహం చేరుకుంది. పట్టుపరుపు మీద పడుకుందేగాని కునుకు పట్టలేదు, తెగని ఆలోచనలు!

చొక్కమ్మ వచ్చి ద్వారంవద్ద నిలబడింది.

"అక్కడే నిలబడ్డావు, రా చొక్కమ్మా." ప్రీతిపూర్వకంగా పిలిచింది.

రాణి శయ్యాగృహం లోపలికిరావడం చొక్కమ్మకదే మొదటిసారి. శయ్యాగృహం తాలూకు పనులు చూడడం మరో పరిచారిక వంతు.

శయ్యాగృహంలోని విలువుటద్దాలు, పట్టెమంచం మొదలైనవాటిని చూసి ఆశ్చర్య చకితురాలయింది చొక్కమ్మ.

"పట్టెమంచం పనితనం చూసి ఆశ్చర్యపోతున్నావా చొక్కమ్మా?"

"అవును తల్లీ."

"మమ్మల్ని కాపరానికి పంపేముందు మా నాన్నగారు దగ్గరుండి చేయించిన మంచమిది. మహారాజావారు చాలా మెచ్చుకునేవారు మంచం చూసినప్పుడల్లా .... ఇలాంటి పనితనం మధుర పనివాళ్ళల్లో కనిపించదు...."

"తమరు రాణిగారైనా పుట్టింటి వ్యామోహం పోనివ్వారు కారు...."

కనుబొమలు ముడిచి రాణి ఆమెవంక చూసింది.

"అలా అన్నందుకు క్షమించాలి. తమ రిచ్చిన చనువువల్ల అన్నాను...."

"నువ్వేమీ పొరపాటుగా చెప్పలేదు. స్త్రీ సహజమైన గుణాన్ని వ్యక్తం చేశావు.... సరేగాని విశేషాలేమిటి?"

"మరేంలేదు తల్లీ. తమరు మేడమీద వున్నప్పుడు, దళవాయి గారు వచ్చి వెళ్ళారు.

"మమ్మల్ని పిలవకపోయావా ?"

"రేపు వచ్చి తమతో మాట్లాడుతామని దళవాయిగారు చెప్పారు. వెడుతూ వెడుతూ యీ వినతిపత్రం తమకిమ్మని యిచ్చివెళ్ళారు." అంటూ ఆ వినతిపత్రం రాణి సముఖాన ఉంచింది.

అది చూస్తూ, "ఎవరో ఫకీరు పంపిన వినతి పత్రం. నువ్వే చదువు" అన్నది.

చొక్కమ్మ వినతిపత్రం చదివి వినిపించింది.

"క్రైస్తవ మతప్రచారకుల్ని మేము ఆదరిస్తున్నట్టుగా, ముసల్మానుల్ని కూడా ఆదరించాలని ఆ ఫకీరు విజ్ఞప్తి. అంతేనా ?"

"అంతే తల్లీ. తమరు అన్ని మతాలను సరిసమానంగా ఆదరిస్తున్నారు. అయినా యీ ఫకీరుకి తృప్తి కలిగినట్లు తోచడంలేదు."

"ఇన్ని దానధర్మాలు చేసినా, మనవారు మాత్రం తృప్తి చెందుతున్నారా ? ఎందరో దేవతామూర్తులకు అమూల్యాభరణాలు సమర్పించాము. సమర్పించాలని సమర్పించలేదు. అది మా ధర్మంగా భావించాము."

"తమరన్నది వాస్తవం తల్లీ. తిరుమలశౌరినాయనయ్యవారు చెయ్యని దానధర్మాలు లేవు. అయినా కుమతులు కొందరు ఆయనపట్ల వైరభావం వహించారు...."

"ఎంత ఉదారంగా సంచరించినా, అందరినీ తృప్తిపరచడం అసాధ్యం చొక్కమ్మా.... క్రైస్తవమత ప్రచారకుల్ని మేము మనస్ఫూర్తిగా ఆదరిస్తూ వున్నాము. అప్పుడప్పుడు కుటిలమతులైన ఉద్యోగుల చర్యలవల్ల అందరితోపాటు వారూ యిబ్బందులకు పాల్పడుతున్నారని వింటున్నాము. మేము ప్రదర్శించే యీ మతసహనం కొందరి ఆగ్రహావేశాలకు కారణమవుతున్నది.... అందరినీ సంస్కరించలేము...."

"నిజం తల్లీ. తమరేమనుకుంటారో అని నేనింతవరకు చెప్పలేదు. మతప్రచారకులకు తమరిచ్చినంత స్వేచ్ఛ మరెవ్వరూ యివ్వలేదు.

వారైనా తృప్తిచెందారో లేదో .... ఇంత స్వేచ్ఛ యిచ్చినందుకు మీనాక్షయ్యగారు అసంతృప్తులై వున్నారు. తమకిది విన్నవించినందుకు నన్ను క్షమించాలి...."

"ఇందులో క్షమించవలసింది ఏమీలేదు చొక్కమ్మా."

"నేనిది విన్నవించడానికి మొదట భయపడ్డాను."

"ఎవరి మతం వారిదీ. ఎవరి మతాన్ని వారు అవలంబించడంలో ఒకరి యిష్టానిష్టాలు పనికిరావని మా ఉద్దేశం. కాని మతపరమైన కలహాలను మాత్రం మేము సహించం, సహించబోము."

"తమదాకా వచ్చిందో లేదో తెలీదు...."

"ఏ విషయం చొక్కమ్మా ?"

"తమరు యింత మతసహనం ప్రదర్శిస్తున్నారా.... రామనాథపురం కిళవన్ సేతుపతిగారు క్రైస్తవమత ప్రచారకుల పట్ల కొంచెం కఠినంగా వ్యవహరిస్తున్నారని చెప్పుకుంటున్నారు...."

"ఆయన అలా కఠినంగా వ్యవహరిస్తున్నారని మేము భావించడం లేదు."

"నిజంగానా, అమ్మా."

"మతప్రచారకులుగా వచ్చినవారు తమ ధర్మం నిర్వర్తించాలిగాని, తమ మత సిద్ధాంతాలను ప్రజలమీద బలవంతంగా రుద్దకూడదు. అలా వ్యవహరించి రామనాథపురంలో జాన్ డిబ్రిట్టో అనే పాదిరీ ప్రజల ఆగ్రహావేశాలకు పాల్పడ్డాడు. ఆయన చాలామందిని మతాంతరులుగా మార్చినట్లు విన్నాము. అందువల్ల ఆయనంటే మరవ ప్రజలకు తీరని ఆగ్రహం కలిగింది. అది సహించలేక సేతుపతిగారు కూడా ఆగ్రహించారు. రాజ్యక్షేమం అతిముఖ్యంగదా! ప్రజలు ఆగ్రహించారంటే రాజ్యక్షేమానికి భంగం వాటిల్లుతుంది...."

"అందుకా తల్లీ బ్రిట్టోగారిని హత్య చేసింది! నే నెందుకో అనుకున్నాను."

"ఆయన బలవంతంగా మరవల్ని మతాంతరులుగా చేసి వుండవచ్చు. అలా చెయ్యడం మాకూ సమ్మతం కాదు....అయినా ఆయన్ని హత్య చెయ్యడం మాత్రం శోచనీయం. సాటి మనిషిని చంపినందువల్ల, సమస్య పరిష్కారం కాదు. పైగా కొత్త సమస్యలు తలెత్తవచ్చు. సమస్య పరిష్కారం కానప్పుడు హత్యవల్ల పాపం, దుష్కీర్తి తప్ప మరేమీ కలగవు...."

"ఎందుకో తల్లీ, హింసపట్ల రోజురోజుకీ అసహ్యం కలుగుతోంది...."

"అది సహజమే చొక్కమ్మా. అందుకే మన రాజ్యంలో మేము మతప్రచారకులకు స్వేచ్ఛ యిచ్చాము. మతప్రచారం చేసుకోవచ్చు. అంతేగాని ఎవ్వరినీ నిర్బంధం చెయ్యకూడదని కట్టడి చేశాము. స్వేచ్ఛను దుర్వినియోగం చేసినప్పుడే సమస్యలు వస్తాయి."

"మరి యీ వినతిపత్రం మాట తల్లీ...."

"అదే ఆలోచిస్తున్నాము. ముసల్మానుల్ని కూడా ఆదరించడంలో తప్పేముంది?"

"బహుశా యీ విషయం తమతో చర్చించడానికి దళవాయిగారు వచ్చి వుంటారు."

"మత సహిష్ణుత ప్రదర్శించడం పరిపాలకుల కర్తవ్యం.... ముస్లిములని కూడా ఆదరించడమే శ్రేయస్కరంగా భావిస్తున్నాము...."

చొక్కమ్మ మౌనం వహించింది.

"మా అభిప్రాయం నీకు సముచితంగా తోచడంలేదా?"

"అమ్మా, తమకు నేను చెప్పదగినదాన్నికాను. అందరూ తమలా విశాలహృదయులైతే కలహాలూ కార్పణ్యాలూ వుండవు."

అళగమ్మ వచ్చి నిలబడింది.

"ప్రభువులకు జ్వరం తగ్గిందా ?"

"తగ్గిందమ్మా."

రాణి ముఖంలో సంతోషం కనిపించింది.

"ఒళ్ళంతా చెమటలు పట్టాయమ్మా. ఇది చెప్పడానికే వచ్చాను."

"మంచిది."

రాణి, చొక్కమ్మలు విజయరంగచొక్కనాథుని మందిరానికి బయలుదేరారు.

"మన వైద్యుల మందులు క్షణాలమీద పనిచేస్తాయి. ప్రభువులకు జ్వరం తగ్గిందని వర్తమానం వెంటనే పంపు."

"అలాగేనమ్మా."

రాణి మనవడి దగ్గర కొంచెంసేపు కాలక్షేపం చేసింది. తర్వాత శయ్యాగృహానికి వెళ్ళింది.

హజారంలో పన్నెండు గంటలు కొట్టారు. అప్పుడే పన్నెండయిందే అనుకుంది. చొక్కమ్మతో మాట్లాడుతున్నంతసేపు నిద్ర ముంచుకు వచ్చింది. ఇప్పుడు నిద్రపోదామంటే కునుకు పట్టదు.

ఫకీరు వినతి పత్రంలోని విషయాలను మరొకమారు రాణి గుర్తు చేసుకుంది. ఆ ఫకీరు కోరినట్లు దర్గాకి దానధర్మాలు చెయ్యడమే మంచిదనుకుంది. అయినా దళవాయిగారితో సంప్రదించి తుదినిర్ణయం చెయ్యడమే సముచితమని భావించింది.

ఆ మరునాడు ఉదయం రాణి పూజాగృహాన్ని సమీపిస్తుంటే, ద్వారపాలిక, "అమ్మా, తమ దర్శనార్థం దళవాయిగారు అభ్యంతర గృహంలో వేచి వున్నారు" అంది.

రాణి ఆశ్చర్యపోయింది. దళవాయి రాకకు కారణం ఏమిటా అని లోచించింది. ఆలోచిస్తూనే పూజాగృహం ప్రవేశించింది. అమ్మవారిని

నభ క్తికంగా నమస్కరించి, అలవాటు ప్రకారం ధ్యానంలో మునిగింది. కాని దళవాయి రాకవల్ల, ఆమె మనస్సు మనస్సులోలేదు. కారణమా అంతుపట్టలేదు. నిష్ఠ కుదరలేదు. ధ్యానం ముగించుకుని, ఆమె అభ్యంతర గృహానికి దారితీసింది. వెంట వచ్చిన పరిచారికలు ద్వారంవద్ద నిలబడగా, ఆమె లోనికి వెళ్ళింది.

రాణి రాకను గ్రహించిన దళవాయి లేచి నిలబడ్డాడు. ఆయన వెంట వున్న ప్రముఖుడు కూడా లేచి రాణికి నమస్కరించాడు.

లోనికి వస్తూనే, "నేడు సుదినం. మబ్బులు లేకుండానే వర్షం. శాహజీ మహారాజుగారికి స్వాగతం." అంది రాణి ప్రీతి పురస్కారంగా. ఆయనకి నమస్కరించింది. ఆయన ప్రత్యభివాదం చేసి ఒక ఉన్నతాసనం అలంకరించాడు.

"తంజావూరు మహారాజావారు మన పట్టణానికి విజయం చేస్తున్న వర్తమానం నిన్నరాత్రి నాకు తెలిసింది. హుటాహుటి వచ్చాను, తమకీ విషయం నివేదిద్దామని. అప్పుడు తమరు విశ్రాంతి తీసుకుంటున్నారు. తమకు అంతరాయం కలిగించకూడదని, నేను వచ్చిన విషయం తమకు తెలపమని చొక్కమ్మకు చెప్పి వెళ్ళిపోయాను. అమ్మగారు మన్నించాలి." అన్నాడు దళవాయి.

"మీరు చాలా మంచిపని చేశారు. మహారాజావారిని సరాసరి యిక్కడికి తీసుకువచ్చారు." రాణి శాహజీని సాదరంగా తిలకించింది.

"తామూ తమ ప్రజలు కుశలమని భావిస్తున్నాము."

"బృహదీశ్వరుని కరుణా కటాక్షాల వల్ల మేమంతా కుశలం. తాము...."

"అమ్మవారి అనుగ్రహం వున్నంతవరకూ మా యోగక్షేమాల కేలాంటి కొదువ వుండదు."

"విజయరంగ చొక్కనాథనయ్యవారిని తాము సింహాసనాధిష్ఠుని చేసినప్పుడు మేము రాలేకపోయాము...."

"బహుకార్య వ్యగ్రులు మీరు...."

"వద్దామని ప్రయత్నించాము. కాని సందర్భపడలేదు. రామేశ్వరం వెడుతూ యిక్కడ విశ్రమించి, తమ దర్శనం చేసుకుందామనుకున్నాము. అలాగే ప్రభువులవారిని దర్శిద్దామనుకున్నాము."

"కృతజ్ఞులం."

"మహారాజావారు సహృదయులు" అన్నాడు దళవాయి.

"మొదటినుంచీ తంజావూరువారికీ మాకూ యీ సఖ్యభావమే కనక నెలకొనివుంటే దక్షిణాపథంలో శాంతిభద్రతలు సుస్థిరంగా వుండేవి. తమరు మాయందు అంత సముఖత్వం ప్రదర్శించకపోయినా, రామేశ్వరం వెడుతూ యిక్కడ విశ్రమించాలని తమరుఅభిలషించడం మాఅదృష్టం...."
రాణి మందహాసం చేసింది.

శాహజీ మహారాజా నవ్వి మౌనం వహించాడు.

"మనస్సులో ఏమి వున్నా, తాము మా పట్టణానికి విజయం చెయ్యడం మాకెంతో సంతోషదాయకంగా వుంది."

"రాకూడదని కాదు...."

"ఇప్పుడా పాత విషయాలు ఎందుకులెండి. తమ దర్శనభాగ్యం కలిగింది. అదే మాకు పదివేలు." రాణి మనసు విప్పి చెప్పింది.

"ఎంత మాట !"

"అలా అనికాదు. మాతృభాష కాకపోయినా, మా తెలుగుభాషని ఎంతగానో తమరు ఆదరిస్తున్నారు. మాతృభాష మహారాష్ట్రం, దేశం ద్రావిడం అయినా తమరు తెలుగుకవుల్నీ తెలుగు సాహిత్యాల్నీ పోషిస్తున్నారు. మేము చెయ్యవలసిన పనిని మీరు చేస్తున్నారు."

"అంతేకాదు తల్లీ, మహారాజావారు తెలుగులో కృతికర్తలూ, కృతిభర్తలు కూడా...." అన్నాడు నరసప్పయ్య.

"అవునవును. మా రఘునాథనాయనయ్యవారిలా మీరూ తెలుగు వారికి చిరస్మరణీయులవుతారు."

"ఆకాశానికి ఎత్తుతున్నారు. రఘునాథరాయలవారు అపరభోజులు, అపర కృష్ణదేవరాయలవారు.... వారెక్కడ, నేనెక్కడ" అన్నాడు మహారాజు వినయపూర్వకంగా.

"ఎవరక్కడ ?"

"అమ్మా !" అంటూ ద్వారపాలిక మెరుపులా వచ్చింది. రాణీ ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ నిలబడింది.

"చొక్కమ్మను మేము పిలుస్తున్నామని చెప్పు."

"చిత్తం తల్లీ."

"ఇదుగో...." వెళ్ళబోయిన ద్వారపాలిక ఆగి, ఆజ్ఞకోసం నిరీక్షించింది.

"భోజనశాలలో మహారాజావారికి విందు యేర్పాట్లు చెయ్యండి. వారితోపాటు మేమూ వస్తాము."

"చిత్తం తల్లీ."

ఇంతలో మరో పరిచారిక హేమపాత్రముల పళ్ళెరంతో వచ్చి, రాణికి సమీపాన నిలిచింది.

"స్వీకరించండి" అంటూ రాణి ఒక హేమపాత్రను శాహజీ ముందుంచింది. దళవాయి ఒక హేమపాత్రను తీసుకున్నాడు.

"ఏలకుల పొడి కలిపిన యీ పాలు అమృతంలా వుంది" అన్నాడు శాహజీ పాలు తాగుతూ.

"శ్రీ విల్లిపుత్తూరు ప్రాంతంలో పండే ఏలక్కాయల రుచే రుచి" అన్నాడు దళవాయి నవ్వుతూ.

"మీ మధుర రాజ్యంలోనివని చెప్పండి."

విజయరంగ చొక్కనాథనాయనయ్యను ఎత్తుకుని చొక్కమ్మ వచ్చింది. అతడు రాణి చెంత ఆసీనుడయ్యాడు.

"ప్రభువులకు నమస్కారం" అన్నాడు శాహజీ.

విజయరంగ చొక్కనాథుని చేత ప్రత్యభివాదం చేయించింది రాణి.

"అవ్వగారి కనుసన్నల్లో పెరిగి పెద్దవాడవుతున్న పౌత్రుడు తాత గారిని మించిన వారవుతారు."

"అదే మా అభిలాష కూడా!"

"మహారాణిగారు మరోవిధంగా భావించకపోతే, మా మనస్సులోని మాటను మనవి చెయ్యాలని మా అభిలాష...."

"మహారాజావారు నిస్సంకోచంగా చెప్పవచ్చు."

"ముద్దు వీరప్పనాయనింవారు విగత జీవులయిన తర్వాత, మధుర రాజ్యంలో శాంతిభద్రతలు లోపిస్తాయనీ, రాజ్యానికి ముప్పు వాటిల్ల వచ్చుననీ భావించాము. ఈ విపత్కర పరిస్థితిలో మహారాణిగారే ఈ రాజ్యాన్ని నిలబెట్టినవారయ్యారు."

"నిస్సందేహంగా.... మహారాజావారు లెస్సగా సెలవిచ్చారు. మా మహారాణిగారు ప్రదర్శించిన ధైర్యసాహసాల వల్ల, శక్తిసామర్థ్యాల వల్ల మా రాజ్యం నిలిచింది. మేమూ సుఖంగా మనగలుగుతున్నాము" అన్నాడు నరసప్పయ్య. ఆయన మాటల్లో గూడుకట్టుకున్న కృతజ్ఞతాభావం శాహజీ మహారాజుని ముగ్ధుణ్ని చేసింది.

రాణి కళ్ళు చెమ్మగిల్లాయి.

"పాత విషయాలు గుర్తుచేసి రాణిగారిని బాధపెట్టలేదు గదా!" అన్నాడు శాహజీ.

"ఆ పాతరోజులు తలచుకుంటేనే మనస్సుకెంతో హాయిగా

వుంటున్నది. ఆ రోజుల్లో మహారాజావారు పక్కన కొండలా వుండేవారు మానసిక క్షోభ అంటే యేమిటో ఎరగను. ఇప్పుడన్నీ సమస్యలే. వీటి పరిష్కరించేసరికి తలప్రాణం తోకకి వస్తున్నది. మనశ్శాంతి నల్లపూస యింది. ఇరవై నాలుగుగంటలూ ఆలోచనలతో సరిపోతున్నది. మా పరిస్థితే యిలా వుంటే, మా దళవాయిగారు ఎలా బాధ భరిస్తున్నారో ఆ పరమాత్ముడికే తెలియాలి...."

"మా సమస్యలు అలాగే వున్నాయి తల్లీ...."

రాణి నవ్వింది. "మీకు సమస్యలు లేవని కాదు చివరికి మా కోడలు కూడా మమ్మల్ని సరిగా అర్థం చేసుకోలేదు. ఇలాంటి పరిస్థితి మీకు లేదని మా నమ్మకం. ఎవరికీ ఉండకూడదనీ భావిస్తున్నాము...."

"రాణిగారు పడుతున్న క్షోభ యిప్పుడు నా కర్థమయింది.... ముద్దమ్మగారి వంటి సంప్రదాయ విధేయురాలు మరొకరు ఉండరని మా అభిప్రాయం."

"ఆమె బ్రతికివుంటే మాకీ బాధలుండేవి కావు. కన్నకొడుకుని వెయ్యికళ్ళతో చూసుకుంటూ ఆమె రాజ్యపాలన చేస్తుంటే, మాకీ సమస్య లేమీ వుండేవికావు. ఏదో ఒకమూల కూర్చుని, కృష్ణా రామా అనుకుంటూ కాలక్షేపం చేసేందుకు అవకాశం లభించి వుండేది."

"తమరలా అనుకుంటే ఎలా చెప్పండి? తమ పరిపాలనలో ప్రజలు ఆదమరిచి నిద్రపోగలుగుతున్నారు....కాని...."

దళవాయి కనుబొమలు పెద్దవిచేసి మహారాజావంక చూశాడు.

"ఏదో సందేహిస్తున్నారు, చెప్పండి. మా లోపాలుంటే సర్దుకుంటాము."

"ఎంత మాట! లోపమని కాదు. తమరు క్రైస్తవ మత ప్రచారకు లకు చాలా స్వేచ్ఛ యిస్తున్నారు. అలా స్వేచ్ఛ యివ్వడంవల్ల ఉత్తరోత్తరా సమస్యలు తలెత్తవచ్చని మా అభిప్రాయం...."

మౌనం అలుముకుంది.

"సమస్యలా !" మౌనాన్ని ఛేదిస్తూ రాణి దళవాయిని పరికించింది

"రాజ్యక్షేమం దృష్ట్యా తమరిస్తున్న స్వేచ్ఛ వాంఛనీయం కాదని మా నమ్మకం" శాహజీ మాటల్లో ఆయన విశ్వాసం ప్రతిఫలించింది.

"మహారాణిగారు ప్రదర్శిస్తున్న యీ మతసహనం వాంఛనీయమనే మేము హృదయపూర్తిగా భావిస్తున్నాము. మన రాజ్యాలలో నివసించే వివిధ మతాలవారిని ఆదరించడం మన కర్తవ్యం కాదా ? పాలితుల్ని అన్ని పరిస్థితులలోనూ ఆదుకోవడం పాలకుల ధర్మం కాదా ?" సూటిగా ప్రశ్నించాడు దళవాయి.

"పాలితుల్ని సమాదరించడం మన కర్తవ్యమే. కాని స్వేచ్ఛ యివ్వడం వాంఛనీయం కాదు."

"అదుపులో వుంచడం మంచిదంటారు."

శాహజీ మహారాజు ప్రత్యుత్తరం ఇచ్చేలోగా, రాణి గంభీర స్వరంతో ఇలా అన్నది.

"కొందరు శాకాహారులు, మరికొందరు మాంసాహారులు. అలాగే తనకు ఉత్తమమని తోచిన మతం అవలంబించే స్వాతంత్ర్యం ప్రతి మానవునికీ వుంది. అందుకే మత ప్రచారకులకు మేము స్వేచ్ఛ యిచ్చాము. క్రైస్తవ మతప్రచారకుల వల్ల పలువురు మతాంతరులవుతున్నారని మీ భయం...."

"అవును తల్లీ, అందుకే మతప్రచారకులకు స్వేచ్ఛ యివ్వడం హానికరం కాగలదని మా భయం" అన్నాడు తంజావూరు పాలకుడు.

"నిజమే, మా రాజ్యంలోనూ మతాంతరుల సంఖ్య ఎక్కువవుతూ వుంది. అయినా హిందూమతానికి నష్టం వాటిల్లదనే మా విశ్వాసం. మన మతం యీనాటిది కాదు. ఎందరో హిందువులు మతాంతరులయ్యారు. అయినా యిది సజీవంగానే వుంది; సజీవంగా వుంటుంది."

మహారాణి ప్రత్యుత్తరం శాహాజీని ఆశ్చర్యచకితుని కావించింది. ఆయన తృప్తిచెందినట్లు కనిపించలేదు. ఏదో చెప్పాలనుకున్నాడు. ఆశ్చర్యంలోంచి ఆయన తేరుకోకముందే, రాణి మళ్ళీ యిలా అన్నది.

"మహారాజావారికి తెలియని విషయం కాదు. మా మధురనాయక రాజులు ఆదినుంచీ వర్ణాశ్రమ ధర్మ సంరక్షకులుగా పేరుప్రఖ్యాతులు గడించిన వారు...."

"అమ్మగారు మన్నించాలి. వర్ణాశ్రమ ధర్మ సంరక్షణతోపాటు, విభిన్న వర్ణాలవారికి వారి వారి శక్తిసామర్థ్యాలకు అనుగుణంగా అవకాశాలు కల్పిస్తున్న సహృదయులు మా పాలకులు" దళవాయి అన్నాడు.

మహారాణి మందహాసం చేసింది. "ఈ విషయం మా దళవాయి గారికి తెలిసినంతగా మాకు తెలియదు."

"మా రాజ్యంలో విద్యాసంపన్నులూ సచ్ఛీలురూ అయిన బ్రాహ్మణులకు విశేష గౌరవాభిమానాలు కలవనే విషయం సర్వవిదితం. బ్రాహ్మణులు మంత్రిత్వం నెరపుతున్నారు; సైన్యాధ్యక్షులుగా కూడా వ్యవహరిస్తున్నారు."

"అందుకు మీరే సాక్షి అన్నాడు శాహాజీ నవ్వుతూ.

దళవాయి కూడా మందహాసం చేశాడు.

"తమకు తెలుసు. విశ్వనాథనాయనయ్యవారి కాలంలో అరియనాథ మొదలిగారు బహు ప్రసిద్ధులు. ఆయన దళవాయి, ప్రధానిగా వ్యవహరించి, మధుర రాజ్యాభివృద్ధికి ఎంతగానో శ్రమించారు. ముద్దు తిరుమలశౌరి నాయనయ్యవారి కాలంలో దళవాయి రంగన్ననాయుడుగారు దళవాయి రామప్పయ్యగారికి కుడిభుజంగా వ్యవహరించారు. వాళ్ళిద్దరూ రామ లక్ష్మణులని కీర్తి గడించారు. చొక్కనాథ నాయనయ్యవారి కాలంలో దళవాయి నముఖం వెంకట కృష్ణప్పనాయుడుగారు బహు ప్రముఖులు. వారందరూ బ్రాహ్మణేతరులే, స్వామిభక్తులే. ఉన్నత విద్యాభ్యాసం

బ్రాహ్మణులకే చాలావరకు పరిమితమై వున్నా, బ్రాహ్మణేతరులలోనూ సంస్కృత విద్వాంసులున్నారు. మత విషయక చర్చలో ఒక కమ్మరి పాల్గొన్నట్లు మా పెద్దలు చెపుతూ వుండేవారు. ఒక విదుషీమణి సంస్కృతంలో అనర్గళంగా సంభాషించేది. సముఖం వెంకట కృష్ణప్ప నాయుడుగారు పెక్కు పద్య గద్యకృతులు వెలయించిన ప్రముఖ విద్వాంసులు.... కనుక విభిన్న మతాలవారిని మహారాణిగారు ఆదరించడం అసమంజసం కాదు."

"దళవాయిగారు వక్తలని యిప్పుడే గ్రహించగలిగాను."

"సంస్కృతాంధ్ర భాషా విశారదులైన మహారాజావారు మన్నించాలి, నా మాటల్లో దొసగులేవైనా దొరలితే...."

"సత్యోక్తులెప్పుడూ దోషరహితాలుగానే వుంటాయి." శాహజీ మాటల్లో తృప్తి ప్రస్ఫుటమయింది.

"సత్యోక్తులు దోషరహితాలే కాక, సహజ సుందరములు కూడా" రాణి ప్రసన్నవదనం దళవాయిని అభినందిస్తున్నట్టుగా గోచరించింది.

నరసప్పయ్య లోలోన సంతోషించాడు. కృతజ్ఞతాపూర్వకంగా రాణిని తిలకించాడు.

"దళవాయిగారూ !"

"అమ్మా !"

"నిన్న రాత్రి మీరిచ్చి వెళ్ళిన వినతిపత్రం చూశాము."

"అమ్మా! ఆ ఫకీరు తిరుచిరాపల్లికి దగ్గరలో వున్న కొన్ని గ్రామాలు దర్గా నిమిత్తం కోరుతున్నారు."

"మీ అభిప్రాయం ?"

"ఆయన కోరికను మన్నించడమే సముచితమని తోస్తున్నది."

"అయితే, వాటిని దానంగా యిద్దాము."

శాహజీ తన ఆశ్చర్యాన్ని ప్రకటించలేదు. మౌనంగా కూర్చున్నాడు.

"గోవిందయ్యగారిచేత దానపత్రం వ్రాయించండి."

"తెలుగులోనా ?"

"తెలుగులోనే. తంజావూరి పాలకులు సంస్కృత ద్రావిడ భాషలలో వ్రాయించారు. కాని మా దానపత్రాలూ అవీ మన తెలుగులోనే వుండడం మాకు హర్షదాయకం."

ఆ తర్వాత పరిచారికలు దారి చూపగా, శాహాజీ మహారాజా విశ్రాంతి మందిరానికి వెళ్ళాడు.

రాణి దళవాయితో రాజ్యవ్యవహారాలు చర్చించసాగింది.

ఆనాడు సభాభవనం కనులపండువుగా అలంకరించబడింది.

నగర ప్రముఖులు, ఉన్నతోద్యోగులు ఉచితాసనాలు అలంకరించారు.

ప్రత్యేకంగా అమర్చబడిన వేదికమీద రాణి ఉన్నతాసనం అలంకరించింది. ఆమె చెంత విజయరంగ చొక్కనాథనాయనయ్య ఆసీనుడై వున్నాడు.

వేదికచెంత దళవాయి నరసప్పయ్య, మంత్రులు ప్రభృతులు నిలబడి వున్నారు.

ఇంతలో మంగళ తూర్యారవాలు వినవచ్చాయి.

సభాసదులు నిలబడ్డారు.

రాణి ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్టు కనిపించింది.

దళవాయి ఎదురువెళ్ళి సభాభవనం ప్రవేశించిన ఆ ప్రముఖుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు.

వచ్చిన ప్రముఖుడు దీర్ఘకాయుడు. పొడుగాటి అంగరఖా ధరించాడు. అతని గడ్డం, మీసం మొదలైనవి అతడు ముస్లిం సేనాధిపతి

అని తెలియజేస్తున్నాయి. అతనికోసం వేదికచెంత ఒక ఉన్నతాసనం అమర్చబడింది. ఆ ప్రముఖుడు ఆ ఆసనం అలంకరించాడు.

పిమ్మట సభాసదులు ఆసీనులయ్యారు.

దళవాయి వేదికమీదికి వెళ్ళాడు. రాణికీ, విజయరంగ చొక్కనాథ నాయనింవారికీ తొలుత నమస్కరించాడు. రాణి ఆజ్ఞకోసం నిరీక్షించాడు.

తర్వాత సభాసదులకు నమస్కరించి, దళవాయి యిలా ప్రసంగించాడు.

"మీనాక్షీ సుందరేశ్వరుల స్థిరతర కరుణా కటాక్షములకు పాత్రులైన మన ప్రభువుల పక్షాన మాట్లాడమని మహారాణిగారు నన్ను ఆదేశించారు. వారి ఆదేశాన్ని శిరసావహిస్తున్నాను.

ఈనాడు మన నగరానికి విజయం చేసిన ప్రముఖ వీరవరేణ్యులు జుల్ఫిర్ఖానుగారికి మనసార స్వాగతం పలుకుతున్నాను. ఆయన్ని మనం దర్శించడం యిదే ప్రప్రథమం. అయినా ఆయన పేరుప్రఖ్యాతులు మనలో చాలామందికి తెలుసు. అయినా మనవి చేస్తున్నాను. మొగలు పాదుషా వారైన ఔరంగజేబుగారి ఆదరాభిమానములు పొందిన సేనాధిపతి ఆయన. స్వామిభక్తులు, మహావీరులు. పాదుషావారి ఆజ్ఞమేరకు ఆయన ప్రస్తుతం దక్షిణభారతం పర్యటిస్తున్నారు. పాదుషావారికి కుడిభుజంగా వ్యవహరిస్తున్న జుల్ఫిర్ఖానుగారు మన నగరానికి విజయం చెయ్యడం మన అదృష్టం. ఆయన మనకు ఆప్తులు కావడం మన భాగ్య విశేషమనే భావించాలి. ప్రస్తుతం మొగలాయీ చక్రవర్తులు ప్రబలులై వున్న అంశం తమ కందరికీ విదితమే. ఈ శుభసమయాన గౌరవనీయులైన మన అతిథికి ప్రభువుల పక్షాన కొన్ని విషయాలు విన్నవిస్తున్నాను.

పాండ్యధరామండలేశ్వరులూ, దక్షిణ సింహాసనాధ్యక్షులూ, కాశ్యప గోత్రోద్భవులూ రాజా విశ్వనాథనాయనిం వారి వంశకర్తలూ రాజా చొక్కనాథనాయనయ్యవారి పౌత్రులూ రంగకృష్ణ ముద్దు వీరప్పనాయనయ్య

వారి పుత్రులూ అయిన విజయరంగ చొక్కనాథనాయనయ్యవారి పరిపాలనలో మనమందరం సుఖశాంతులతో వర్ధిల్లగలుగుతున్నాము. ప్రభువులు పసివారు కావడంవల్ల, రాజాచొక్కనాథనాయనింవారి పట్ట మహిషి అయిన మంగమ్మగారు సంరక్షణ కర్త్రిగా వ్యవహరిస్తూ సకల రాజ్యవ్యవహారాలు ఎంతో సమర్థంగా పర్యవేక్షిస్తున్నారు. ఇరుగు పొరుగు రాజ్యాలలో శాంతి సౌఖ్యాలు లోపించగా, మనం శాంతిసౌఖ్యాలు అనుభవించడానికి ముఖ్య కారణం మహారాణిగారి పరిపాలనా దక్షతయే...."

సభికుల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

జుల్‌ఫిర్ఖాను రాణిని ఆదరపురస్సరంగా తిలకించాడు.

రాణి ప్రశాంత గంభీరవదనయై గోచరించింది.

హర్షధ్వానాలు తగ్గిన తర్వాత, నరసప్పయ్య ప్రసంగించాడు.

"రాజా విశ్వనాథనాయనయ్యవారు మొదలుకొని మన ప్రభువుల దాకా గల మన పరిపాలకులందరూ సహజంగా దయార్ద్రహృదయులు, దాన వినోదులు, వదాన్యశేఖరులు, ధర్మమార్గావలంబకులు, మతసహనం ప్రదర్శించిన విశాల హృదయులు, కళా పోషకులు, ప్రజల ఉపయోగార్థం సప్తసంతానాలు వెలయించిన సహృదయులు. వర్ణాశ్రమ ధర్మ సంరక్షకులు. ముద్దు తిరుమలశౌరి నాయనయ్యవారు ప్రభృతులు నిర్మించిన సుందర భవనాలు వివిధ రాజ్యాల కళా హృదయుల్ని బహుదా ఆకర్షిస్తున్నాయి. మన మహారాజులు గుళ్ళు గోపురాలు ఎన్నెన్నో నిర్మించారు.

సంరక్షణ కర్త్రిగా వ్యవహరిస్తున్న మా మహారాణిగారు దాన ధర్మాలు చెయ్యడంతోపాటు ప్రజోపయోగార్థం బాటలు, సత్రాలు, బావుళ్ళు, తటాకాలూ, కూపాలూ ఎన్నో వెలయించారు. వారి ప్రజాహితకార్యాలు పట్టణాలకే పరిమితం కాకుండా పల్లెపట్టులకు కూడా విస్తరించడం పేర్కొనదగిన ప్రముఖ విషయం. మన పూర్వ పరిపాలకులు గ్రామాల

విషయంలో అంత శ్రద్ధాసక్తులు వహించలేదు. మన మహారాణిగారు ప్రదర్శిస్తున్న మతసహనం ప్రశంసార్హం. మన యిరుగు పొరుగు రాజ్యాలలో మతసహనం లోపించగా, మన మధుర రాజ్యంలో విభిన్న మతాలవారు తమ తమ ధర్మాలు ప్రీతిపూర్వకంగా అవలంభిస్తున్నారు. ఈ నడుమనే మహారాణిగారు ఒక దర్గాకి తిరుచిరాపల్లికి సమీపాన వున్న కొన్ని గ్రామాలు దానం చేశారు. అన్ని మతాలవారు స్వీయధర్మాలు చక్కగా పాటిస్తూ, సుఖశాంతులతో జీవించాలన్నదే మా మహారాణివారి ఆశయం. అదే వారి లక్ష్యం కూడా !"

సభలో మళ్ళీ హర్షధ్వానాలు. ప్రభువులకూ మహారాణికి జయజయ ధ్వానాలు సమర్పించారు.

ప్రశాంతత యేర్పడ్డ తర్వాత, మరికొంతసేపు ప్రసంగించి, మరొకతూరి జుల్‌ఫిర్ఖానుగారికి ప్రభువుల పక్షాన హృదయ పూర్వక స్వాగతం సమర్పిస్తున్నాను." అని, ప్రభువులకూ రాణికి అంజలి ఘటించి, మొగలాయీ సైన్యాధ్యక్షుని వేదికమీదకు ఆదరపూర్వకంగా ఆహ్వానించాడు దళవాయి.

మంత్రులు అచ్చయ్య, మీనాక్షయ్యలు వెంట నడవగా, జుల్‌ఫిర్ఖాను వేదిక అధిరోహించాడు. ప్రభువులకూ మహారాణికి నమస్కరించి నిలబడ్డాడు.

మహారాణి ఆజ్ఞమేరకు ఇద్దరు పరిచారికలు రెండు వెండి పళ్ళెరములతో ఆమెను సమీపించారు. పళ్ళెరముల మీది అచ్ఛాదనలు తొలగించారు.

పళ్ళెరాలలో ఉన్న అమూల్యాభరణాలు, చీని చీనాంబరాలు తిలకించేసరికి జుల్‌ఫిర్ఖాను కళ్లు మిరుమిట్లు గొలిపాయి.

మహారాణి ఉన్నతాసనం నుంచి లేచి జుల్‌ఫిర్ఖానుని సమీపించింది. ఆ అమూల్య వస్తువుల్ని అతిథికి బహూకరించింది. మందహాసం కావిస్తూ, చాలాసేపు సభికులు హర్షధ్వానాలు ప్రకటించారు.

హర్షధ్వానాల మధ్య జుల్ఫిర్ఖాను ప్రభువులకీ, రాణికీ తన కృతజ్ఞతను వినయపురస్సరంగా వ్యక్తం చేశాడు.

నాటి సభ పరిసమాప్తమయింది.

జుల్ఫిర్ఖాను ప్రత్యుత్తరం ఇవ్వకపోవడం సభికులలో కొందరిని నిరుత్సాహపరిచింది.

ఆ తర్వాత మొగలు సైన్యాధ్యక్షుడూ దళవాయి నరసప్పయ్యా అభ్యంతర గృహానికి బయలుదేరారు. రాణీ ప్రభృతులు తమ తమ నివాసాలకు దారితీశారు.

"ఈ భవనాలు బహు సుందరములు; అత్యద్భుతాలు." సంతోష పారవశ్యంతో అన్నాడు జుల్ఫిర్ఖాను.

"ప్రస్తుతం మీరు దర్శిస్తున్న యీ సుందర మహలు తిరుమలశౌరి నాయనింవారి పర్యవేక్షణలో నిర్మించబడింది. నాయనింవారు సుందర భవన నిర్మాతలు."

"ఆ మహారాజావారి పేరు విన్నాను. ఆయన్ని దక్షిణాపథపు షాజహాన్ అని మావాళ్లు ప్రశంసిస్తూ వుంటారు."

"ఆయన మహోన్నతమైన గోపురాలు నిర్మించాలని అభిలషించారు. ఒకచోట కాదు; డెబ్బయి రెండుచోట్ల నిర్మించాలని ఆయన అభిలాష. అందుకు పూనుకున్నారు. నిర్మాణం కూడా ప్రారంభమయింది. కాని పని మధ్యలోనే ఆగిపోయింది...."

"ధనాభావమా ?"

"ధనాభావం కారణం కాదు. యుద్ధ వ్యూహాన్ని భరించవలసి వచ్చింది. ఎక్కడలేని విధులూ యీ యుద్ధాలకు చాలడంలేదు...."

జుల్ఫిర్ఖాను నవ్వి మౌనం వహించాడు.

"నాయనింవారు తలపెట్టిన ఆ గోపురాలు కనక పూర్తి అయి వుంటే, ఎంతో బాగుండి వుండేది. మధ్యలోనే ఆగిపోయిన ఆ గోపురాలను రాయగోపురాలని వ్యవహరిస్తున్నాము...."

"మహారాజావారి విగ్రహం ఎక్కడైనా వుందా? దర్శించాలని వుంది."

"మహారాజావారు మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయానికి అభిముఖంగా కొత్తమండపం నిర్మించారు. అది పూర్తి కావడానికి 22 సంవత్సరాలు పట్టింది...."

"చాలా పెద్ద మండపమన్నమాట!"

"ఆయన నిర్మాణాలన్నీ పెద్దవే. ఆ మండపంలో రాజా విశ్వనాథ నాయనయ్యవారు మొదలుకొని తిరుమలశౌరి నాయనయ్యవారి దాకా మా మధుర నాయకరాజుల విగ్రహాలున్నాయి. చూడచక్కని విగ్రహాలు. జీవకళలు వుట్టిపడే విగ్రహాలు...."

"ఈ సాయంకాలమే ఆ మండపం దర్శించాలని అభిలషిస్తున్నాను...."

"అవశ్యం. నేనే మిమ్మల్ని అక్కడికి తీసుకువెడతాను. అలాగే అమ్మవారి ఆలయాన్ని బయటినుంచి దర్శించవచ్చు."

"అలాగే."

"మా మహారాణివారు ప్రస్తుతం ఒక వేసవి విడిది నిర్మిస్తున్నారు. పూర్తి అయిన తర్వాత, అది ఒక ప్రముఖ నిర్మాణ మనిపించుకుంటుంది...."

జుల్ఫీర్ఖాను మనస్సు దళవాయి మాటలలో లగ్నం కాలేదు. ఆ సుందరభవనాలు దర్శించేకొద్దీ మధుర నాయకరాజుల సిరిసంపదలు గురించి అతడు తలపోయసాగాడు. ఆ భవనాలు దర్శించి అతడు ఈర్ష్య చెందాడు. ప్రజలు మహారాణిపట్ల ప్రకటిస్తున్న ఆదరాభిమానాలు చూసి ముగ్ధుడయ్యాడు. ప్రజాసన్నుతిని చూరగొన్న ఆ రాణితో సఖ్యభావంతో సంచరించడమే శ్రేయస్కరమనుకున్నాడు. ఆమెను లోబరుచుకోవడం,

తద్వారా మధురరాజ్యం మీద అధికారం చెలాయించడం చాలా సులభమని మధురను చూడకముందు పగటికలలు కన్నాడు. తీరా ఆ నగరాన్ని దర్శించిన తర్వాత, మనస్సు మార్చుకున్నాడు.

"ఏదో ఆలోచిస్తున్నట్టున్నాడు." జుల్‌ఫిర్ఖాను మనస్సుని దళవాయి పసిగట్టకపోలేదు.

మాట తడబడుతూ, "అబ్బే యేమీలేదు. ఈ సుందర భవనాలు నన్నెంతగానో ఆకర్షించాయి." అన్నాడు.

ఇంతలో వారిద్దరూ అభ్యంతరగృహం సమీపించారు.

అక్కడున్న పరిచారికలు స్వాగతవచనాలు పలికారు. ఆ లావణ్య లతికల అందచందాలు, తేనెలొలికే మాటలతీరు జుల్‌ఫిర్ఖానుని ముగ్ధుణ్ణి చేశాయి. ఆ పరిసరాల రామణీయకాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. దాక్షిణాత్య సంస్కృతిలో ఏదో విశిష్టత వున్నట్లు గ్రహించాడు.

పరిచారికలు దారి చూపుతుంటే, జుల్‌ఫిర్ఖాను, దళవాయి అభ్యంతర గృహంలోకి అడుగుపెట్టారు. అంతకుముందే అక్కడికి వచ్చిన మంత్రులు అతిధికి స్వాగతం చెప్పారు. ఆ అతిధి మర్యాద ఆయన్ని ఆనందపారవశ్యంలో ముంచింది.

మంత్రి మీనాక్షయ్య చూపిన ఉన్నతాసనం అలంకరించాడు జుల్‌ఫిర్ఖాను.

దళవాయి నరసప్పయ్య ద్వారంవద్ద నిలబడ్డాడు.

విజయరంగ చొక్కనాథనయ్యవారిని వెంటబెట్టుకుని రాణీమంగమ్మ, విజయం చెయ్యడంతో, ఆ పరిసరాలకు ఎక్కడలేని చైతన్యం వచ్చింది.

అభ్యంతరగృహాన్ని సమీపించగానే, వెంటవచ్చిన పరిచారికలు ద్వారం ఇరువైపుల నిలబడ్డారు.

ప్రభువులకూ రాణికి స్వాగతంచెప్పి, దళవాయి వారిద్దరినీ లోపలికి తీసుకువెళ్ళాడు.

జుల్ ఫిర్ఖాను ప్రభృతులు లేచి నిలబడ్డారు.

విజయరంగ చొక్కనాథనాయనింవారు, రాణి ఆసీనులైన తర్వాత, ప్రముఖులు తమ ఆసనాలు అలంకరించారు.

రాణి జుల్ ఫిర్ఖానువైపు సాదరంగా చూసింది.

"రాజప్రాసాదం నాకు బాగా నచ్చింది. ఏమి సుందర భవనాలు !" అన్నాడు సంతోషాతిశయంతో.

"మా పెద్దల ప్రసాదం !"

"దళవాయిగారు వివరిస్తుంటే ఆశ్చర్యపోయాను. తిరుమలశౌరి నాయనింవారు కావించిన సుందరనిర్మాణాలు చూసి, ఈ అంతఃపురం కొంతవరకూ దర్శించిన తర్వాత, ఆయన నిజంగానే ప్రముఖులనీ, సౌందర్య దీదృక్షువులనీ తోస్తున్నది. ఏమి భవనాలు, ఏమి భవనాలు.... కళ్ళు తిరిగిపోయాయి...."

"పాదుషావారి సుందరభవనాల కంటేనా !"

"అవి ఒక రకం. మీవి మరో రకం. ఎలాగైనా మీ శిల్పం భిన్నం గానే కనిపిస్తున్నది...."

"అమ్మవారి ఆలయాన్ని కూడా దర్శించి చెప్పండి...."

"దళవాయిగారు తీసుకువెడతామన్నారు...."

"ఇతర ఆలయాలు కూడా చూపించండి. బయటనుంచే చూస్తారు.... అలాగే నిర్మాణంలో వున్న వేసవి విడిదిని కూడా చూపించండి."

"చిత్తం తల్లీ."

తమరు చెప్పకముందే, తాము నిర్మించిన బాటలు చూశాను. తిరుచిరాపల్లినుంచి వస్తూ చూశాను. దృఢమైనవి, విశాలమైనవి. చాలా బాగున్నాయి. బాటల కిరువైపులా నీడనిచ్చే మొక్కలు నాటించారు. అవి పెరిగి పెద్దవయితే, బాటసారులకు చల్లనినీడ నిస్తాయి. ప్రజలంటే తమ కెంత అభిమానమో అర్థం చేసుకున్నాను. అందుకే ప్రజలు కూడా తమ

రంటే ఎంతో అభిమానం కలిగి ప్రవర్తిస్తున్నారు. ఇంత ప్రజాభిమానం పొందిన రాణిని నేను మరెక్కడా చూడలేదు." జుల్ఫిర్ఖాను మహారాణిని ప్రశంసావాక్యాలతో ముంచెత్తి వేశాడు.

లోలోన ఎంతగానో సంతసించినా రాణి, "అంతా ఆ అమ్మవారి చలవ" అని ఊరుకుంది.

"తమరు నాతో ఏదో చెప్పాలనుకున్నారట! దళవాయిగారు చెప్పారు."

"మరేంలేదు. మా రాజ్యం మా ప్రజల్ని మీరు స్వయంగా చూశారు గదా! మా విషయాలు మీరు పాదుషావారికి తెలియజెయ్యాలి...."

"తప్పకుండా."

"మాకు పాదుషావారి అండదండలు కావాలి...."

జుల్ఫిర్ఖాను నిర్ఘాంతపోయాడు. "తమకా!" అన్నాడు.

"ఏం, అలా అంటున్నారు?"

"తమ రాజ్యంలో శాంతిభద్రతలు సుస్థిరంగా వున్నట్టే నాకు తోస్తున్నది. అంతఃకలహాలూ అవీ వున్నట్టు నాకనిపించలేదు. ప్రజలు హాయిగా వున్నారు."

"మీరన్నది నిజమే. అంతఃకలహాలూ అవీ లేనిమాట నిజమే. అయినా పాదుషావారి అండదండలు మాకు అవసరం. ఇరుగుపొరుగు రాజులు శత్రుభావం వహించి మెలగుతున్నారు."

"అలాగా!"

"అందువల్ల చీటికి మాటికి యుద్ధాలు తప్పనిసరి అవుతున్నాయి. యుద్ధవ్యయం మీకు తెలియంది కాదు."

"పాదుషావారి సహాయం మీకు తప్పక లభిస్తుంది. నా మాట మీరు నమ్మవచ్చు...."

రాణి మందహాసం చేసింది, ఏమీ మాట్లాడలేదు.

"నా మాటల్లో మీకు సందేహం వుందా ?" అడిగాడు జుల్‌ఫిర్ఖాను.

"అబ్బే.... అదేంలేదు."

"మీరు నిశ్చింతగా వుండవచ్చు. పాదుషావారికి నేను చూసిన అన్ని విషయాలు నివేదిస్తాను...."

"అదే మేము కోరుతున్నది."

"అసలు నేను దక్షిణాపథానికి వచ్చింది యీ వుద్దేశంతోనే, పాదుషావారి ఆజ్ఞ కూడా యిదే...."

"మీ సహాయం లభిస్తే, మాకు పాదుషావారి సహాయం లభించినట్లే" అన్నాడు నరసప్పయ్య.

జుల్‌ఫిర్ఖాను దళవాయి ప్రశంసకు నిజంగానే సంతోషించాడు.

రాణికి సంతృప్తి కలిగింది. కృతజ్ఞతాపూర్వకంగా జుల్‌ఫిర్ఖానుని చూసింది.

ఆ తర్వాత రాణివద్ద అనుజ్ఞ తీసుకుని అతడు విశ్రాంతిగృహానికి వెళ్ళాడు, దళవాయి వెంట వెళ్ళాడు.

జుల్‌ఫిర్ఖాను కొన్ని రోజులు మధురలో ఉండి, తర్వాత మైసూరు వైపు ప్రయాణం సాగించాడు. దళవాయి నరసప్పయ్య, మంత్రులు, ఉన్నతాధికారులు అతనికి వీడ్కోలు యిచ్చారు.

మొగలు సైన్యాధిపతి మాటల్లో నమ్మకం కలిగినా, అతని సహాయ సహకారాలతో కోల్పోయిన రాజ్యభాగాలు తిరిగి పొందవచ్చుననే ధైర్యం కలిగినా మహారాణి మాత్రం సర్వకాల సర్వావస్థలలోనూ అప్రమత్తంగానే ఉంది. ఎప్పటికప్పుడు వార్తాహరులద్వారా యిరుగుపొరుగుల ఉన్న పరిపాలకుల్ని గురించి అన్ని విషయాలు తెలుసుకుంటూ వుండేది. తెలుసుకున్న విషయాలలోని సత్యాసత్యాలను క్షుణ్ణంగా పరిశీలించేది. దళవాయి, మంత్రులు ప్రభృతులతో చర్చలు సాగించేది. మరీ అవసరమని తోచినప్పుడు ఉన్నతోద్యోగుల్ని కూడా సంప్రతించేది. తత్ఫలితంగా

రాజోద్యోగులు కూడా అప్రమత్తంగానే సంచరించసాగారు. ఏ నిమిషంలో అంతఃపురం నుంచి ఏ వార్త వస్తుందో అనే భయం వారికి కలిగింది. అయినా ద్రోహచింతన గల ఉన్నతోద్యోగులు కొందరు రాణిపట్ల సుహృద్భావంతో వ్యవహరించేవారు కారు. ఏ విధంగా రాజ్యంలో శాంతి భద్రతలకు భంగం కలిగిద్దామా అనే ఆలోచిస్తూ వుండేవారు

దృఢమైన బాటలు నిర్మించడంతో పట్టణ ప్రజలు, జానపదులు పొందిన సంతోషానికి మేరలేదు. తటాకకూపాలు త్రవ్వించడంతో నీటి కరువుకి చేట కొట్టినట్లయింది. ప్రజల కడగండ్లు తగ్గుముఖం పట్టాయి. ముఖ్యంగా కర్షకుల కష్టాలు చాలావరకు తీరాయి. కేవలం వర్షపాతంమీద ఆధారపడడం తగ్గింది. బాటసారుల ఇబ్బందులు, రామేశ్వరాదీ పుణ్యక్షేత్రాలు దర్శించే యాత్రికుల అవస్థలు చాలావరకు తగ్గాయి. జన సంచారం దినదినాభివృద్ధి చెందేకొద్దీ క్రూరజంతువుల భయం తగ్గింది. చోరభయం తగ్గింది. మంగమ్మగారి రాజమార్గాలు, బాటలూ, మంగమ్మగారి సత్రాలు చావిళ్ళూ వెలుగులోకి రావడంతో, ఆ మహారాణిపట్ల వివిధ వర్గాల ప్రజలు వినయ విధేయతలు ఇకోధికంగా ప్రకటించారు. శాంతిభద్రతలు రాజ్యంలో సుస్థిరంగా నెలకొన్నాయి.

అయినా మహారాణి కెందుకో అసంతృప్తి! సతతమూ ఆలోచనా నిమగ్నయై ఉండేది. రాత్రి సమయాలలో సౌధోపరి భాగాన ఆసీనయై వెర్రిగా వైగైనదిని తిలకించేది. ఆ నదిలోని సైకత శ్రేణులు ఆమెను నిరుత్సాహపరిచేవి. నదీప్రవాహం నానాటికి తీసికట్టవుతున్నందుకు ఆమె బాధపడేది. ఆమె హృదయంలో మరేమి బాధలు నెలకొన్నవో!

ఒకనాడు ఉదయం నగిషీలు చెక్కిన వెండి పళ్ళెరంతో రజిత పాత్రతో చొక్కమ్మ మహారాణి మందిరానికి వచ్చింది. ఏలకులపొడి, పచ్చకర్పూరం మొదలైన సురభిళ ద్రవ్యాలు కలిపిన క్షీరపాత్ర అది. మహారాణి పూజాగృహంనుంచి తన మందిరానికి రాగానే, పాలపాత్ర

ఆమెకు అందించడం చొక్కమ్మ నిత్యవిహిత కర్మలలో ముఖ్యమైనదీ. తొలుత మరో పరిచారిక ఆ విధిని నిర్వహిస్తూ వుండేది. కాని ముద్దమ్మ మరణానంతరం రాణి అంతఃపుర పరిచారికలందరినీ విశ్వసించలేక పోయింది. కొందరు తనపట్ల వైరభావం వహించి వున్నారనే విషయాన్ని ఆమె పసిగట్టింది. అందువల్ల తనకు హాని సంభవిస్తుందేమోనని కూడా ఆమె సంశయించింది. ఆ సంశయం భయంగా పరిణమించింది. తత్ఫలితంగా క్షీరపాత్రం తనకు అందించే పనిని చొక్కమ్మకు ఒప్ప గించింది. ఆ వృద్ధ పరిచారిక ఎన్ని పనులని నిర్వర్తిస్తుంది! ఆ విషయమూ రాణికి తెలియకపోదు. విశ్వసనీయురాలైన మరో పరిచారిక ఆమెకు కనిపించలేదు. అందువల్ల రాణికి సంబంధించిన ముఖ్యమైన పనులు చొక్కమ్మ భుజస్కంధాలమీద పడ్డాయి. అవి ఆమె సహర్షంగా నిర్వర్తించేది.

పాల సువాసన చొక్కమ్మ రాకకు ముందే వచ్చింది. ఆమె వస్తున్నట్టు రాణి గ్రహించింది.

చొక్కమ్మ మందిరంలోకి అడుగిడడం తరువాయి, "రా చొక్కమ్మా" అని మహారాణి ఆప్యాయంగా పిలిచింది. "నీ కోసమే నిరీక్షిస్తున్నాము."

"నేడు కొంచెం ఆలస్యమయింది. తమరు నా కోసం నిరీక్షిస్తూ వుంటారనే అనుకున్నాను."

"ఫరవాలేదు" రాణి మందహాసం చేసింది.

క్షీరపాత్రను చొక్కమ్మ రాణి సమక్షాన వినయ పురస్సరంగా ఉంచింది.

మహారాణి సహజంగా సౌమ్యురాలు. తనపట్ల ఆమెకుగల ప్రేమాతిశయాన్ని చొక్కమ్మ ఎప్పుడో గ్రహించింది. మహారాణి ప్రదర్శించే ప్రేమాతిశయాన్ని ఆసరాగా తీసుకుని ఆమె నిర్లక్ష్యంగానో

అవిధేయతతోనో ప్రవర్తించేది కాదు. ఏకాంతంలో ఉన్నప్పుడు కూడా మహారాణిని మహారాణిగానే భావించి తన స్వామిభక్తిని ప్రదర్శించేది పైపెచ్చు, ఆమె అంటే చొక్కమ్మకు అపారమైన అభిమానం! తులలేని జాలి!

ఆనాడు రాణి మాటలలోని ఆప్యాయతను గ్రహించి చొక్కమ్మ కొంచెం ధైర్యంచేసి అడిగింది.

"అమ్మా! తమరెప్పుడూ ఆలోచనా నిమగ్నులై వుంటారు, కారణం తెలుసుకోవచ్చునా?" అడిగిందే కాని లోపల భయమే. రాణి తనను అపార్థం చేసుకుంటే!

రాణి పెదవులమీద దరహాస చంద్రిక కనిపించింది.

అది గమనించిన చొక్కమ్మకు మరింత ధైర్యం కలిగింది. "ఇలా అడిగినందుకు తమరు అన్యథా భావించరని అనుకుంటున్నాను. అడగాలని పించిందీ...."

"చొక్కమ్మా! నా మనస్సులోని మాటను నీతో కాకపోతే మరెవ్వరితో చెప్పుకుంటాను! ఆత్మీయులతో చెప్పుకున్నప్పుడే, కడుపు లోని దుఃఖం కరిగిపోతుంది. పైగా నువ్వు తప్పుగా ఏమీ చెప్పలేదు...."

చొక్కమ్మ సంతృప్తి చెందింది. ఆమె మనసులో గూడుకట్టుకున్న భయసందేహాలు తొలగిపోయాయి.

"మహారాజావారు స్వర్గస్థులయ్యారు. కన్నకొడుకేమో కన్ను మూశాడు. కోడలు బలవన్మరణం చెందింది. తండ్రి దైవికం చెందారు. తల్లి మా బాల్యంలోనే కాలధర్మం చెందింది. ప్రస్తుతం మాకున్నదల్లా ఒక్క మనవడు. ఇక ఆప్తులంటావా? నీకు తెలిసిందే. అంతఃపురంలో ఎవరు నమ్మదగినవారో, ఎవరు కారో అదీ నీకు తెలిసిందే. నేను కొత్తగా చెప్పవలసింది ఏమీ లేదు. కనక నీ వద్ద దాపరికం ఎందుకు చెప్పు?"

చొక్కమ్మ మనస్సు తేలికపడింది. పరీక్షగా రాణిని అవ లోకించింది.

"ఏం చొక్కమ్మా, ఆశ్చర్యంగా వున్నాయా మా మాటలు!"

"ఈ దుఃఖభారాన్ని తమరు ఎలా భరించగలుగుతున్నారా అని ఆలోచిస్తున్నాను."

రాణి చిరునవ్వు నవ్వింది.

"జీవించి వున్నంతవరకు మానవుడికి చీకుచింతలు తప్పవు. సమస్యలూ తప్పవు. వాటిని భరిస్తూ మునుముందుకి వెళ్ళకనూ తప్పదు. అంతేకాని ఆత్మత్యాగమో మరొకటో సమస్యలకూ చీకుచింతలకూ పరిష్కార మార్గం కాదు. సమస్యల్ని ఎదుర్కొంటూ ముందుకి సాగినప్పుడే, జీవితం ఉత్సాహభరితంగా కనిపిస్తుంది. స్వయంబుద్ధితో కొన్ని సమస్యల్ని పరిష్కరించవచ్చు."

"రాజకీయ సమస్యలు తమకు తప్పవనుకోండి."

"ఒక్క రాజకీయ సమస్యలే కాదు చొక్కమ్మా. మా మనవడు ఒక సమస్య కాదా?"

ఈ మాట రాణి ముఖతః వెలువడుతుందని చొక్కమ్మ ఎన్నడూ ఊహించలేదు. అందువల్ల నిర్ఘాంతపోయింది. తన పెంపకం సరిగా లేదేమో అని భయభ్రాంతురాలయింది. ఎవరైనా ప్రభువుల్ని గురించి ఏమన్నా అన్నారేమోనని భయపడింది. చొక్కమ్మ పడుతున్న తికమకను ఆమె ముఖకవళికల్ని బట్టి గ్రహించిన రాణి, "శక్తివంచన లేకుండా నువ్వు మా మనివణ్ణి సాకుతున్నావు. కంటికిరెప్పలా చూసుకుంటున్నావు. వెయ్యికళ్ళతో చూస్తున్నావు" అంది.

చొక్కమ్మ మనస్సు కుదుటబడింది.

"నా పెంపకం సరిగా లేదేమోనని నేను భయపడ్డాను. అందువల్ల తమరు బాధపడుతున్నారేమోనని సందేహించాను. కాని మీ మాటలు విన్న తర్వాత నా మనస్సు కుదుటబడింది" అంది కృతజ్ఞతా పూర్వకంగా.

"నువ్వు మాకు మొదటినుంచీ తోడునీడగా మెలగుతున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే చొక్కమ్మా, పసిపిల్లవాణ్ణి-అందులోను నెలల పసిబిడ్డను-పెంచి పెద్ద చెయ్యడం ఎంత కష్టమో ఎవరికి మాత్రం తెలీదు! కొన్ని రాత్రులు నువ్వసలు నిద్రపోలేదు. ప్రభువులు లేచినప్పుడల్లా నువ్వు లేచావు. సముదాయించావు. నిద్రబుచ్చావు. తల్లిలా పెంచావు. నాకా విషయం తెలుసు...."

"అమ్మా!"

"అవును చొక్కమ్మా—రాత్రివేళ అందరూ నిద్రపోయినతర్వాత నీ గదికి వచ్చి చూడడం మాకు అలవాటయింది. ప్రభువులు లేచి ఏడ్చినప్పుడల్లా, మాకు నిద్ర పట్టేదికాదు. నీ గదికి వచ్చి, నువ్వు పడుతున్న అవస్థను కళ్ళారా చూపేదాన్ని...."

"నే నెప్పుడు గమనించలేదమ్మా."

"మూడో కంటికి తెలీకుండా వీలయినంతవరకు అన్ని విషయాలు తెలుసుకోవడం మంచిదని మహారాజావారు అనేవారు. ఆయన మాట అక్షరాలా పరమ సత్యమని అనుభవపూర్వకంగా గ్రహించాము ..."

చొక్కమ్మ ఆశ్చర్యం ఇనుమడించింది.

"ఇంత కష్టపడి పెంచినా, పాపం తల్లిలేనివాడు—అంటారుగాని, తల్లిలా సాకుతున్నవారిని లోకం గుర్తించదు. వారిపట్ల సానుభూతి రవ్వంతైనా ప్రకటించదు...."

"అవును తల్లీ! తమరన్నది నిజం. ప్రభువుల్ని చూసినప్పుడు అంతఃపురంలో కొందరు నాకు వినిపించేలా, పాపం తల్లిలేని పిల్లవాడు అంటారుగాని, మాటవరసకైనా ఒక్కసారి దగ్గరికి తీసుకుని ముద్దు చెయ్యరు. జాలి మాత్రం పడతారు...."

"జాలి పడ్డంత మాత్రాన సమస్య తీరుతుందా? పైకి జాలిపడుతున్న వాళ్ళు ఏమన్నా ప్రభువుల్ని దగ్గరికి తీసుకుని లాలించారా, పాలించారా!

ఇంతేనమ్మా లోకం !....నిజమే. తల్లిలేని లోటుని తీర్చడం ఎవ్వరితరమూ కాదు. తల్లిపోయిన తర్వాత, తండ్రి పినతండ్రి అవుతాడని అంటారు. నిజమే కావచ్చు. కాని ఆ లోటుని తీర్చడానికి మనం పడుతున్న అవస్థను గుర్తించినవారు మాత్రం లేరు. మెచ్చుకుని మేకతోలు కప్పమని కోరడం లేదు. అనవసరంగా అక్షింతలు వెయ్యకుండా వుంటే చాలు. అదే మెచ్చుకుని మంచిమాట అన్నట్లే...."

"ఇప్పుడు తెలిసింది తల్లీ, ప్రభువుల పెంపకం ఎలా సమస్యగా పరిణమించిందో అని...."

"చొక్కమ్మా, యిప్పుడు నీతో చెపుతున్నాగాని, అంతఃపురంలో మనవాళ్ళు అనే మాటలు మేము ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వింటూనే వున్నాము...."

"అమ్మా, తమ రవేమీ పట్టించుకోకండి."

"ఎలా చెప్పు చొక్కమ్మా ! కొన్ని మాటలు ఈటెల్లా గుండెల్ని పొడుస్తుంటేను....మమ్మల్ని దర్శించవచ్చే ప్రముఖులతో మేము నవ్వుతూ మాట్లాడతాము. ముఖం చిట్లించుకుంటూనో, లేని దుఃఖం తెచ్చుకునో మాట్లాడే స్వభావం కాదు మాది...."

"నాకు తెలుసునమ్మా....మొదటినుంచీ గలగలమంటూ మాట్లాడే స్వభావం మీది. మనస్సులో ఎంత బాధవున్నా, పైకి పొక్కరు...."

"అంతెందుకు, మొన్న మన అతిథిగా వచ్చిన పాదుషావారి సేనాధిపతికి ఘనంగా స్వాగత మర్యాదలు చేశామా ! అది చూసి కొందరు మమ్మల్ని సంశయించారు...."

చొక్కమ్మ రాణిని పరీక్షగా చూసింది.

ఆవేశంతో ఆమె చెప్పసాగింది.

"విలువగల ఆభరణాలిచ్చి సత్కరించాము. ఆయన్ని సంతృప్తి పరిచాము. ఎందుకు? రాజ్యక్షేమం దృష్ట్యా, ఆయన సహాయంతో

కోల్పోయిన రాజ్యభాగాలను తిరిగి సంపాదించాలని మా అభిలాష. ఆయన తృప్తి చెందాడు. మనకు అండగా నిలబడతామని మాట యిచ్చాడు. ఆ మాట మాకెంత తృప్తి కలిగించిందో నువ్వు గ్రహించే వుంటావు...."

"అవును తల్లీ."

"మన రాజ్యానికి యిక పాదుషావారి వల్ల భయంలేదని భావిస్తున్నాము. శత్రుభయం కూడా అంతగా వుండదని భావిస్తున్నాము. ఇది ఆశించే ఆయన్ని అంతగా సత్కరించాము. రాజ్యక్షేమం కాదట మాదృష్టి...."

"అమ్మా, తుచ్ఛులమాటలు తమరేమీ గణించకండి...."

"యుద్ధవ్యయం తగ్గితే, ఆ ధనాన్ని సత్రాలు బావిళ్లు నిర్మించడానికి వినియోగించాలని మా సంకల్పం. ఈ సత్రాలవల్ల యాత్రికులకు ఎంత సౌకర్యంగా వున్నదో, ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నాము. ప్రజల యిబ్బందులు తీర్చాలనే మా సంకల్పం...."

"తమ ధర్మ చింతన ఎలాంటిదో నాకు తెలుసునమ్మా.... మన ప్రజలు కూడా గుర్తించారు తల్లీ...."

"కాని కొందరికి యితరులమీద అభాండాలు వెయ్యడంలో ఎంతో తృప్తి...."

"ఆ అభాండాలు వేసే తుచ్ఛులెవరో నాకు తెలుసునమ్మా, వాళ్లు ఎంత నీచంగా వ్యవహరిస్తున్నదీ తెలుసునమ్మా."

"వాళ్ళు అన్నారని కాదు. ఇలాంటి మాటలు మహారాజావారు దివంగతులైనప్పుడు విన్నాము....ముద్దమ్మ ఆత్మత్యాగం చేసుకున్నప్పుడు విన్నాము....మేము సహగమనం ఆచరించలేదని వాళ్ళ కోపం.... ఆచారాన్ని అతిక్రమించామని వాళ్ళ మంట...."

"అమ్మా, తెలీక అడుగుతున్నాను.... తమరు సహగమనానికి వ్యతిరేకులా ?"

రాణీ చొక్కమ్మ ముఖంలోకి చూసింది. చొక్కమ్మ ఏమనుకుందో యేమిటో వెంటనే, "రాణిగారు మన్నించాలి." అంది.

రాణీ నవ్వి, "నిన్నలా చూశానని నువ్వు భయపడ్డావా? నీమీద నాకు కోపం రమ్మన్నా రాదు చొక్కమ్మా...." అంటూ నవ్వింది.

"తమకు ఆగ్రహం కలిగించానేమోనని భయపడ్డానమ్మా...."

"మా కెందుకో సహగమనం దురాచారంగా కనిపిస్తున్నది. అంత మాత్రాన సహర్షంగా సహగమనం పాటించాలనుకునే వారిని నిరోధించము...."

"మరి, కోడలుగారి విషయం...."

"రాజ్యక్షేమం దృష్ట్యా ముద్దమ్మను వారించవలసివచ్చింది...."

"తమరన్నట్లు యీ ఆచారం అంత మంచిదికాదనే నేనూ భావిస్తున్నానమ్మా."

"సహర్షంగా ఆచరించని ఆచారం ఎన్నటికైనా నశిస్తుంది. అదీ కాలధర్మం....ఈ ఆచారం రాజకుటుంబాలలోనే కాక సామాన్యుల్లో కూడా వుండడం చూసి పరితపిస్తున్నాము.... అదీ సరే.... విజయరంగ చొక్కనాథుడు ఎక్కడా కనిపించడేం?"

"పూజాగృహంలో వున్నారమ్మా ...ప్రభువులకి దైవధ్యానంపట్ల అమితమైన ఆసక్తి."

"దైవధ్యానం మంచిదే, కాదనము. దైవధ్యానం చేసే ఆ కాసేపు మనస్సుకి ఎంతో ప్రశాంతత లభిస్తుంది. మహారాజావారు పరమ దైవ భక్తులు. తీరిక దొరికినప్పుడల్లా ఆయన దైవధ్యానంలో నిమగ్నులయ్యేవారు.

"తాతగారి పోలిక వచ్చినట్టుంది ప్రభువులకి." చొక్కమ్మ మందహాసం చేసింది.

"తాతగారి పోలిక రావడం మంచిదే. నాకూ సంతోషమే.

సాధారణంగా తాతగారి పోలికలు మనవడికి వస్తాయంటారు.... కాని...." మహారాణి కంఠం బొంగురుపోయింది. ఆమె నయనాలు అశ్రుపూరితాలు అయినాయి.

చొక్కమ్మ నొచ్చుకుంది. "ఈ విషయం ప్రస్తావించి తమకు బాధ కలిగించాను...."

"మహారాజావారు సతతమూ సద్గ్రంథ కాలక్షేపంలో మునిగిపోయి, సకల రాజ్యవ్యవహారాలూ యితరులకు వదిలివేశారు....చివరికి ఆయన ప్రజాభిమానం కోల్పోయారు !"

"దైవభక్తులే అయినా, ప్రభువులు అలా ప్రజాభిమానానికి దూరం కారనే నా నమ్మకం."

"సరి అబ్బకున్నా, చెడ అబ్బుతుందంటారు, చొక్కమ్మా...."

"లేనిపోని సందేహాలు పెట్టుకుని తమరు భయపడుతున్నారమ్మా...."

"ఒక్కొక్కసారి ప్రభువుల్ని చూస్తుంటే, నాకు మహారాజావారే గుర్తుకి వస్తున్నారు.... మహారాజావారు 'అతి' దైవభక్తి ప్రదర్శించి, రాజ్య వ్యవహారాలు నిర్లక్ష్యం చేశారు...."

"తమరే యిలా అనుకుంటే...." చొక్కమ్మ నాలుక కరుచుకుంది.

"నిజమే, మేమిలా అనుకోవడం పొరపాటే.... కాని నిజం ఎన్నటికీ దాగదు. మేము చెప్పకపోయినా, రేపు మరొకరు యిలా చెపుతారు.... వాళ్ళనోళ్ళు నొక్కగలమా !"

రాణికి గల సత్యనిష్ఠను చూసి చొక్కమ్మ ఆశ్చర్యచకితురాలయింది.

"ఏం చొక్కమ్మా, మూగనోము పట్టావు !"

"మీ మనస్సు ఎంత విశాలమయిందో యిప్పుడు నాకు తెలిసిందమ్మా ! మీ ధర్మచింతనే కాక సత్యప్రీతి కూడా అర్థమయింది...."

"నువ్వయినా అర్థం చేసుకున్నావు, అదే నాకు పదివేలు!...."

"తంజావూరి విజయరాఘవనాయనింవారు కూడా ఎప్పుడూ దైవ ధ్యానంలోనే నిమగ్నులై వుండేవారని చెపుతారు...."

"నిజమే, ఆయనతోనే తంజాపురాంధ్రనాయక రాజ్యం అంత మయింది. అందుకే చొక్కమ్మా, పరిపాలకులు ఎప్పుడూ అప్రమత్తంగా వుండాలనీ, రాజ్యవ్యవహారాలు స్వయంగా పర్యవేక్షిస్తూ వుండాలని మా అభిమతం. అప్పుడే రాజ్యంలో శాంతిభద్రతలు సుస్థిరంగా వుంటాయి. ప్రజలు సుఖశాంతులతో మనగలుగుతారు...."

"నిజమే తల్లీ, సుఖశాంతులులేని రాజ్యం నరకం...."

దైవధ్యానం ముగించుకుని విజయరంగ చొక్కనాథనాయనయ్య తన వద్దకు రావడం గమనించింది రాణి. ప్రేమార్ద్రనయనాలతో, 'రా, బాబూ" అంది.

చొక్కమ్మ లేచి నిలబడింది.

"అవ్వా" అంటూ వచ్చాడు విజయరంగచొక్కనాథుడు. అవ్వ ఒడిలో కూర్చున్నాడు.

కొంచెం ఎడంగా చొక్కమ్మ కూర్చుంది.

రాణి మనవణ్ణి ముద్దు పెట్టుకుంది. తల నిమురుతూ, "ఏమయ్యా, చక్కగా చదువుకుంటున్నావా?"

తల ఆడిస్తూ, "సుమతీ శతకం పద్యాలు ఎంత బాగున్నాయను కున్నావు!" అన్నాడు.

"అంత బాగున్నాయా!"

"అవునవ్వా."

"చూడు బాబూ, తెలుగు సంస్కృతం తమిళం-అన్ని భాషలు నువ్వు చక్కగా నేర్చుకోవాలి...."

"అలాగే నవ్వా."

"నేర్చుకోవడమేకాదు, ఆ భాషల్లో మంచి పాండిత్యం గడించాలి."

"పాండిత్యమంటే ?"

కుతూహలంగా చొక్కమ్మ రాణి వంక చూడసాగింది.

"ఇప్పుడు సుమతీ శతకం మొదలైన శతకాలు చదువుతున్నావా ? అలాగే తెలుగులోవున్న సద్గ్రంథాలన్నీ చక్కగా చదవాలి. అంటే మహాభారతం, భాగవతం, రామాయణాలు, మనుచరిత్ర మొదలైన ప్రబంధాలు— అన్నీ చదవాలి. అప్పుడు నీకు తెలుగుభాషమీద అధికారం కలుగుతుంది. అలా భాషమీద అధికారం సంపాదించిన వారిని పండితు లంటారు...."

"అయితే, నేను కూడా పండితుణ్ణవుతాను...."

రాణి మళ్ళీ మనవణ్ణి ముద్దు పెట్టుకుంది. "నువ్వు తప్పకుండా పండితుడివవుతావయ్యా" అంది విశ్వాసపూర్వకంగా.

అప్పుడే హజారంలో కొట్టిన ఘంటానాదం వినవచ్చింది.

"అవును తల్లీ ! గంటకూడా కొట్టారు.... తమరన్నట్టు తప్పకుండా ప్రభువులు గొప్ప పండితులవుతారు" అన్నది చొక్కమ్మ, సంబరపడుతూ.

"ఒక్క తెలుగులోనేకాదు, సంస్కృతంలోనూ పాండిత్యం గడించాలి."

"అవ్వా, నువ్వే చూస్తావుగా, నేనెలా చదువుకుని పండితుణ్ణి అవుతానో...."

"అంతకంటె కావలసిందేముంది బాబూ...."

"అవ్వా...."

"చెప్పు బాబూ...."

"పద్యం ఎంత బాగున్నా, నా మనస్సు గద్యం మీదికే పోతున్నది...."

"మంచిదే బాబూ. పద్యం వ్రాసినా, గద్యం వ్రాసినా, అది

గంభీరంగా ఉండాలి. పద్యమే వ్రాయాలనిలేదు. చక్కని గద్యం కూడా మంచి కవిత్వంలా మనస్సుకి ఎంతో తృప్తి యిస్తుంది. మనస్సుని వశం చేసుకునేలా వ్రాయాలి....''

''అలాగే అవ్వా.''

''బాబూ, మేమింతగా చెపుతున్నది ఎందుకంటే, మీ తాతలు ముత్తాతలు చాలా గొప్పవారు. యుద్ధవీరులుగా పేరు ప్రఖ్యాతులు గడించారు. ఎన్నో సత్కార్యాలు చేశారు. గుళ్లగోపురాలు ఎన్నెన్నో నిర్మించారు. అందాలుచిందే చక్కని భవనాలు నిర్మించారు. కాని కవి పండితుల్ని ఆదరించడంలో కొంచెం అశ్రద్ధ చేశారు. ఏమయితేనేం, తంజావూరి రాజులవలె మన పూర్వులు సాహిత్య పోషకులుగా పేరు పెంపులు గడించ లేదు. ఇది మనకు కొరతగానే మేము భావిస్తున్నాము....''

''ఆ కొరతను నేను తీరుస్తాను.''

రాణికి కలిగిన సంతోషానికి మేరలేదు. ఆ సంతోషాతిశయంతో మనవడి తల నిమిరింది. మనవణ్ణి కౌగిలించుకుంది.

ఆ దృశ్యం చూసి చొక్కమ్మ అంతులేని సంతోషంతో ఉప్పొంగి పోయింది. ''ప్రభువులు ఆ కొరతను తప్పక తీరుస్తారమ్మా. తమరు నిశ్చింతగా ఉండవచ్చు.''

''చూడు బాబూ, నువ్వు చెప్పిన యీ మాటను నిలబెట్టుకోవాలి. విజయరంగచొక్కనాథనాయనయ్య పండితుడు, కవి, గ్రంథకర్త, కవి పండితుల్ని పోషించిన సాహిత్యలోలుడు— అని యిలా నలుగురి మెప్పు పొందాలి అదే మేము అభిలషిస్తున్నదీ....'' రాణి తన అభిలాషను వ్యక్తం చేసింది.

విజయరంగచొక్కనాథనాయనయ్యను చొక్కమ్మ తీసుకు వెళ్ళింది. మనవణ్ణి చూస్తూ రాణి అక్కడే కూర్చుండిపోయింది.

# 8

ఆ రాత్రి రాణికి కంటిమీద కునుకులేదు. ఆమె ఆలోచనలన్నీ తిరువాంకూరు పరిపాలకుడు రవివర్మ మీద కేంద్రీకరించాయి. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడెప్పుడు మంత్రులతో తిరువాంకూరు వ్యవహారం చర్చిద్దామా అని తహతహలాడసాగింది. ఏమిటో సుఖశాంతులులేని యీ బ్రతుకు. ఎప్పుడూ యుద్ధభయమే. యుద్ధభీతి లేదనుకుంటే,మలినమనస్కుల వల్ల భయం. భయమే నా జీవితమైపోయింది. ఈ జీవితం ఎప్పుడు తెల్లవారుతుందో.... ఇలా అనుకుని బాధపడింది.

తెల్లవారింది.

మీనాక్షీసుందరేశ్వరుల ఆలయంలో ఉషఃకాల పూజాదికం జరుగుతోంది. ఘంటానాదం ఆ ప్రశాంత వాతావరణంలో స్పష్టంగా వినిపిస్తోంది.

దేవి మీనాక్షిని రాణి ధ్యానించింది. తనకు ధైర్యస్థైర్యాలు ప్రసాదించమని జగజ్జననిని అర్థించింది. రోజూ స్నానానంతరం పూజాగృహానికి వెళ్ళి, అమ్మవారి విగ్రహాన్ని దర్శించుకుని, కొంచెంసేపు ధ్యాన మందిరంలో ఆసీనమై ధ్యాన నిమగ్నురాలు కావడం ఆమె నిత్యవిహిత కర్మలలో ప్రధానమైనవి. ఆనాడు స్నానాదికం ముగించుకోకుండానే ఆమె పూజాగృహానికి వెళ్ళింది. అక్కడున్న పరిచారికలు ఆ సమయంలో ఉద్వేగభరిత అయిన రాణి రావడం చూసి విభ్రాంతపోయారు. వెంట చొక్కమ్మగాని మరెవ్వరుగాని లేరు.

రాణి రాకను గ్రహించిన యిద్దరు ముగ్గురు పరిచారికలు వెంటనే పూజాగృహాన్ని పరిశుభ్రం చేయసాగారు. కొందరు పూజాద్రవ్యాలు సిద్ధం చేయసాగారు. అవేవీ గమనించకుండా రాణి సరాసరి పూజాగృహంలో వేంచేసి వున్న మీనాక్షి చెంత కూర్చుంది. ఆ విగ్రహాన్ని అనుకుని రాజరాజేశ్వరి విగ్రహం కూడా కనులవిందు చేస్తున్నది. రాణి చూపులు

మీనాక్షీ విగ్రహంపైన కేంద్రీకృతమయ్యాయి. ఆమె కళ్ళవెంట అశ్రుధారలు స్రవించసాగాయి. అది చూసి చెంతవున్న పరిచారికలు భయభ్రాంత లయ్యారు, ఆందోళన చెందసాగారు.

ఇంతలో చొక్కమ్మ అక్కడికి వచ్చి రాణీ వెనుక చేతులు కట్టుకుని నిలబడింది.

మనసులో గూడు కట్టుకున్న బాధను రాణి అమ్మవారికి నివేదించింది. అప్పటికి ఆమెకు మనశ్శాంతి లభించినట్లనిపించింది. అయినా ముఖంలో సంతోషం లేదు; ప్రశాంతత లేదు. వెనుదిరిగి చూసింది.

"చొక్కమ్మా, దళవాయిగారికి కబురు పంపించావా ?"

"పంపించాను తల్లీ."

"మంత్రి అచ్చయ్యగారికి కూడా వర్తమానం తెలపడం మంచిది...."

"అలాగే తల్లీ."

"ఆయన్ని కూడా వెంటనే రమ్మని చెప్పి పంపించు."

"చిత్తం తల్లీ."

చెంతవున్న పరిచారికల్ని యుద్ధభీతి ఆవహించింది. రాణిలోని ఆందోళనకు కారణ మేమిటో వాళ్లు గ్రహించారు.

రాణి పూజాగృహం నుంచి వెడుతుంటే, అందరు శిలా ప్రతిమలులా కనిపించారు, ఎవరి ముఖంలోనూ సంతోషంలేదు.

ఎన్నడూ లేనంత త్వరగా రాణి ఆనాడు స్నానాదికం ముగించింది.

సుస్నాతుడై పూజాగృహానికి వెడుతున్న విజయరంగచొక్కనాథ నాయనయ్యను రాణి తిలకించింది. ఆమె మనస్సు చింతాక్రాంత మయింది. ఉన్నట్టుండి ఆమెను చూసిన విజయరంగచొక్కనాథనాయనయ్య ఆమె వద్దకు వచ్చాడు.

"అవ్వా, అంతఃపురంలో అందరూ యుద్ధం యుద్ధం అనుకుంటు న్నారు...."

అతని మాటల్లో ఆతురత కనిపించింది. అది పసిగట్టిన రాణి, "యుద్ధమా! ఏం లేదు బాబూ" అంది, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"నాకు చెప్పవా, అవ్వా?"

"అదేం లేదయ్యా."

"ఎవరితోనవ్వా యుద్ధం?"

"ప్రభువులకు చెప్పక తప్పదా?" అంత ఆందోళనలోనూ ఆమె నవ్వగలిగింది.

"ఎవరితోనవ్వా యుద్ధం?" మళ్ళీ అదే ప్రశ్న.

"నీకెందుకయ్యా యిప్పటినుంచీ యీ యుద్ధ విషయాలు? నువ్వు చక్కగా చదువుకుని పండితుడివి కావాలి. అదే మేము కోరుతున్నది" అంటూ రాణి మాట మార్చింది.

"అయితే చెప్పవన్నమాట!"

మనవడి మొండిపట్టుని గ్రహించింది. "పెద్దయ్యాక ఎలగూ తప్పవు యీ విషయాలు! చిన్నతనంలోనైనా సుఖంగా వుండు బాబూ...."

"యుద్ధం గురించి తెలుసుకోవడం తప్పా అవ్వా?"

"తప్పుకాదు బాబు, తప్పకుండా పరిపాలకులు యుద్ధవిషయాలు తెలుసుకోవాలి...."

"అయితే చెప్పు."

మనవడితో యుద్ధవిషయం చెప్పడమే మంచిదనుకుంది.

"తిరువాంకూరు వారితో యుద్ధం చెయ్యాలయ్యా మనం...."

"ఎక్కడుందవ్వా తిరువాంకూరు?"

"మన మధుర దక్షిణ భారతంలో ఉందా.... మరీ దక్షిణంగా వెడితే తిరువాంకూరు వస్తుంది. దాన్ని కేరళదేశ మంటారు. అక్కడ కొబ్బరిచెట్లు బాగా పెరుగుతాయి. చూడచక్కని దేశం...."

"మొన్న మన పౌరాణికులు భారతం చదువుతూ సింహళ కేరళ

చోళ పాండ్యదేశాగత.... అంటూ చొక్కని పద్యం చదివారు. ఆ కేరళ దేశమేనా ?"

మనవడి అద్భుత జ్ఞాపకశక్తినీ, తెలుగుభాషా ప్రీతినీ తలుచుకుని రాణి చెప్పనలవికాని సంతోషం చెందింది. చెంతనున్న చొక్కమ్మ ఆనంద పారవశ్యం చెందింది.

"అవ్వా, మాట్లాడవేఁ ?"

రాణి యీ లోకంలోకి వచ్చింది.

"బాబూ, నువ్వు నిజంగానే మహాపండితుడి వవుతావు. మధుర నాయకరాజులు తెలుగు సాహిత్యపోషకులు కారనే అపప్రథ నీవల్ల తొలగి పోతుంది. నీ తెలుగుభాషాభిమానం తలుచుకుని నేను ఎంతగా పుప్పొంగి పోతున్నానో నీకు తెలియదు బాబూ...."

పూజాగృహం నుంచి ఘంటానాదం వినవచ్చింది.

"అవ్వా, నేను వెడుతున్నాను, నువ్వు రావా ?"

"నేను తరవాత వస్తానయ్యా. మనకు యుద్ధంలో జయం కలగాలని అమ్మవారిని ప్రార్థించు బాబూ...."

"అలాగే నవ్వా...."

విజయరంగచొక్కనాథనాయనయ్య పూజాగృహానికి దారితీశాడు. చొక్కమ్మ ప్రభువుల్ని అనుసరించింది.

రాణి చూపులు మనవడిమీదనే లగ్నమైనాయి, ఆమెమానస వీధిలో ఏవేవో ఊహాలు పరిభ్రమిస్తున్నాయి.

"ప్రభువులకి చాలా పట్టుదల తల్లీ. తెలియని ప్రతి విషయాన్ని అడిగి అడిగి తెలుసుకుంటారు" అభ్యంతర గృహంనుంచి వచ్చిన పరిచారిక అంది.

"అలా తెలుసుకోవడం మంచిదే. ఈ శ్రద్ధాశక్తులు దీక్షాగుణం పెద్దయినతర్వాత కూడా ఉండాలి, అదే మేము ఆలోచిస్తున్నాము."

"తప్పకుండా వుంటాయి తల్లీ, తమరు సందేహించకండి."

"ఉంటే మంచిదే. రాజ్యం సురక్షితంగా ఉంటుంది. ప్రజలకు సుఖ శాంతులు లభిస్తాయి.... దళవాయిగారు వచ్చారా ?"

"అది మనవి చెయ్యడం కోసమే వచ్చాను తల్లీ. ఇతర మంత్రులు కూడా తమ రాకకోసం వేచివున్నారు తల్లీ."

రాణి అభ్యంతర గృహంవైపు నడిచింది. ఆ పరిచారిక ఆమెను అనుసరించింది.

రాణి రాకను గ్రహించిన పరిచారికలు ప్రభృతులు వినయవిధేయతలు వుట్టిపడగా ఆమెకు అభివాదం చేశారు.

ప్రసన్నవదన అయిన రాణి మందహాసం చేస్తూ వారిని వీక్షించింది. ఆ వీక్షణం వారికి నవశక్తిని ప్రసాదించింది.

అభ్యంతరగృహం వద్ద ఉన్న వీరయోధులు రాణికి వీరోచితంగా నమస్కరించారు. రాణి ప్రత్యభివాదం చేసి లోనికి వెళ్ళింది.

ఉన్నతాసనం అలంకరించిన రాణి మరియే యితర అంశమూ ప్రస్తావించక తిరువాంకూరు విషయం ప్రస్తావించసాగింది.

"మొనమొన్నటిదాకా తిరువాంకూరు పరిపాలకులు మేమంటే వినయవిధేయతలు కలిగి ప్రవర్తించారు. చేదోడువాదోడుగా సంచరించారు. సక్రమంగా కప్పం కడుతూ వచ్చారు. ముద్దు తిరుమలశౌరినాయనింవారి కాలంనుంచీ ఎంతో విధేయులై ఉన్నారు. అలాంటివారి వైఖరిలో ఆకస్మికంగా కలిగిన యీ మార్పుని తలుచుకుంటే మాకు ఆశ్చర్యంగా ఉంది. వారి మనస్సుని నొప్పించే కార్యమేదీ మనం చెయ్యలేదు. మిత్రుల మధ్య ఉన్నట్టుండి యీ వైమనస్యం ఏర్పడడానికి కారణమేమిటో మేము వూహించలేకపోతున్నాము...."

"రవివర్మగారు కప్పం చెల్లించడానికి నిరాకరించారని మన

సైనికులు తెలియజేసేసరికి నేనూ విభ్రాంతి చెందాను" అన్నాడు దళవాయి నరసప్పయ్య.

"అదే మేము రాత్రంతా ఆలోచించాము. తగిన కారణమేమీ బోధపడ లేదు."

"స్వాతంత్ర్యం ప్రకటించుకోవాలని ఆశిస్తున్నారేమో ఆయన" అన్నాడు మంత్రి అచ్చయ్య.

దళవాయి మందహాసం చేశాడు.

"ఆయన దుర్బలుడు. మనం కనక యుద్ధం ప్రకటిస్తే, మనల్ని ప్రతిఘటించే శక్తిసామర్థ్యాలు ఆయనకి లేవు. ఆ విషయం నాకు బాగా తెలుసు. ఎవరైనా ఆయనకి తోడుగా నిలబడితే తప్ప, ఆయన స్వయంగా యుద్ధం చెయ్యలేడు. అలా తోడుగా నిలిచినవాళ్లు లేరనుకుంటాను."

"అంత దుర్బలుడా ఆయన ?"

"అవును తల్లీ, అదీకాక ఆయన ఎనమండుగురు మంత్రులు ఆయనపట్ల శత్రుభావం వహించి సంచరిస్తున్నట్టు మన సైనికులు చెప్పగా విన్నాను."

"మన చారుల్ని పంపకపోయారా, అన్ని విషయాలు క్షుణ్ణంగా తెలుసుకుని వస్తారు."

"వాళ్ళీపాటికి విషయ సేకరణ చేస్తూ వుంటారని నా నమ్మకం. రెండు మూడు రోజుల్లో వెళ్ళిన చారులు తిరిగి రావచ్చు."

మంత్రి కామాక్షయ్య దళవాయిని ప్రశంసిస్తూ, "మూడో కంటికి తెలియకుండా సంచరించడంలో మన దళవాయిగారు అద్వితీయులు" అన్నాడు.

రాణి దళవాయిని చూస్తూ, "ఆయన అలా ప్రవర్తిస్తున్నారు కనుకనే రాబోయే ప్రమాదాన్ని మనం ముందుగానే తెలుసుకోగలుగు తున్నాము తదనుగుణంగా ప్రవర్తించగలుగుతున్నాము" అంది.

"అందులో సందేహంలేదు" అచ్చయ్య అన్నాడు గాని, దళవాయి పట్ల ఆయనకి ఈర్ష్య కలిగింది. రాణి ఆయన్ని ప్రశంసించడం కూడ అచ్చయ్యకి నచ్చలేదు.

మంత్రి ముఖకవళికలు బట్టి ఆయన మనోభావాలను గ్రహించిన దళవాయి "యీ విషయాన్ని యింతకు మునుపే మంత్రులకు కూడా తెలిపి వుంటే సముచితంగా వుండేది" అన్నాడు.

"నిజమే అనుకోండి. అయినా మీరు తీసుకున్న చర్య అంతకంటె సముచితమయింది. మాకు కూడా యీ విషయం తెలిసింది నిన్ననే. ఆలోగా మీరు వార్తాహరుల్ని తిరువంకూరుకి పంపారు. అన్ని విషయాలు తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నారు" రాణి దళవాయిని సమర్థించింది.

అచ్చయ్య బలవంతంగా నవ్వు తెచ్చుకున్నాడు. "ఉన్నట్టుండి రవివర్మగారు కప్పం కట్టడానికి ఎందుకు నిరాకరించారో అర్థం కావడం లేదు. పైగా బలహీనుడని వింటున్నాము.

"దీనివెనక ఏదో కుతంత్రం వుందని నా అభిప్రాయం" అన్నాడు కామాక్షయ్య. "ఆయనవద్ద వున్న సైన్యంకూడా అంతంత అనే విన్నాను."

నాలుగైదు క్షణాలపాటు మౌనం ఆ పరిసరాలు అలుముకుంది.

ఇతర మంత్రుల అభిప్రాయాలు తెలుసుకోవాలని బుద్ధిపూర్వకంగా దళవాయి మౌనం వహించాడు. రాణి ఆలోచనా నిమగ్నురాలయింది.

ఆ గంభీర వాతావరణాన్ని భేదిస్తూ, "యుద్ధం ప్రకటించడమే మన తక్షణ కర్తవ్యం" అంటూ అచ్చయ్య రాణివైపు చూశాడు. ఆమె తన అభిప్రాయాన్ని సమర్థిస్తుందని ఆయన భావించాడు.

"అచ్చయ్యగారూ, యుద్ధం ప్రకటించవచ్చు. యుద్ధ ప్రకటన చెయ్యడం తప్ప మార్గాంతరం లేదని మేమూ భావిస్తున్నాము. కాని, అందువల్ల కలగబోయే జననష్టాన్ని తలుచుకుంటేనే భయం వేస్తోంది.

యుద్ధం అవసరమా అనిపిస్తోంది కూడా. ఇంతకూ దళవాయిగారి అభిప్రాయమేమిటో ?"

"యుద్ధమన్న తర్వాత జననష్టం ఎలాగూ తప్పదు. ఉభయ పక్షాలవారికి నష్టం వాటిల్లుతుంది. సాధ్యమైనంతవరకూ యుద్ధాన్ని నివారించేందుకు ప్రయత్నించడం మంచిదని నా అభిప్రాయం."

"దళవాయి నరసప్పయ్యగారేనా యిలా అనడం!" అచ్చయ్య మాటల్లో హేళన చోటు చేసుకుంది.

"దళవాయిగారు సందేహించడం నాకూ ఆశ్చర్యంగానే ఉన్నది." కామాక్షయ్య తన మనస్సులోని మాటను వ్యక్తం చేశాడు.

దళవాయి ఏమీ చలించలేదు ప్రశాంతంగా ఉన్నాడు. నిండుకుండలా గోచరించాడు. సహజ గంభీర స్వరంతో ఇలా అన్నాడు.

"సందేహమేమీ లేదు. ప్రతి సంవత్సరమూ మన సైన్యాలు తిరువాంకూరుమీదికి దండెత్తి వెళ్ళడం, రవివర్మగారి వద్ద కప్పం వసూలు చేసుకుని రావడం పరిపాటి అయింది."

"నిజమే....రవివర్మగారు సహృదయులే. అయినా ఆయన యిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో, ఎంత తల పగులగొట్టుకున్నా అర్థంకావడం లేదు.... ఏమైనా యీ వ్యవహారం మాకు శిరోభారంగా తయారయింది."

రాణి మాటలు అచ్చయ్యకు నవోత్సాహం కలిగించాయి.

"యుద్ధం ఒక్కటే శరణ్యమని నా అభిప్రాయం. దళవాయిగారు ఏదో ఒక నిర్ణయానికి రావడం మంచిది. ప్రతి యేడూ మన సైన్యాలు తిరువాంకూరు మీదికి దండెత్తి వెళ్ళడం మనకూ మంచిదికాదు. ధన వ్యయం...."

"యుద్ధం ప్రకటించవచ్చు. ఆ దుర్బలుడితోనా అని ముందు వెనుకలు చూస్తున్నాను."

రాణి నవ్వాపుకోలేకపోయింది. ఆ వాతావరణంలోని గాంభీర్యం కొంత సడలినట్లయింది. "దళవాయిగారన్నట్లు కయ్యానికిగాని వియ్యానికి గాని సమవుజ్జీ ఉండడం వాంఛనీయం...."

"వాంఛనీయమే అయినా, రవివర్మగారి విషయంలో యుద్ధం తప్ప వేరే మార్గం లేదని మనస్ఫూర్తిగా భావిస్తున్నాను." అచ్చయ్య తన నిశ్చితాభిప్రాయం తెలియజేశాడు.

"అచ్చయ్యగారి అభిప్రాయం నాకూ ఆమోద యోగ్యమే." అన్నాడు కామాక్షయ్య.

"రవివర్మతో యుద్ధం ఎందుకని నేనూ మొదట్లో భావించాను. కాని మంత్రుల నిశ్చితాభిప్రాయాలు తెలుసుకున్న తర్వాత, యుద్ధం తప్ప మార్గాంతరం లేదని అభిప్రాయపడుతున్నాను. ఈ సమస్యకు పరిష్కార మార్గం అదొక్కటే అనిపిస్తున్నది. అదీకాక, గత సంవత్సరం మన సైన్యాలు తిరువాంకూరు మీదికి దండెత్తి వెళ్ళినప్పుడు, రవివర్మగారు కపటోపాయంతో మనల్ని జయించాలనుకున్నారు. ఆ విషయం రాణీగారికి అప్పుడే సవిస్తరంగా మనవి చేశాను...."

మంత్రులు ఒకరి నొకరు చూసుకున్నారు.

"అవునవును, మాకు గుర్తుంది. మనవారు చాలామంది విగత జీవులయ్యారు.... అంత దుర్బలుడు అనవసరంగా ఎందుకు కయ్యానికి కాలు దువ్వుతున్నాడో అర్థం కాకుండా ఉన్నది...."

అచ్చయ్య దళవాయి వంక సాభిప్రాయంగా చూశాడు.

"ఈ విషయాన్ని బుద్ధిపూర్వకంగానే మరెవ్వరికీ తెలపలేదు. తెలిస్తే, మన సైనికులు కొంచెం నిరుత్సాహం చెందుతారని అనుకున్నాను.

"ఆ మాట నిజమే.... ఆ విషయమేమిటో తెలుసుకోవాలని కుతూహలంగా వుంది" అచ్చయ్య అన్నాడు.

"రవివర్మ పట్టి దుర్బలుడేకాక కుటిల స్వభావం గలవాడని కూడా ఆ తర్వాత గ్రహించగలిగాను."

"కుటిల స్వభావుడికి గుణపాఠం చెప్పడం మన ధర్మం."

"దళవాయిగారిని పొంతం చెప్పనివ్వండి అచ్చయ్యగారు. ఆ తర్వాత మీ అభిప్రాయం చెపుదురుగాని."

"మన సైన్యాలు తిరువాంకూరు మీదికి దండెత్తి వెళ్ళినప్పుడు, తన ఎనమండుగురు మంత్రుల్ని కనక హతమారిస్తే, తన రాజ్యంలో కొంత భాగం మనకిస్తానని రవివర్మగారు ఆశ చూపారు. ఆయన మాటల్ని నేను విశ్వశించాను. వెంటనే ఆ విషయం రాణిగారికి తెలియజేశాను. రాణిగారి ఆమోదం తెలియగానే, నేను సరే అన్నాను. మనవారు ఆయన మంత్రులు కొందర్ని సంహరించారు. ఈ విషయం తెలిసిన కొందరు మంత్రులు పలాయనం చిత్తగించారు. యుద్ధసమస్య తీరిపోయిందనుకుని మన సైనికులు యుద్ధ సన్నాహాలు విరమించారు. మధురకు తిరిగి వద్దామను కుంటున్నారు. ఆ పరిస్థితిలో ఉన్నట్టుండి రవివర్మగారి సైన్యాలు మనవారిని ప్రతిఘటించాయి. మనవారు చాలామంది వీరస్వర్గం అలంకరించారు. అలాంటి పరిస్థితిలో కూడా ధైర్యస్థైర్యాలు కూడగట్టుకుని, మన సైన్యాలు శత్రుసైన్యంతో యుద్ధం చేశాయి. అంతిమ విజయం మనకే లభించిన విషయం మీ కందరికీ తెలిసిందే...."

పట్టరాని సంతోషంతో కామాక్షయ్య, "దళవాయిగారి నాయకత్వంలో మన సైన్యాలు ప్రదర్శించిన ధైర్యస్థైర్యాలు తలుచుకుంటేనే ఒళ్లు పులక రిస్తోంది. వాటిని స్వయంగా యుద్ధభూమిలో చూడడం నిజంగానే మహా భాగ్యంగా భావించాలి. ఆ మహాభాగ్యం మన దళవాయిగారికే దక్కింది...." అన్నాడు.

"విషమ పరిస్థితిలో కూడా మనవారు వీరోచితంగా పోరాడి ఘన

విజయం సాధించినప్పుడు, మనం విజయోత్సవం చేసి వుండవలసింది.' అంటూ అచ్చయ్య దళవాయిని చూశాడు.

"రాణిగారు విజయోత్సవం జరపాలనే అభిలషించారు. కాని నిష్కారణంగా మనవారు చాలామంది విగతజీవులు కావడంతో, విజయోత్సవం జరపడానికి నాకు మనస్కరించలేదు.... ఆదృశ్యం యిప్పటికీ నా కళ్ళల్లో మసలుతోంది...." దళవాయి కళ్లు చెమ్మగిల్లాయి.

"రవివర్మగారు దుర్బలులని అనుకున్నాముగాని, తంత్రజ్ఞులని మాత్రం అనుకోలేదు." మీనాక్షయ్య కామాక్షయ్య కొంచెం కోపంగా అన్నారు.

"దుర్బలుడితో యుద్ధం ప్రకటించడం ఎందుకని దళవాయిగారు సందేహించారు....ఆ తంత్రజ్ఞుణ్ణి క్షమించడం అవివేకమవుతుంది." అచ్చయ్య మాటలో తీవ్రత కనిపించింది.

దళవాయి సవినయంగా అన్నాడు. "రాణిగారి ఆజ్ఞ అయితే తిరువాంకూరు మీదికి దండెత్తి వెళ్ళడంలో నాకెలాంటి ఆక్షేపణలేదు."

"మరి, మన సైన్యాలు సిద్ధంగా వున్నాయంటారా ?"

"ఆ విషయం నేను చూసుకుంటాను. తమ ఆజ్ఞ ఒక్కటే నాకు కావలసింది."

"దళవాయి నరసప్పయ్యగారు తొందరపడి మాట యివ్వరు. యుద్ధం ప్రకటించారో, వైరివీరులు తమ ప్రాణాలమీద ఆశ వదులు కోవలసిందే." అచ్చయ్య నవ్వుతూ అన్నాడు.

"నరసప్పయ్యగారు శక్తి సామర్థ్యాలు మాకు తెలియనివి కావు. ఆయన భుజబలం మాకు పెట్టని కోట...."

"రాణిగారికి నామీద అంత విశ్వాసం వుండడం, యీ భృత్యుడు చేసుకున్న అదృష్టం....అదీ నా భాగ్య విశేషం." నరసప్పయ్య కృతజ్ఞతా పూర్వకంగా అన్నాడు.

"మీ వంటి స్వామిభక్తులు లభించడం మా అదృష్టం.... దళవాయి గారూ, మంచిరోజు చూసి తిరువాంకూరు మీదికి సైన్యాలు తరలించండి. అమ్మవారి కరుణా కటాక్షాలు మీకు పరిపూర్ణంగా లభిస్తాయి."

"దళవాయిగారిని నేను నొప్పించలేదుగదా!" అన్నాడు అచ్చయ్య.

"ఎంతమాట! మీ అభిప్రాయాలు తెలిపి, మీరు మీ ధర్మం నిర్వర్తించారు. నా ధర్మం నేను నిర్వహిస్తాను. మన అందరి ధ్యేయం

కామాక్షయ్య అన్నాడు. "దళవాయిగారు మితభాషి. మాట్లాడే నాలుగు మాటలు నాలుగు రత్నాలు."

"కామాక్షయ్యగారూ...."

"అమ్మా!"

"యుద్ధవ్యయం భరించాలనే నెపంతో మీ మంత్రులందరూ కలిసి అదనంగా పన్నులు విధించవద్దని మా సలహా. పన్నుల భారాన్ని ప్రజలు సహించరు.

"చిత్తం తల్లీ."

"దళవాయిగారు యిక యుద్ధ సన్నాహాలలో నిమగ్నులవుతారు కనక, రాజ్యవ్యవహారాలు మీరు మాకు ఎప్పటికప్పుడు తెలియజేస్తూ వుండాలి. మనమందరం అప్రమత్తంగా వుండాలి...."

"అలాగే తల్లీ."

అప్పటికే పొద్దుపోయింది.

భోజనంవేళ దాటుతోందని గుర్తు చెయ్యడానికి కాబోలు చొక్కమ్మ ద్వారంవద్ద నిలబడింది.

ఆమెను చూడగానే రాణికి భోజన సమయం గుర్తుకి వచ్చింది.

ఆ తర్వాత మరికొంత సేపు రాణి మంత్రులతో చర్చించింది. సభ

చాలించి ఆమె తన నివాసానికి దారితీసింది. దళవాయి తదితరులు ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయారు.

రాణిగారి ఆజ్ఞానుసారం దళవాయి యుద్ధ సన్నాహాలలో నిమగ్నుడయ్యాడు. సన్నాహాలు పూర్తి కాగానే, ఆయన నాయకత్వంలో మధుర సైన్యాలు తిరువాంకూరు మీదికి దండెత్తి వెళ్ళాయి. ఉభయ సైన్యాలు యుద్ధ రంగం ప్రవేశించాయి. యుద్ధ విశేషాలను ప్రత్యేక చారుల మూలంగా దళవాయి మధురకు తెలియజేయసాగాడు.

మధురవారికీ తిరువాంకూరు వారికీ ఘోరయుద్ధం జరిగింది.

విజయలక్ష్మి నరసప్పయ్యను వరించింది.

రవివర్మ రాణి మంగమ్మ అధికారాన్ని సహర్షంగా అంగీకరించాడు. చెల్లించవలసిన కప్పం చెల్లించాడు. ప్రతి సంవత్సరమూ సక్రమంగా కప్పం చెల్లిస్తానని వాగ్దానం చేశాడు. అంతేకాదు, దళవాయికి అమూల్యాభరణాలు సమర్పించాడు.

నరసప్పయ్య సాధించిన విజయాన్ని తెలుసుకుని రాణి ఎంతగానో సంతోషించింది. ఆ స్వామిభక్తుణ్ణి మెచ్చుకుంది. మధుర గౌరవాన్ని నిలబెట్టినందుకు ఆయన్ని లోలోన ప్రశంసించింది. అమ్మవారికి తన కృతజ్ఞతను వినయపురస్సరంగా తెలుపుకుంది.

విజయలక్ష్మిని వరించి ససైన్యంగా దళవాయి మధుర చేరుకున్నాడు.

ఆనాడు ఆ నగరం పండుగ జరుపుకుంది.

కనుల పండువుగా నగరం అలంకరించబడింది. ఎక్కడ చూసినా విజయోత్సాహం వెల్లివిరిసింది. ఎవరినోట విన్నా నరసప్పయ్య సాధించిన విజయవృత్తాంతమే. మధురానగరమే ఆయనకి స్వాగతం చెప్పినట్లుగా కనిపించింది. దళవాయి నగరం ప్రవేశించినప్పుడు మంత్రులు ప్రముఖులు సగౌరవంగా ఆయన్ని ఆహ్వానించారు.

ఆనాటి సాయంకాలం సభాభవనంలో మంత్రులు, పురప్రముఖులు

మొదలైనవారి సమక్షంలో రాణి మంగమ్మ నరసప్పయ్యను బహుధా ప్రశంసించింది. రవివర్మ బహూకరించిన అమూల్యాభరణాలను దళవాయికి బహూకరించింది. ఒక స్వామిభక్తుడి పట్ల రాణి ప్రదర్శించిన ఆదరాభిమానములు కనులార చూసి ప్రముఖులు ముగ్ధులయ్యారు. ఆ సందర్భంగా యుద్ధంలో పాల్గొన్న యితర దండనాథుల్నీ, వృద్ధ సైనికుల్నీ రాణి సముచితరీతిని సత్కరించింది. వారందరి పక్షాన దళవాయి రాణికి పుర ప్రముఖులకీ కృతజ్ఞత తెలియజేశాడు.

విజయోత్సాహం వైభవోపేతంగా ముగిసింది.

యుద్ధభయం తీరడంవల్ల ప్రజలు నిశ్చింతగా జీవించసాగారు. సుఖశాంతులు సుస్థిరంగా నెలకొన్నాయి.

ఇతర సమస్యలు లేకపోవడంవల్ల, రాణి ప్రజాహిత కార్యకలాపాలలో ఎక్కువ శ్రద్ధ ప్రదర్శించసాగింది.

దళవాయి నరసప్పయ్య మాత్రం కొంచెం నిరుత్సాహంగా కనిపించాడు.

ఆనాడు తనకు మంత్రులు, దండనాథులు, ప్రముఖులు స్వాగత వచనాలు పలికినా, రాణి తనను ఘనంగా సత్కరించే సమయాన మంత్రులు కొందరు ఈర్ష్య చెందినట్లు ఆయన గ్రహించాడు. తదాదిగా వారి ప్రవర్తనను గమనించసాగాడు. వారి మాటలను స్తులశల్య పరీక్ష చేయసాగాడు. వారిమీద ఆయనకి కలిగిన భయ సందేహాలు బలపడసాగాయి. తత్ఫలితంగా దేశక్షేమం దెబ్బ తింటుందన్న భయపిశాచం ఆయన్ని ఆవహించింది. తన మనస్సులోని ఆందోళనను రాణికి తెలియజేయాలన్న తపన ఆయనకి కలిగింది. తొందరపడి తెలియజేయడంవల్ల, ఆ తర్వాత దుష్ఫలితాలు కలుగుతాయేమోనని సంశయించాడు. ఏమయినా, రాణికి చూచాయగానైనా తెలియజేయడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చాడు.

నరసప్పయ్యను మరోభయం కూడా పీడించసాగింది.

తంజావూరు పరిపాలకుడు శాహజీ పట్ల ఆయనకి కలగవలసినంత నమ్మకం కలగలేదు. చారులవల్ల విన్న వర్తమానం ప్రకారం శాహజీ మధురతో యుద్ధం ప్రకటించవచ్చునని ఊహించాడు.

నరసప్పయ్యకు మనశ్శాంతి లోపించింది.

దళవాయి ముఖకవళికలను పురస్కరించుకొని ఆయన చింతాక్రాంతుడై వున్నట్లు రాణి పసిగట్టింది. మామూలుగా ఆయనలో కానవచ్చే ఉత్సాహం సంతోషం మాయమైనాయి. కారణం తెలుసుకోవాలని అభిలషించింది. చొక్కమ్మ వంటి అంతరంగికుల్ని అడిగింది. ప్రధాన చారుణ్ణి ప్రశ్నించింది. అసలు కారణం మాత్రం ఆమెకు అంతుపట్టలేదు. అయినా ఆయన్ని సూటిగా ప్రశ్నించడానికి మనస్కరించలేదు. ఆయన్ని సూటిగా అడిగితే, ఆయన బాధపడతాడేమోనని ఆమె సంశయం. ఆయన్ని ఏ విధంగానూ బాధపెట్టడం వివేకం కాదనుకుంది.

నలుగురి సమక్షంలోనూ రాణి స్వయంగా నరసప్పయ్యను ఘనంగా సత్కరించడం ఇద్దరు ముగ్గురు మంత్రులకూ, కొందరు అధికారులకూ అంతగా నచ్చలేదు. దళవాయి పట్ల వారికి సుహృద్భావమే. ఆయన ధైర్యసాహసాలపట్ల అపరిమితమైన విశ్వాసం. ఘనవిజయాలు సాధించి మధురకు శత్రుభయం లేకుండా చేస్తున్నాడనీ వారికి తెలుసు. కాని దళవాయి పలుకుబడి దినదినాభివృద్ధి చెందడం చూసి వారు మలిన మనస్కులయ్యారు. సమయం చూసి కాటు వెయ్యాలని కృతనిశ్చయులయ్యారు. రాజ్యంలో నెలకొన్న ప్రశాంతతను భగ్నం చెయ్యాలనీ నిశ్చయించారు. మలినభావం మనిషిని రాక్షసునిగా మారుస్తుంది.

అదీ శ్రావణమాసం, పౌర్ణమి.

కృష్ణాలయంలో సౌరాష్ట్రులు ఉపాకర్మ చేసుకుంటున్నారు. మంత్రఘోష వీధిలోకి వినిపిస్తున్నది.

ఆ వీధిని వెడుతున్న మధురానగరాధికారికి మంత్రఘోష

వినిపించింది. ఆయన ఆలయంలోకి అడుగుపెట్టాడు. ఆయన నగరాధికారి అని గుర్తించిన కొందరు ఆయన్ని ఆలయంలోకి వచ్చి దైవదర్శనం చేసుకుని వెళ్ళమని సాదరంగా ఆహ్వానించారు. ఆయన లోనికి వెళ్లాడు. దైవదర్శనం చేసుకున్నాడు. కాని ఆయన మనస్సు దైవంమీద లేదు. ఉపాకర్మ జరుగుతున్నదని గ్రహించాడు. అది ఆయనకి విరుద్ధాచారంగా కనిపించింది. వర్ణాశ్రమధర్మ సంరక్షకులుగా పేరు ప్రఖ్యాతులు గడించిన మధుర నాయకరాజుల పరిపాలన కాలంలో ఈ విరుద్ధాచారానికి స్వస్తి చెప్పాలని ఆయన అభిలషించాడు. ఈ విషయం రాణిగారికి తెలిస్తే, ఆమె సౌరాష్ట్రులను తగిన విధంగా శిక్షించవచ్చుననీ, తత్ఫలితంగా మధురలో అప్రశాంతత యేర్పడగలదనీ ఆయన భుజాలు ఎగరవేశాడు. అప్పటి కప్పుడే ఆయన మనోవీధిలో ఆకాశహర్మ్యాలు పైకిలేచాయి. కృష్ణాలయం నుంచి నిష్క్రమిస్తూ, ఆయన తన మనస్సులో గూడుకట్టుకుంటున్న భావాలను తనకు వీడ్కోలు చెప్పినవారికి తెలియజేశాడు.

ఈ సంఘటన జరిగిన తడి అయినా ఇంకా ఆరలేదు.

ధర్మవిరుద్ధంగా సంచరిస్తున్నందుకు తమను మధురానగరాధికారి త్వరలో శిక్షించనున్నట్లు సౌరాష్ట్రి కుటుంబాలలో ఒక అలజడి బయలు దేరింది. కులపెద్దలు నగరాధికారిని తీవ్రంగా విమర్శించారు. తమ ఆచార వ్యవహారాలు ఆయనకేమీ తెలియవనీ, అందువల్లనే తమది విరుద్ధాచారంగా గ్రహించాడనీ అనుకున్నారు. ఈ విషయాధికార్ని నగరాధికారికి తెలపమని యువకులు కులపెద్దల్ని అర్థించారు. అందుకు వారు సమ్మతించలేదు. నగరాధికారి దుష్టస్వభావుడనీ, ఆయనకి యిద్దరు ముగ్గురు మంత్రుల అండదండలున్నాయనీ, ఆయనతో వైరం పెట్టుకోవడం అవివేకమనీ వారు యువకులకు నచ్చజెప్పాలని ప్రయత్నించారు. కాని వారి మాటలు యువకులకు నచ్చలేదు. కులపెద్దలు భీరువులనీ, అందుచేతే మీనమేషాలు

లెక్క-పెడుతున్నారనీ పేర్కొ-న్నారు. తత్ఫలితంగా సౌరాష్ట్రి సంఘంలో వాదోపవాదాలు చెలరేగాయి. శాంతికాముకులైన వారిలో అశాంతి నెలకొన్నది. కులపెద్దలు కర్తవ్యతా విమూఢులై తమలో తాము మథనపడ సాగారు.

"నగరాధికారిని గురించి రాణీగారికి విన్నవించుకుంటే ఎలా వుంటుంది?" అని ఒక యువకుడు అన్నాడు.

మళ్ళీ తర్జనభర్జనలు జరిగాయి.

చివరికి ఆ యువకుని మాటలు అందరికీ ఆమోదయోగ్యము లయినాయి. యువకుని సూచన మినహా మార్గాంతరం లేదని అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు.

రాణీగారిని కలుసుకుని నగరాధికారిని గురించి విన్నవించుకునేందుకు సంప్రదాయాలు క్షుణ్ణంగా తెలిసిన వయోవృద్ధులు కొందరిని ఎన్నుకున్నారు. ఆ కులపెద్దలు అంతఃపురానికి బయలుదేరారు, రాణీగారి దర్శనార్థం.

ఈ విషయం తెలుసుకున్న నగరాధికారి భయభ్రాంతుడయ్యాడు. తనను కాదని వారు రాణిని సందర్శించడం ఆయనకి క్రోధకారణమయింది. వెంటనే ఆయన తనకు అండగా ఉన్న మంత్రి మిత్రుల్ని కలుసుకోవాలను కున్నాడు.

సౌరాష్ట్రి కులపెద్దలు అంతఃపురం ప్రధానద్వారం వద్ద కావలా కాస్తున్న సైనికులకు తాము వచ్చిన విషయం తెలియజేశారు. ఒక సైనికుడు వాళ్ళని ఒక అధికారి వద్దకు తీసుకువెళ్లాడు. ఆ అధికారి ఆజ్ఞమేరకు ఒక సైనికుడు లోపలికి వెళ్ళి వర్తమానం తెలియజేసి తిరిగి వచ్చాడు. అతడు వచ్చిన ఒక అరగంటకు మరో సైనికుడు లోపలినుంచి వచ్చాడు. కులపెద్దలు అతనివైపు ఆశగా చూశారు.

"మీరేనా సౌరాష్ట్రి కులపెద్దలు?"

"అవును బాబూ."

"మహారాణీగారి ఆజ్ఞ అయింది, మీరు లోపలికి రావచ్చు."

వాళ్ళని ఒక సైనికుడు వెంటబెట్టుకుని లోపలికి వెళ్లాడు.

వివిధ మందిరాలూ దాటుకుంటూ వాళ్లు వెళ్ళి వెళ్ళి చివరికి ఒక సువిశాల మందిరం చేరుకున్నారు. ఆ మందిరంలో వాళ్ళని ఆసీనుల్ని చేసి ఆ సైనికుడు వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి పరిచారికలు దోవ చూపుతూవుండగా రాణీ ఆ మందిరం ప్రవేశించింది. కులపెద్దలు లేచి నుంచున్నారు. చేతులు జోడించి వినయపూర్వకంగా రాణికి నమస్కరించారు. ఆమె వారికి ప్రత్యభివాదనం చేసింది.

రాణి ఆసనం అలంకరించిన తర్వాత, వయోవృద్ధుడైన ఒక కులపెద్ద రాణి సమక్షంలో సభక్తికంగా ఒక తెల్లని పట్టుచీర ఉంచి, "ఏదో ఉడతభక్తిగా మేము రాణివారికి సమర్పించుకుంటున్న కానుక యిది" అన్నాడు.

ఆమె ఆ పట్టుచీర చేతిలోకి తీసుకుని, "చాలా బాగుంది. మీ పనితనం మాకెంతో నచ్చింది." అంటూ ఆ కులపెద్దల్ని సాదరంగా తిలకించింది.

"కృతార్థులం తల్లీ."

"మీరు మాకు చాలాకాలంగా పట్టుపుట్టాలు పంపుతున్నారు. మా బంధువులకు మే మిక్కడినుంచి పంపుతున్నాము. అంతఃపురానికి వచ్చే ప్రముఖులు మధురచీరలు కావాలని అడుగుతారు. మీవల్ల మధురకెంతో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి...."

"తమ ఆదరాభిమానాలకు పాత్రులమైన మేము ధన్యులం, తల్లీ...."

"మీరు నేసే చీరల్లో ఏదో ప్రత్యేకత వుంది. ఇంత పనితనం మీకెలా వచ్చింది? అడగాలని చాలా రోజులుగా మా అభిలాష. నేడు మీరే వచ్చారు,"

"అమ్మా, వంశానుగతంగా వస్తున్న వృత్తి మాది. మమ్మల్ని పట్టునూలుకరణులని వ్యవహరిస్తారు."

"మీరు సౌరాష్ట్రులు గదా !"

"నిజమే తల్లీ. మాది అసలు సౌరాష్ట్రం. మా పూర్వులు సౌరాష్ట్రం నుంచి బయలుదేరి ఆంధ్రదేశంలో కొన్నాళ్ళుండి, ఆ తర్వాత తమిళదేశం చేరి మధుర, తంజావూరు ప్రాంతాలలో స్థిరపడ్డారు. స్థానికులు మమ్మల్ని సౌరాష్ట్రులనే వ్యవహరిస్తారు. కాని మేము స్థానికులతో కలిసిమెలిసిపోయాము."

"మీ వంశీయులు ఎవరైనా ఆంధ్రదేశంలో ఉన్నారా ?"

"తిరుపతిలో ఉన్నారు తల్లీ...."

"అలాగా ! మీ మాతృభాషను మీరు మరిచిపోలేదు గదా !" నవ్వుతూ అడిగింది రాణి.

"అది ఎలా సాధ్యం తల్లీ ! ఇప్పటికీ మా యిళ్ళల్లో మేము సౌరాష్ట్రంలోనే వ్యవహరిస్తూ వుంటాము. ఎన్నో తెలుగు, తమిళ శబ్దాలు మా దైనందిక వ్యవహారంలో కలిసిపోయాయి."

రాణి మందహాసం చేసింది. చెపుతున్న ఆ కులపెద్ద మాటల్ని శ్రద్ధాసక్తులతో వినసాగింది.

"అంతేకాదు తల్లీ, మా భాషకు ప్రత్యేక లిపి వున్నా, మేము తెలుగు లిపిలోనే రాతకోతలు నిర్వహిస్తూ వుంటాము.

"ఆ వయోవృద్ధుణ్ణి రాణి ఆశ్చర్యంగా చూసింది.

"మా జాతక చక్రాలు తెలుగు లిపిలోనే వ్రాసుకుంటాము. శుభాశుభ కర్మలలో తెలుగు పాటలు పాడుతాము. తెలుగువారివలె, మాకూ యింటి పేర్లున్నాయి...."

"మరి, మీ ఆచార వ్యవహారాలు ?"

"ఈ విషయం గురించి విన్నవించుకుందామనే మేము వచ్చాము. తమరే యీ విషయం అడిగారు."

"మీ ధర్మ నిర్వహణలో మీకేమైనా యిబ్బందులు కలుగుతున్నాయా ధైర్యంగా చెప్పండి. తమ దయవల్ల యింతవరకూ యిబ్బందులులేవు తల్లీ. కాని ఉత్తరోత్తరా యిబ్బందులు కలుగవచ్చుననే సందేహం మా కిప్పుడు కలిగింది."

"అలాగా!" రాణి కనుబొమలు పెద్దవి చేసి, ఆ వృద్ధుణ్ణి చూసింది.

"తమరు అన్యథా భావించకపోతే, తమకు మా విషయం సవిస్తరంగా నివేదించుకోవాలని మా అభిలాష."

"చెప్పండి."

వయోవృద్ధుడు చెప్పసాగాడు. రాణి ప్రసన్నవదనం ఆయనకి ధైర్యం కలిగించింది.

"అమ్మా, మేము చేనేత పారిశ్రామికులం. సదాచార ప్రియులం. మా ఆచార వ్యవహారాలు చాలావరకు బ్రాహ్మణుల ఆచారాలవలె ఉంటాయి. శాకాహారులం. నాకు తెలిసినంతవరకూ మా పూర్వులు మొదలుకొని నేటిదాకా మేము బ్రాహ్మణులవలె ఉపాకర్మాది వేదోక్త కర్మలు ఆచరిస్తూ వున్నాము. వేద విహితకర్మలు ఆచరించడం మా సంప్రదాయం. విన్నటివరకూ మా కర్మలకు ఎవ్వరూ అడ్డు తగులలేదు: మా కర్మాధికారాన్ని ఎవ్వరూ సంశయించనూ లేదు. ఉపాకర్మాధికారం మాకు లేదని నేడు నగరాధికారిగారు అభిప్రాయపడుతున్నారు. మేము ధర్మ విరుద్ధంగా వ్యవహరిస్తున్నామనీ, అందువల్ల మేము శిక్షార్హులమనీ ఆయన అభిప్రాయం."

"ఈ విషయాలు మా దృష్టికి రానందుకు చింతిస్తున్నాము...."

"తమరు ధర్మస్వరూపులని మాకు తెలుసు. వివిధ వర్ణాశ్రమధర్మా

లను తామ సంరక్షిస్తున్నారు. మేము మా వంశానుగత ధర్మాలను నిర్వర్తించుకునేందుకు తగిన పరిస్థితులు నేటిదాక ఉన్నాయి. అందుకు లోపం రాకూడదని మా సౌరాష్ట్రి సంఘం ఆశిస్తున్నది...."

"అలా ఆశించడం సమంజసమే. ఎవరి ఆచారాలు వాళ్లకి ముఖ్యంగా గోచరిస్తాయి.

ప్రలైన తమరు మాకు న్యాయం చేకూరుస్తారనే మా విశ్వాసం."

"ఇంకేమైనా చెప్పదలిచారా మీరు ?"

"లేదు తల్లీ."

"ఈ విషయమై మేము దళవాయిగారితో సంప్రదిస్తాము. అవసరమైతే మంత్రుల సలహా కూడా తీసుకుంటాము."

"చిత్తం తల్లీ."

"నగరాధికారిని కూడా సంప్రదిస్తాము."

"ఆయనవల్ల మాకెలాంటి హాని వాటిల్లకూడదని తమర్ని వేడుకుంటున్నాము.

నవ్వుతూ రాణి, "ఆయన సింహమా, పెద్దపులా ?" అడిగింది.

వృద్ధుడు తటపటాయించాడు.

"నిర్భయంగా చెప్పండి."

"ఆయన అంత సౌమ్యస్వభావులు కాదని చెప్పుకుంటారు. తల్లీ...."

"అలాగా !"

"పైగా ఆయనకి కొందరు మంత్రుల అండదండలున్నాయని కూడా చెప్పుకుంటారు. అందుకే ఆయనంటే మాకు భయం కలిగింది...."

"అదా విషయం !" రాణి గంభీరవదన అయింది.

అది గమనించిన వృద్ధుడు, "అమ్మా, క్షమించాలి.... నేను పొరపాటుగా ఏదైనా మాట్లాడి, తమరిని నొప్పించానేమోనని బాధపడుతున్నాను...."

రాణిలో మళ్ళీ ప్రసన్నత నెలకొన్నది. "మీరు ఉన్న విషయం చెప్పి మాకెంతో సహాయం చేశారు.... నగరాధికారి పెద్దపులో, సింహమో మేమే స్వయంగా తెలుసుకుంటాము. మీరు నిర్భయంగా వుండవచ్చు. ఆయనవల్లగాని యితరులవల్లగాని మీకేమీ హాని రాకుండ చూడడం మా బాధ్యత."

రాణి మాటలు సౌరాష్ట్రి కులపెద్దలకు కొండంత ధైర్యం కలిగించాయి. "తమరు ధర్మస్వరూపులు కనుకనే, మా భయాందోళనల్ని తమకు తెలియజేసుకున్నాము. తమకు మా అందరి పక్షాన మా కృతజ్ఞతను వినయపూర్వకంగా తెలియజేసుకుంటున్నాము" అన్నాడు ఒక కులపెద్ద. ఆయన మాటల్లో కృతజ్ఞతాభావం గూడుకట్టుకున్నదని వేరుగా చెప్ప నవసరం లేదు. వాళ్ళకి తలమీది భారం కిందికి దించినట్లయింది.

"ఉపాకర్మాధికారం సౌరాష్ట్రులకున్నదో లేదో తెలుసుకోవడం కోసం త్వరలోనే ఒక పండిత పరిషత్తు ఏర్పాటుచేసి, పండితుల అభిప్రాయం కూడా తెలుసుకుంటాము."

"తమకు సర్వదా కృతజ్ఞులం తల్లీ."

"పండిత పరిషత్తులో పాల్గొనేందుకు మీ పక్షాన నలుగురైదుగురు పండితుల్ని పంపండి...."

"చిత్తం తల్లీ."

"ఇక మీరు నిశ్చింతగా వెళ్ళిరండి."

రాణి వద్ద అనుజ్ఞ తీసుకుని సౌరాష్ట్రి ప్రముఖులు వెళ్ళారు.

ఆ మరునాడే రాణి దళవాయి ప్రభృతులతో సౌరాష్ట్రుల ఉపాకర్మాధికారం గురించి సంప్రదించింది. ఎవరికి తోచిన అభిప్రాయం వారు తెలియజేశారు. నగరాధికారి కూడా తన అభిప్రాయం వ్యక్తం చేశాడు. అందరి అభిప్రాయాలు రాణి తెలుసుకుంది. అయినా ధర్మసందేహం తీరలేదు. సహజ గంభీరస్వరంతో రాణి యిలా తన అభిప్రాయం వ్యక్తం

చేసింది. "ఇది రాజకీయ వ్యవహారమైతే, మనమే పరిష్కరించి వుండే వాళ్ళం. ఆచార వ్యవహారాలకు సంబంధించిన విషయ మిది. కనుక దీన్ని పరిష్కరించేందుకు పండిత పరిషత్తు ఏర్పాటుచేస్తే సమంజసంగా వుంటుందని మేము భావిస్తున్నాము."

"తమ అభిప్రాయం శిరోధార్యం." అన్నాడు దళవాయి.

నగరాధికారి మంత్రి అచ్చయ్యవైపు చూశాడు.

మహారాణిగారి అభిప్రాయం నాకూ శిరోదార్యమే. కాని యీ చిన్న విషయాన్ని పరిష్కరించేందుకు పండిత పరిషత్తు అవసరమా అని నేను సందేహిస్తున్నాను. మహారాణిగారు పునః ఆలోచిస్తారని నా నమ్మకం." అన్నాడు అచ్చయ్య. నగరాధికారి ముఖం చేటంత అయింది.

నగరాధికారి పులిగా సింహంగా ప్రవర్తించడానికి గల కారణం రాణికి అవగతమయింది.

"ఈ ధర్మ సందేహాన్ని పరిష్కరించడానికి మనం అర్హులం కామని మా నిశ్చితాభిప్రాయం. కొన్ని తరాలుగా వస్తున్న సంప్రదాయాలను గురించి చర్చించే అధికారం మనకు లేదు. ధర్మసూక్ష్మాలు, ఆచార వ్యవహారాలు క్షుణ్ణంగా తెలిసిన పెద్దలే యిందుకు అన్నివిధాల అర్హులు. కనుకనే పండిత పరిషత్తుని ఏర్పాటుచేస్తే, ఆ పండితులే యీ విషయం చర్చించి తగు నిర్ణయం చేస్తారు. వారి నిర్ణయమే మా నిర్ణయం."

రాణిగారి అభిప్రాయం తెలుసుకున్న తర్వాత, మంత్రి అచ్చయ్యగాని మరి యితరులుగాని నోరు మెదపలేదు. నగరాధికారి ముఖం మాడిపోయింది. తన అవివేకంవల్ల తనకు హాని జరగవచ్చునని కూడా అతను సంశయ మనస్కుడయ్యాడు.

త్వరలోనే పండిత పరిషత్తు ఏర్పాటు చేయబడింది.

ఆనాడు సభాభవనం జ్ఞాన, వయోవృద్ధులతో కిటకిటలాడింది. ధర్మ నిర్ణయం ఎలా చేస్తారో తిలకిద్దామనే కుతూహలంతో పండితులూ

ప్రముఖులా వయోవృద్ధులే కాక యువకులు కూడా పలువురు వచ్చారు. అలాంటి సభ మధురలో జరగడం అదే ప్రథమం. దళవాయి, మంత్రులు, నగరాధికారి, ఇతర ఉన్నతాధికారులు ఉచితాసనాలు అలంకరించారు. అందరిలోను కుతూహలం కానవచ్చింది.

సభావేదికమీద ఒకవైపు రాణి ఉన్నతాసనం అలంకరించింది. పండితులు మరోవైపు ఆసీనులయ్యారు.

దైవప్రార్థనతో కార్యక్రమం మొదలయింది.

వాదోపవాదాలు ప్రారంభమయినాయి.

సభికులు శ్రద్ధాసక్తులతో ఆలకించసాగారు.

రాణి యితర విషయాలు విస్మరించింది. మనస్సుని పండితులు చేస్తున్న చర్చమీదనే కేంద్రీకరించింది. వారు పేర్కొన్న విషయాలు కొన్ని ఆమెకు సరిగా అర్థం కాలేదు. అయినా ఆమె శ్రద్ధాసక్తులకు భంగం కలగలేదు.

సౌరాష్ట్రి పండితులు తమ వాదాన్ని సమర్థవంతంగా ప్రతిపాదించారు. తగిన ఉపనిషత్తులు ప్రదర్శించారు. నగరాధికారి పక్షాన సభలో పాల్గొన్న పండితులు కూడా హేమాహేమీలే. వారూ తమ వాదాన్ని సోపపత్తికంగా ప్రతిపాదించారు. ఖండన మండనలు ఆసక్తికరంగా ఉన్నాయి.

వాదోపవాదాలు ముగిసిన పిమ్మట, ఒక వృద్ధ పండితుడు పరిషత్తు పక్షాన ఇలా ముక్తసరిగా ప్రసంగించాడు.

"తరతరాలుగా సౌరాష్ట్రులు ఉపాకర్మాది వేదోక్త కర్మలు శ్రద్ధాసక్తులతో ఆచరిస్తున్నారు. అనుగతంగా వస్తున్న యీ ఆచారాన్ని నేటికీ వారు అనుసరిస్తున్నారు. వృద్ధాచారం బలీయమయింది. శాస్త్రబలం ఎలా వున్నా, సంప్రదాయం ఆదరణీయం. సంప్రదాయాన్ని గౌరవించేవారు సౌరాష్ట్రుల యీ సంప్రదాయాన్ని గౌరవించడం వాంఛనీయం, ఎవరి

సంప్రదాయాలు వారికి గొప్పవి. కనుక సౌరాష్ట్రులకు ఉపాకర్మాధికారం ఉన్నదనే మా పరిషత్తు అభిప్రాయపడుతున్నది."

"పండిత పరిషత్తు నిర్ణయాన్ని మేము శిరసావహిస్తున్నాము. పరిషత్తు నిర్ణయమే మా నిర్ణయం" అని రాణి స్పష్టం చెయ్యడంతో సభా భవనం హర్షధ్వానాలతో దద్దరిల్లిపోయింది. సౌరాష్ట్రుల సంతోషానికి అవధిలేదు. వారు రాణికి లోలోన తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు.

ఉన్నతాధికారుల మాటలను త్రోసి రాజనడం వాంఛనీయం కాదని నగరాధికారి ప్రభృతులు తమలో తామనుకున్నారు.

హర్షధ్వానాల మధ్య రాణి యిలా ప్రకటించింది." పండిత పరిషత్తు నిర్ణయాన్ని మేము లిఖిత పూర్వకంగా సౌరాష్ట్రి కులపెద్దలకు అంద జేస్తాము."

సౌరాష్ట్రుల సంతోషం పప్పుమీది పులగమే అయింది.

దళవాయి నరసప్పయ్య అనుకున్నంత చివరికి జరిగింది. ఆయన్ని నిరాశ ఆవహించింది.

తంజావూరు పాలకుడు శాహజీ మహారాజు మధుర రాజ్యం మీదికి దండెత్తి వచ్చాడు. కొన్ని పట్టణాలను కూడా ఆయన స్వాధీనం చేసుకున్నాడు.

మిత్రునివలె నటించిన ఆయన అకారణంగా యుద్ధానికి దిగడం రాణికి విచారహేతువయింది. తంజావూరి పాలకునివల్ల ఎప్పటికైనా యుద్ధ ప్రమాదం కలదన్న విషయాన్ని ఆమె గ్రహించకపోలేదు. చారుల వార్తలు కూడా ఆ విషయాన్ని ధృవపరిచాయి. యుద్ధప్రమాదం గురించి దళవాయి అప్పుడప్పుడు ముచ్చటిస్తూనే వున్నాడు. ఆయన చింతాక్రాంతుడై వుండ డానికి అదే కారణమని కూడా ఆమె గ్రహించకపోలేదు. అయినా అంత

త్వరగా తంజావూరు పాలకుడు యుద్ధానికి దిగుతాడని మాత్రం ఆమె ఊహించలేదు. ఒకవైపు విచారం, మరోవైపు నిరాశ ఆమెను పట్టి పల్లార్చాయి. ఇక తన జీవితానికి సుఖం లేదనుకుంది.

రానున్న యుద్ధ ప్రమాదాన్ని ముందుగానే గ్రహించిన దళవాయి యుద్ధ సన్నాహాలలో నిమగ్నుడయ్యాడు. సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించాడు. కండబలం గల యువకులు కొత్తవారిని చేర్చుకుని, వారికి శిక్షణ యివ్వడం జరిగింది. వృద్ధ వీరయోధులు వారికి శిక్షణ యిచ్చారు. ఆశ్వికదళాన్ని అభివృద్ధి చేశాడు. సైనికుల సంక్షేమాన్ని వెయ్యికళ్ళతో చూడసాగాడు. కాని యుద్ధ ప్రమాదాన్ని మాత్రం బహిర్గతం చెయ్యలేదు. యుద్ధభీతి కనక ప్రజలలో కలిగితే, రాజ్యంలో శాంతి లోపిస్తుందని ఆయన అలా ప్రవర్తించాడు. ఎప్పటికప్పుడు తంజావూరి వ్యవహారాలను రహస్య వార్తాహరులద్వారా తెలుసుకుంటూ తదనుగుణంగా వ్యవహరించసాగాడు; వ్యూహ రచన చెయ్యసాగాడు.

తమ రాజ్యానికి చెందిన కొన్ని పట్టణాలు తంజావూరు పాలకుని స్వాధీనమైన వార్త తెలిసిన ఆ రోజు రాత్రి రాణి, దళవాయిలు రహస్యాలోచన మందిరంలో చాలాసేపు చర్చించారు. ఆ చర్చలో విజయరంగ చొక్కనాథనాయనయ్య కూడా పాల్గొన్నాడు.

"అమ్మా, నేను నిన్న తమతో మనవి చేసినట్టుగా, మన మంత్రుల్ని ఒక కంట కనిపెట్టి వుండడం చాలా అవసరం."

"మేమూ అలాగే భావిస్తున్నాము."

"చేనుని ఎక్కడైనా కంచె మేస్తుందా, అవ్వా!" విజయరంగ చొక్కనాథుడు ఆశ్చర్యం ప్రకటించాడు.

"కొన్ని సమయాలలో మేస్తుంది బాబూ.... ఎవర్నీ మరీ నమ్మకూడదు." రాణి నవ్వుతూ బదులు చెప్పింది.

"ఘనవారు దుష్టస్వభావులనికాదు నా అభిప్రాయం. కాని యుద్ధ

సమయంలో వారి ప్రవృత్తి ఎలా వుంటుందో చెప్పడం కొంచెం కష్టమే. ప్రభువుల కిదీ ఆశ్చర్యంగా వుండవచ్చు, కాని అప్పుడప్పుడు జరిగే విషయమే యిది...." దళవాయి మాటల్ని ప్రభువు శ్రద్ధగా ఆలకించాడు.

"తమకీ విషయం తెలుసుననుకుంటాను.... శాహజీగారి ప్రధానామాత్యులు బాలాజీపంతుగారు మహాతంత్రజ్ఞులని విన్నాను...."

"మేమూ అలాగే విన్నాము.... మరి, అలాంటి తంత్రజ్ఞుణ్ణి ఆ మహారాజుగారు ప్రధనామాత్య పదవిలో ఎలా వుంచారో మాకు బోధపడడంలేదు."

"నాకు తెలిసినంతవరకూ బాలాజీ పంతుగారు సర్వసమర్థులు!...."

"అంటే, మీ అభిప్రాయం!"

"మరేంలేదు. ఆయన శక్తిసామర్థ్యాలలో నాకెలాంటి సందేహమూ లేదు. కాని యుద్ధసమయంలో ప్రలోభాలకు పాల్పడడానికి కొందరు ముందు వెనుకలు చూడరు. అటువంటి సమయాలలోనే రాజ్యక్షేమానికి భంగం వాటిల్లుతుంది...."

"ప్రధానామాత్యుడే తంత్రజ్ఞుడైతే, యిక మంత్రుల్ని గురించి తర్కించి లాభమేముంటుంది?" నిట్టూర్చింది రాణి.

"తమరు అంగీకరిస్తే, మనం తంజావూరితో యుద్ధం ప్రకటిద్దాము."

"మీ ధైర్యసాహసాలపట్ల మాకు అణుమాత్రమైనా సందేహంలేదు. మరి, సైన్యం సిద్ధంగా వున్నదంటారా?"

విజయరంగ చొక్కనాథనాయనయ్య దళవాయిని చూశాడు.

"తంజావూరుతో యుద్ధం తప్పదని వూహించి కొంతకాలంగా యుద్ధ సన్నాహాలు చేస్తూనే వున్నాను."

"మీ దూరదృష్టికి మేము గర్విస్తున్నాము."

"ఇది నా విద్యుక్త ధర్మం తల్లీ."

"కనుక సైన్యం సిద్ధంగా వున్నదంటారు."

"అవును తల్లీ."

"అయితే యుద్ధం ప్రకటిద్దాము. మీకు తోడుగా, మీకు నచ్చిన దండనాథుల్ని తీసుకువెళ్ళండి."

"యుద్ధం తప్పదా ?" అమాయకంగా ప్రశ్నించాడు విజయరంగ చొక్కనాథనాయనయ్య.

"తప్పదు బాబూ."

"ప్రభువులు కూడా యీ చర్యలో పాల్గొనడం నా కెంతో సంతోషంగా వుంది" అన్నాడు దళవాయి.

"పాల్గొనడమే మంచిది. రేపటినుంచీ రాజ్యభారాన్ని మోయవలసింది ప్రభువేగదా !" రాణి మనవడి తల నిమురుతూ అంది.

"ఇలాంటి దళవాయిగారు పక్కనుంటే మాకేం భయం !"

"అవును బాబూ, నువ్వన్నదీ అక్షరాల నిజం. మన దళవాయిగారు స్వామిభక్తులు. సాహసోపేతులు...."

"తను వుప్పు తింటున్న నేను మరోవిధంగా ప్రవర్తిస్తే, అది మహాపచారమవుతుందీ.... రాజ్యక్షేమందృష్ట్యా దండనాథులు కొందరిని మధురలోనే వుంచడం మంచిదని నా అభిప్రాయం."

"అలాగే కానివ్వండి."

యుద్ధ ప్రకటన జరిగింది.

ప్రజలు అప్రమత్తులై సంచరించసాగారు. ప్రభుత్వం అదనపు పన్నులు విధిస్తుందేమోనని భీతావహులయ్యారు. పన్నులు విధించనున్నారనే వదంతులు కూడా వ్యాపించాయి. సహజంగా దయార్ద్ర హృదయ, ప్రజాభిమానం గల రాణి కొత్త పన్నులేవీ విధించదని స్వామి భక్తులైన ఉన్నతోద్యోగులు వదంతుల్ని ఖండించారు.

మీనాక్షీ సుందరేశ్వరుల్ని పూజించి, దళవాయి నరసప్పయ్య ససైన్యంగా తంజావూరి కభిముఖంగా పయనం సాగించాడు. నగర పౌరులు, ప్రముఖులు దళవాయికీ ఇతర దండనాథులికీ జేజేలు పలికారు.

దళవాయి కొళ్ళిడం నదీతీరం చేరుకున్నాడు. అప్పటికే అవలిగట్టున విడిసిన తంజావూరి సేనలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. మధుర సైన్యాలను చూసి వారు భయభ్రాంతులయ్యారు.

కొళ్ళిడం వెల్లువ పారుతోంది. నదిని దాటడం దుష్కరంగా తోచింది. నదిని దాటితే, తంజావూరు రాజ్యంలోకి ప్రవేశించవచ్చు.

నరసప్పయ్య నదీతీరాన చాలాసేపు పచార్లు చేశాడు. ఎక్కడెక్కడ ప్రవాహవేగం తక్కువగా వున్నదో గమనించాడు. సహచరులతో సంప్రదించాడు. దళవాయి నదీతీరాన పచార్లు చెయ్యడం గమనించిన తంజావూరు దండనాథులు ఆయన్ని పరిహసించారు. వెల్లువతో ఉరవళ్ల తొక్కుతున్న నదినిదాటి, ఆయన తంజావూరు రాజ్యంలో అడుగిడలేడని వారు భావించారు.

ప్రవాహవేగం బాగా తక్కువగా వున్న చోటు గుర్తించి, నరసప్పయ్య ధైర్యంగా నదిలోకి దిగాడు. ఆయన్ని అనుసరించి దండనాథులూ సైనికులూ నవోత్సాహంతో నదిలోకి దిగారు.

నరసప్పయ్య ధైర్యసాహసాలు తిలకిస్తున్న తంజావూరు సైనికులు సంభ్రమాశ్చర్యాలు చెందారు. వారికేమీ తోచలేదు. చూస్తుండగా మధుర వీరయోధులు నదిని దాటి గట్టు చేరుకున్నారు. అది చూసి తంజావూరు వీరులు భయవిహ్వలు లయ్యారు. ఆలోచనాశక్తిని కోల్పోయారు. వైరి వీరులు ముందుకి దూసుకు వస్తుంటే, తమ రాజ్యాన్ని రక్షించుకోవాలన్న భావంకూడా వారికి కలగలేదు. దండనాథులు విశ్చేష్టులయ్యారు. సరిఅయిన నాయకత్వం లోపించింది. ఆ విపత్కర పరిస్థితిలో తంజావూరు సైనికులకు నదిని దాటి మధుర రాజ్యంలోకి ప్రవేశించాలన్న వెర్రి ఆవేశం కలిగింది. నదిని దాటడం సాధ్యమా అనే విషయం వారికి స్ఫురించలేదు. నదిని దాటాలని నిశ్చయించుకున్నారు. నిశ్చయించుకోవడమేమిటి, నదిని దాటడానికి ప్రయత్నించడమేమిటి— ఈ రెండూ ఏకకాలంలో జరిగాయి.

నదిని దాటాలని తంజావూరు సైనికులు నిర్ణయించుకున్నచోటు యుక్తమయింది కాదు. అక్కడ ప్రవాహవేగం ఎక్కువ. తత్ఫలితంగా నదిలో అడుగుపెట్టిన సైనికులు కొందరు నదీప్రవాహంలో పడి కొట్టుకుపోయారు. మరికొందరు కొంతదూరం యీది, ఆ తర్వాత యీదలేక నదిలో మునిగిపోయారు. కొందరు మాత్రమే సురక్షితంగా గట్టు చేరుకోగలిగారు. ఆ ప్రవాహవేగాన్ని తట్టుకోలేక జవనాశ్వాలు సైతం నదిలో మునిగిపోయాయి. సైనికులు హాహాకారాలతో, హయహేషలతో ప్రతిధ్వనించిన ఆ ప్రాంతం మూగవోయింది.

తంజావూరి కదే విపత్సమయం.

అదనుచూసి నరసప్పయ్య మిగిలిన వైరి వీరుల్ని మార్కొన్నాడు. ఆయన ధాటికి వారు నిలవలేకపోయారు. యుద్ధభూమి మృతవీరుల ఖడ్గ కవచాదులతో నిండిపోయింది.

విజయలక్ష్మి నరసప్పయ్యను వరించింది.

ఆ మరుక్షణమే ఆ విజయవృత్తాంతాన్ని ప్రత్యేక వార్తాహరుని ద్వారా మహారాణికి తెలియజేశాడు దళవాయి.

మధురవారి విజయవార్త వినగానే శాహజీ మహారాజు హతాశుడయ్యాడు. తన ప్రధానామాత్యుడు బాలాజీపంతు కుతంత్రమే తన పరాజయానికి ప్రధాన కారణమనుకున్నాడు. ఆయన్ని తగిన విధంగా శిక్షించాలనీ కృతనిశ్చయుడయ్యాడు. అది తెలుసుకున్న బాలాజీపంతు వెంటనే మహారాజుని సమీపించాడు.

"ప్రభువులు మన్నించాలి. మనకు పరాజయం కలిగినందుకు చాలా విచారిస్తున్నాను."

మహారాజు మౌనముద్రను వీడలేదు.

"ఇందులో నా తప్పు అణుమాత్రమైనా లేదు. తగిన నాయకత్వం లేని కారణంవల్ల, మన సైనికులు తొందరపడి నదిని దాటరానిచోట దాటడానికి ప్రయత్నించి ఆత్మత్యాగం చేసుకున్నారు...."

"ఆ విషయం మాకు తెలుసు.... మన పరాజయానికి మీరు పన్నిన కుట్ర కూడా కారణమని మేము భావిస్తున్నాము" మహారాజు ముఖం కందగడ్డ అయింది.

మహారాజుని చూడడానికే బాలాజీపంతు భయపడ్డాడు. "తమరు నన్ను అపార్థం చేసుకోవడం నా దురదృష్టం. ఇందులో నేను పన్నిన కుట్ర యేమీలేదు. మన సైనికుల అనాలోచిత ప్రవర్తనవల్ల యీ పరాజయం కలిగింది...."

ప్రధానామాత్యుని మాటల్ని మహారాజు విశ్వసించినట్లు తోచలేదు. మహారాజుని తృప్తిపరచాలని బాలాజీపంతు యిలా అన్నాడు.

"ఒక్కవారం నాకు వ్యవధి యివ్వండి. ఎలాగైనాసరే నేను మధుర మంత్రుల సహాయంతో మధురవారితో సంధి కుదుర్చుకుని తమ దర్శనం చేసుకుంటాను, నా మాట నమ్మండి...."

మహారాజు ఆయన వంక తీక్షణంగా చూశాడు.

"అవును ప్రభూ—నా మాట నమ్మండి."

మహారాజు ప్రసన్నుడయ్యాడు. "మీరు కోరినట్లు ఒక్క వారంలో సంధి కుదుర్చుకుని రావాలి. లేకపోతే మీకు శిక్ష తప్పదు." శాహజీ కొంచెం కటువుగానే అన్నాడు.

మహారాజు ప్రసన్నుడైనందుకు బాలాజీ పంతు సంతోషించాడు.

నాలుగైదు రోజులలో ఆయన లక్షల రూపాయలు ఎలాగో పోగు చేశాడు. ఆ డబ్బుతో మధుర మంత్రుల్ని తన వశం చేసుకున్నాడు. నరసప్పయ్య తండ్రిని కూడా మంచి చేసుకున్నాడు. వాళ్ళందరూ సంధి ప్రయత్నం చేస్తామని వాగ్దానం చేశారు. రాణిని ఒప్పించే భారం తమదని మాట యిచ్చారు. సంధి కుదిరిందన్న విజయగర్వంతో బాలాజీపంతు తంజావూరు చేరుకున్నాడు.

బాలాజీపంతు చూపిన ప్రలోభానికి తన తండ్రి కూడా వశుడైన

విషయం తెలుసుకుని నరసప్పయ్య నిలువున నీరయిపోయాడు. ఆయన నవనాడులూ క్రుంగిపోయాయి. సైన్యానికి పాల్పడిన తండ్రిని తలుచుకుని లజ్జ చెందాడు. ఆ లజ్జాభరం ఆయన్ని క్రుంగదీసింది. మొగం నలుగురికీ చూపలేకపోయాడు. ఆయన ముఖంలో నెత్తురు చుక్క లేదు. రాణిని దర్శించి తన మనోవ్యథను తెలియజేయాలనుకున్నాడు. కాని ఎలా దర్శించడమా అని మథనపడ్డాడు. తంజావూరు విజయం ఆయనకి సంతోషకారణం కాలేదు. ప్రాణాలను కూడా సరకుసేయక నదిలో దిగిన ఆ ధైర్య సాహసాలు నిష్ఫలములయినందుకు చింతించాడు. తన స్వామిభక్తికి కళంకం వచ్చిందని దుఃఖించాడు. అశ్రుజలం ఇంకిపోయ్యేంతవరకు దుఃఖించాడు. మనస్సు తేలిక పడింది. రాణి దర్శనార్థం అంతఃపురానికి బయలుదేరాడు.

నరసప్పయ్య దుఃఖభారంతో కుమిలిపోవడం చూసిన ఆయన తండ్రి పశ్చాత్తాపం చెందాడు. తనవల్ల తనయుడు అపకీర్తి పాలవుతాడని గ్రహించాడు. ఇప్పుడనుకుని ఏం లాభం? తాను గడ్డి తిన్నందుకు చింతించాడు; లజ్జ చెందాడు. నరసప్పయ్య అంతఃపురానికి బయలుదేరడం గమనించిన ఆయన లోలోన భయపడ్డాడు. రాణివల్ల తన కుమారుడికి పరాభవం జరుగుతుందని శంకించాడు. ఇప్పుడిప్పుడే అంతఃపురానికి వెళ్ళవద్దు-అని చెప్పాలనుకున్నాడు, కాని నోరు మెదపలేకపోయాడు.

నరసప్పయ్య అంతఃపురానికి వెళ్ళాడు.

ఆయన రాకను పరిచారికలు రాణికి తెలియజేశారు.

లజ్జాభరంతో తల వంచుకుని నిలబడిన దళవాయిని చూసీ చూడగానే, "రండి, నరసప్పయ్యగారూ" అంటూ రాణి ఆయన్ని ఆహ్వానించింది. ఆమె ముఖంలో ఎంత ప్రసన్నత! ఆమె మాటలో ఎంత ఆప్యాయత!

రాణి తనపట్ల అంత ఆదరభావం ప్రకటించినందుకు దళవాయి సంతుష్టుడయ్యాడు. ఆమె ఔదార్యాన్ని లోలోన ప్రశంసించాడు.

"అమ్మా, తమ ఆదరాభిమానాలకు నేను అర్హుణ్ణికాను, పెద్దమనసు చేసి యీ భృత్యుణ్ణి క్షమించాలి."

"మీరెంతగా కుమిలిపోతున్నారో నాకు తెలుసు. జరిగినదానికి మీరు విచారించకండి."

"తమది దొడ్డమనస్సు కాబట్టి సరిపోయింది...." నరసప్పయ్య అంటూ వుండగా, విజయరంగ చొక్కనాథనాయనయ్య అక్కడికి వచ్చాడు.

"ప్రభువులు క్షమించాలి" అంటూ దళవాయి ఆసనంనుంచి లేచి, అంజలి ఘటించాడు.

"మా అవ్వగారు మాకు అన్ని విషయాలు చెప్పారు.... మీరు ప్రదర్శించిన ధైర్య సాహసాలు అపూర్వం. మీరు నదిని దాటుతున్న ఆ దృశ్యం యింకా మా కళ్లల్లో మసలుతూనే వుంది...."

"అంతా అమ్మవారి చలవ!"

"ఏమైనా యీ వయస్సులో మీరిలా సాహసించడం అంత శ్రేయస్కరం కాదు....ఇంతకూ ఆ తల్లి మనల్ని చల్లగా చూస్తున్నది." రాణి దళవాయిని ఆదరభావంతో చూసింది.

"ఏం లాభం తల్లీ! మా నాయనగారు యింతటి నైచ్యానికి పాల్పడతారని నేను కలలో కూడా ఊహించలేదు...."

"మొదట్లో విన్నప్పుడు మేమూ మా చెవుల్ని నమ్మలేకపోయాము. మీ నాయనగారెంత స్వామిభక్తులో మాకు తెలియందికాదు. ఆయన సేవల్ని మేము విస్మరించలేము...."

"అదే తల్లీ నా విచారం, బాధ.... తెలియనివారు ప్రలోభానికి పాల్పడితే, అది క్షంతవ్యం...."

"జరిగినదానికి మీరు మరీ బాధపడకండి. మీరెంతగా కుమిలిపోతున్నదీ, మీ ముఖమే చెపుతున్నది...." అని రాణి దళవాయిని అనునయించింది.

"ప్రసక్తి వచ్చినప్పుడల్లా మా అవ్వగారు మిమ్మల్ని గురించి గొప్పగా చెపుతూ వుంటారు."

"ప్రభువులకు నామీద యింత ఆదరభావం వుండడం నా పూర్వ జన్మ సుకృతం....ఏమైనా నన్ను క్షమించాలి మీరు." దీనాతిదీనంగా అన్నాడు దళవాయి.

"నరసప్పయ్యగారూ, మీ స్వామిభక్తిని మీరు నేడు కొత్తగా నిరూపించుకోవలసిన అవసరంలేదు. అది మాకు బాగా తెలుసు. మీవంటి స్వామిభక్తులు కొందరైనా వుండడం వల్లనే, మా నాయకరాజ్యం అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. పొరపాట్లు మానవసహజం. మీరది మరిచిపోయి, భవిష్యత్ కార్యక్రమాన్ని చేపట్టండి. ఇదే మా కోరిక. ప్రభువుల ఆశయం కూడా యిదే...."

"అలాగే తల్లీ."

ప్రభువు రాణి పెద్దమనసు చేసి మన్నించినా, నరసప్పయ్య మాత్రం సంతుష్టుడు కాలేదు. మంత్రుల ప్రవర్తన స్ఫురణకు వచ్చినప్పుడల్లా ఆయన మనస్సు చివుక్కుమనేది. తన తండ్రి ప్రవర్తన ఆయన్ని రంపపుకోత పెట్టింది. సహచరుల్ని-చివరికి కన్నతండ్రిని—వెర్రిగా నమ్మడం తన అవివేక మనుకున్నాడు. అందరినీ సంశయించసాగాడు. తత్ఫలితంగా జీవితం ఆయనకి దుర్భరంగా తోచింది.

శరవేగంతో రోజులూ నెలలూ గడిచిపోతున్నాయి.

ఒకనాటి ఉదయం నరసప్పయ్యగారి భవన ప్రాంగణంలో కర్షకులు వందల సంఖ్యలో గుమిగూడారు. వారు తమ యిబ్బందుల్ని ఆయనకి విన్నవించుకుంటున్నారు.

"దళవాయిగారు చిత్తగించాలి." అంటూ ఒక వృద్ధుడు తమ గోడుని వివరించసాగాడు.

"ఇన్ని సంవత్సరాలుగా లేని యిబ్బంది ఇప్పుడు వచ్చిపడింది.

తమరు దయగల ప్రభువులని తమ వద్దకు వచ్చాము. మా యిబ్బంది తీరిపోగలదనే మా గట్టి నమ్మకం...."

కర్షకుల ఆందోళనను నరసప్పయ్య అవగాహన చేసుకున్నాడు.

"మీ యిబ్బంది యేమిటో చెప్పండి. మహారాణిగారికి విన్నవించి మీకు న్యాయం జరిగేలా చేస్తాను."

"ఆ ఒక్కమాట చాలు. మాకదే పదివేలు. తమకు తెలియందేముంది ? కావేరి తల్లి చలవవల్ల మన రాజ్యం సస్యశ్యామలంగా వుంది. మనం నలుగురికి అన్నదానం చేసే స్థితిలో వున్నాం...."

"ఈమధ్య కావేరికి నీళ్లు సరిగా రావడం లేదని విన్నాము. నిజమేనా ?"

"ప్రభువులన్నది అక్షరాలా నిజం. అది విన్నవించుకోడానికి తమ వద్దకు వచ్చాము."

"ఎందువల్ల నీళ్ళు సరిగా రావడం లేదంటారు ? మీకు తెలిసిన కారణం చెప్పండి" దళవాయి కుతూహలం ప్రదర్శించాడు.

"తమకు తెలిసే వుంటుంది ... మైసూరు మహారాజావారు చిక్కదేవరాయలవారు కావేరిమీద ఆనకట్ట కట్టారట...."

"కట్టారట అంటున్నారు. మీరు చూడలేదా ?"

"నేను చూడలేదు గానీండి, మావాళ్ళు చూశారు" అన్నాడు వృద్ధుడు.

చిక్కదేవరాయలవారు నిర్మించిన ఆనకట్టను చూసిన వృద్ధుడు "ప్రభూ, ఆనకట్టను నేను చూశాను. అందువల్లనే కావేరికి తగినంతగా నీళ్ళు రావడం లేదని మా అభిప్రాయం" అన్నాడు.

"కనుక మేము విన్నది నిజమే నన్నమాట !" అంటూ ఆలోచనా నిమగ్నుడయ్యాడు దళవాయి.

"నేల బంగారమే అయినా, జలాభావంవల్ల వచ్చిని పైర్లు మాడి

పోతున్నాయి. వర్షాలేమో సరిగ్గా లేవు. అందువల్ల మా కృషి అంతా బూడిదలో కలిసిన పన్నీరవుతోంది."

"నిజమే మరి, మనకు వేరే నీటివసతి లేదు. మనం మొదటినుంచీ కావేరి తల్లిని నమ్ముకున్నాం. వానలేమో సకాలంలో కురవడం లేదు. నిజంగా యిది మనకు సమస్యే" దళవాయి సానుభూతి ప్రదర్శించాడు. సమస్యా పరిష్కారం ఆయనకి ప్రధాన సమస్యగా తోచింది.

"ప్రభువులకు అన్ని విషయాలు తెలుసు. ఇక మేము చెప్పవలసింది ఏమీ లేదు."

"ఈ విషయం తెలిసినప్పటినుంచీ నేనూ ఆలోచిస్తూనే వున్నాను. ఏం చెయ్యాలమా అని పాలుపోవడం లేదు."

"కావేరిలోకి తగినన్ని నీళ్ళు వదలాలని తమరు చిక్కదేవరాయల వారికి నచ్చచెప్పాలి. మీ శక్తిసామర్థ్యాలు మాకు తెలుసు. ఈ పుణ్యం తమరు మూట కట్టుకోవాలి...."

"మీరన్నది నిజమే. అంత సులభంగా ఆ మహారాజుగారు అంగీకరిస్తారా ? అన్నదే నా సందేహం."

"తమలాంటి ప్రభువులు ఎలాగో ఆయన్ని ఒప్పించాలి. తమరే నిరుత్సాహం చెందితే, మాకు అన్యాయం జరుగుతుంది...."

"మీకు న్యాయం జరిగేలా చూస్తానని మొదటే చెప్పాను గదా !"

"చిత్తం."

"ఈ విషయంలో నేనేమీ నిరుత్సాహం చెందడం లేదు. ఎలా మాట్లాడితే మైసూరు మహారాజుగారు అంగీకరిస్తారా అని ఆలోచిస్తున్నాను. ఆయన చాలా గొప్పవాడు, అన్ని విషయాలు తెలిసినవాడు...."

"ఎలాగైనా మీరే యీ కార్యాన్ని సాధిస్తారని మా నమ్మకం...."

"నామీద మీకంత నమ్మకం వుండడం నా అదృష్టం."

"ఎంత మాటన్నారు ! తమరితో కాకపోతే మేము మరెవరితో మా కష్టసుఖాలు చెప్పుకోగలం ?"

"నేడు మీరిక్కడికి రావడం చాలా మంచిదయింది. మీరు చెప్పగా నేను కొన్ని విషయాలు తెలుసుకోగలిగాను. మీరు పడుతున్న యిబ్బంది లేమిటో తెలుసుకున్నాను."

"ప్రభువులకు తెలుసు. తరతరాలుగా వ్యవసాయంమీద ఆధారపడ్డ వాళ్ళం మేము. కావేరి తల్లి కనక కనికరించకపోతే, మేమూ మా పిల్లలం అవస్థలు పడవలసి వస్తుంది."

"మనమంతా అని చెప్పండి."

"తమరు ప్రభువులు...."

"ఎంత ప్రభువులైనా, మీరు పండించే పంటలమీదే మనమందరం ఆధారపడి వున్నాం. దేశభద్రతకు మేము పాటుపడితే, మీరు దేశశాంతికి కృషి చేస్తున్నారు. తిండితీర్థాలు పుష్కలంగా వున్నప్పుడే దేశంలో శాంతి సుస్థిరంగా వుంటుంది...." అన్నాడు దళవాయి, కర్షకుల్ని ఆదర పూర్వకంగా చూస్తూ.

వచ్చిన కర్షకులు తృప్తి చెందారు. దళవాయి మాటలు వారికి అమృత సేచనంగా కనిపించాయి. ఆయన అనుజ్ఞ తీసుకుని వారు వెళ్ళిపోయారు.

దళవాయి ఆలోచనా నిమగ్నుడయ్యారు. రాణితో ఎంత త్వరగా చర్చిస్తే అంత మంచిదనే నిర్ణయానికి వచ్చాడు.

ఆ సాయంకాలమే ఆయన రాణిని దర్శించారు.

సాయంవేళల్లో అంతఃపుర ఉద్యానవంలో సంచరించడం రాణికి అలవాటు. కనుక ఆమెను ఎవ్వరూ ఆ సమయంలో దర్శించరు. ఒక్కొక్కసారి చెంత పరిచారికలు కూడా ఉండరు.

దళవాయి రాకను పరిచారికల ద్వారా తెలుసుకున్న రాణి అభ్యంతర గృహానికి వచ్చింది. అతి ముఖ్యమైన విషయమేదో ఉంటేగాని ఆ వేళప్పుడు దళవాయి తనవద్దకు రాడని ఆమెకు తెలుసు. మళ్ళీ ఏం ప్రమాదం ముంచుకు వచ్చిందో అని ఆమె ఆందోళన చెందసాగింది.

అభ్యంతర గృహంలోకి రాణి ప్రవేశించడం తరువాయి, దళవాయి ఆమెకు అంజలి ఘటించాడు. "ఈ వేళప్పుడు వచ్చి తమకు యిబ్బంది కలిగించాను" అన్నాడు వినయంగా.

"దేశక్షేమాన్ని అహరహమూ కోరే మీ రాక మాకు యిబ్బంది ఎలా అవుతుంది ?" ఎదురు ప్రశ్న వేసింది రాణి.

"మీ రాకకు కారణమేమిటో చెప్పండి ?" అడిగింది ఆదుర్దాగా.

కర్షకులు తనకు తెలియజేసిన అన్ని విషయాలు తు.చ. తప్పకుండా రాణికి నివేదించాడు దళవాయి.

రాణి ముఖంలో ఆందోళన కనిపించింది.

ఆ పరిసరాలలో మౌనం కొంతసేపు ప్రభుత్వం చేసింది.

"మీరు రావడం చాలా మంచిదయింది. లేకపోతే యీ విషయాలు మా దృష్టికి వచ్చి వుండేవి కావు. పైగా యిది చాలా ముఖ్యమైన విషయం."

"అందుకే తమర్ని వేళకాని వేళలో యిబ్బంది పెడుతున్నాను. కర్షకులు నానా అవస్థలు పడుతున్నారు. పచ్చని పంటలు మాడిపోతే, రాజ్యంలో శాంతి లోపిస్తుంది. శాంతి లోపించకముందే మనం తగుచర్య తీసుకోవడం వాంఛనీయం."

"అవునవును. మీరన్నట్టు తగుచర్య తీసుకోవడం చాలా అవసరం...."

"ఈ విషయంలో నా సలహా...."

"చెప్పండి" రాణి మాటలో వ్యగ్రత కనిపించింది.

"కావేరిమీద ఆనకట్ట కట్టి మనకు జలాభావ సమస్యను కల్పించిన చిక్కదేవరాయలవారు, సామాన్యులు కారు. ఆ ఆనకట్టవల్ల మైసూరు వారికి లాభమెంతో వున్నది. మైసూరు ప్రజలు మనకు శత్రువులు కారు. వారు సుఖంగా వుండవలసిందే. కాని మనకు యిబ్బందులు కల్పిస్తున్న

చిక్కదేవరాయలవారితో యుద్ధానికి దిగడం తప్ప మార్గాంతరం కనిపించడం లేదు...."

యుద్ధమన్నమాట రాణికి నచ్చినట్లు లేదు. ఆమె ఏమీ మాట్లాడ లేదు.

"దళవాయి యుద్ధం తప్ప మరేం మాట్లాడవచ్చని తమరు భావించ వద్దు....

"మీ విషయంలో నా కెప్పుడూ అలాంటి భావం కలగలేదు. ఇక మీద కూడా కలగదు. తమరు కేవలం సైన్యాధ్యక్షులే కాదు: మంత్రులు కూడా.... కాని యుద్ధం అవసరమా అనిపిస్తున్నది...."

"అమ్మా, తమకు తెలుసు. చిక్కదేవరాయలవారు ఉద్దండులు. వారి గొప్పతనం తెలియనివారు వుండరు. ఆనకట్ట కట్టి ఆయన తమ రాజ్యంలోని కర్షకులకు మహోపకారం చేశారు. ఆ మాట నేను కాదనను. ఆయనెందుకో మనమీద వైరభావం వహించినట్లు కనిపిస్తున్నది. అందువల్ల లాభం లేకపోయినా, యిప్పుడు అవస్థలు పడుతున్నది మనం."

"అంతమాత్రం ఆ మహారాజుగారికి తెలియందంటారా ?"

"వైరభావం వహించినప్పుడు యుక్తాయుక్తాలు గ్రహించడం కష్టం తల్లీ."

"మంచిమాట అన్నారు !"

"మనకే కాదు తల్లీ, తంజావూరు వారికి కూడా అవస్థలు తప్పవు. కావేరీ జలాలవల్ల తంజావూరు సస్యశ్యామలమై ధాన్యాగారమనే ప్రసిద్ధి వహించింది."

"నేటి వుదయం మీవద్దకు వచ్చిన కర్షకులు తిరుచిరాపల్లి ప్రాంతం వారన్నారు గదూ !"

"అవును తల్లీ...."

"అయితే, తంజావూరి పాలకుల అభిప్రాయం కూడా తెలుసుకోవడం శ్రేయస్కరంగదా !"

"ఈ మధ్యాహ్నమే ఒక చారుణ్ణి పంపాను తంజావూరికి. ఈ విషయమై అక్కడి కర్షకులు ఏమనుకుంటున్నారో, రెండు మూడు రోజులైనా అక్కడుండి, అన్ని విషయాలూ తెలుసుకురమ్మని గట్టిగా చెప్పాను."

"మంచిపని చేశారు."

"అమ్మా, యిది మన ఉభయ రాజ్యాలకు సంబంధించిన సమస్య."

"ఈ సూక్ష్మాన్ని శాహజీ మహారాజుగారు గ్రహిస్తారనే మా నమ్మకం."

"గ్రహిస్తే, ఉభయులకూ క్షేమం...., తంజావూరికి వెళ్ళిన చారుడు వచ్చిన తర్వాత, అవసరమైతే, నేనే మహారాజుగారిని దర్శించి అన్ని విషయాలూ ఆయనకి నివేదిస్తాను."

"అలాగే కానివ్వండి."

"ఎందుకైనా మంచిదీ, మనం మన ప్రయత్నంలో వుండడం వాంఛనీయం."

"అవును."

"మన అశ్వికదళాన్ని...." దళవాయి చెపుతూ వుండగా, రాణి, "ఈ విధంగానైనా మధుర తంజావూరుల మధ్య సన్నిహిత సంబంధం, మైత్రి నెలకొంటే ఎంత లెస్సగా వుంటుంది!" అంది.

"తమది దొడ్డమనస్సు తల్లీ. తమ అభీష్టం నెరవేరాలనే నా కోరిక కూడా."

"వైవేచ్చ ఎలా వున్నదో!" అంటూ రాణి గవాక్షం ద్వారా బక్క చిక్కిన ఆవులా దర్శనమిస్తున్న వైగైని చూస్తూ కొన్ని క్షణాలు గడిపింది. ఆమె మనోవీధిలో ఎన్నెన్నో భావరథాలు పరుగులెత్తాయి.

"అశ్వికదళమంటూ యిందాక ఏదో చెప్పబోయారు."

"మరేంలేదు తల్లీ. మన అశ్వికదళాన్ని అభివృద్ధి చెయ్యవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ విషయంగా మన రాయసంగారితో యిదివరకే సంప్రదించాను. మంత్రి అచ్చయ్యగారితో కూడా చర్చించాను. అందరూ సముఖంగానే వున్నారు."

"మీ మాటను మే మెన్నడూ కాదనలేదు" మందహాసంచేస్తూ చెప్పింది రాణి.

"అయినా తమతో అన్ని విషయాలూ చెప్పి, తమ ఆమోదం పొందడం నా విద్యుక్త ధర్మం.

రాణి అనుజ్ఞ తీసుకుని దళవాయి వెళ్లబోతుండగా, ద్వారంవద్ద ఒక పరిచారిక నిలబడింది.

"ఏం అగళమ్మా, ఏమిటి విశేషం ?" దళవాయి ప్రశ్నించాడు.

"తమ దర్శనార్థం తంజాపూరు ప్రధానామాత్యులవారు వేచి వున్నారు...."

"వచ్చి చాలాసేపయిందా !"

"ఇప్పుడే వచ్చారు."

వెళ్ళబోయిన దళవాయి తిరిగి లోపలికి వచ్చాడు.

అళగమ్మ తెచ్చిన వార్తను రాణికి నివేదించాడు.

"చూశారా దళవాయిగారూ, వెదకబోయిన తీగ కాళ్లకు తగిలి నట్టుంది" రాణి మాటల్లో ఆశాభావం ద్యోతకమయింది.

"తమరు సిద్ధ సంకల్పులు తల్లీ...."

"ఇల్లలికినంత మాత్రాన పండగ కాదు గదా !"

"మీ సంకల్పబలం నాకు తెలుసు. మీ అభీష్టం తప్పక నెరవేరు తుందనే ఆశ నా కిప్పుడు కలిగింది."

"మంచిదే.... ఇంతకూ ఆయన యీ విషయం గురించి ప్రస్తావించ డానికే వచ్చారని మీరు భావిస్తున్నారా ?"

"సందేహం లేదు తల్లీ.... తమ అనుజ్ఞ అయితే, నేనే ఆయన్ని యిక్కడికి ఆహ్వానించి తీసుకువస్తాను...."

"మేమే ఆ మాట అనాలనుకున్నాం. కాని, ఆయన మీకు అహితుడుగదా అని సందేహించాను."

నరసప్పయ్య చిరునవ్వు నవ్వాడు. "ఎవ్వరూ ఎప్పుడూ హితులు కారు, అహితులు కారు. పరిస్థితుల ప్రభావంవల్ల హితులే, ఒక్కొక్కసారి అహితులవుతారు. ఆ పరిస్థితులవల్లనే అహితులు హితులవుతూ వుంటారు...."

అవునవును— అంటూ రాణి కూడా నవ్వింది.

"అళగమ్మా!"

"అమ్మా."

"మంత్రి అచ్చయ్యగారికి మేము రమ్మన్నామని వెంటనే కబురు పంపాలి."

"అలాగే తల్లీ" ఆమె బాణంలా దూసుకువెళ్ళింది.

నరసప్పయ్య బాలాజీపంతు వేచివున్న మందిరానికి వెళ్ళి ఆయన్ని ఆదరపూర్వకంగా ఆహ్వానించాడు. వెంటబెట్టుకుని ఆభ్యంతర గృహానికి తీసుకువచ్చాడు. దారిలో కుశలప్రశ్నలు వేశాడు. దళవాయి తనపట్ల ప్రదర్శించిన ఆదరాభిమానాలకు ఆయన ముగ్ధుడయ్యాడు. తంజావూరు విజయాన్నిగాని, తాను రహస్యంగా మంత్రులతో నెరపిన రాయబారాన్ని గాని అందువల్ల ఏర్పడిన మనోవ్యథను గాని రవ్వంతైనా గుర్తుకి తెచ్చుకోకుండా నరసప్పయ్య కుశలప్రశ్నలు వెయ్యడం చూసి బాలాజీపంతు ముగ్ధుడయ్యాడు.

ఇద్దరూ అభ్యంతర గృహం చేరుకున్నారు.

మంత్రి అచ్చయ్య అప్పటికే అక్కడికి చేరుకున్నాడు.

కొంతసేపటికి రాణి వచ్చింది. ఆమెతోపాటు విజయరంగ చొక్కనాథనాయనయ్య కూడా వచ్చాడు.

అందరూ సుఖోపవిష్టులయ్యారు.

బాలాజీపంతు రాణికీ, ప్రభువులకూ నమస్కరించి తాను తెచ్చిన నగిషీలు చెక్కిన తంజావూరు పళ్ళెరం, బాలకృష్ణుని దారు శిల్పం మొదలైన వాటిని శాహజీ మహారాజు పక్షాన సభక్తికంగా రాణి సమక్షంలో ఉంచాడు.

బాలకృష్ణుని విగ్రహం ప్రభువుల్ని బహుధా ఆకర్షించింది.

తంజావూరు పళ్ళెరంవైపు తదేకధ్యానంగా చూస్తూ, "మీ తంజావూరి వారు కళాభిజ్ఞులు. శిల్పి ఎవరో కాని, ఈ పళ్ళెరంమీద తన పనితనం లెస్సగా ప్రదర్శించాడు. ఇది ముద్దులు మూట కడుతున్నది. మీ మహారాజుగారికి మా కృతజ్ఞతను తెలియజేయగోరుతున్నాను" అంది రాణి.

"చిత్తం తల్లీ."

మహారాజావారు కుశలమే గదా !"

"బృహదీశ్వరుని దయవల్ల కుశలమే తల్లీ, వారు పంపగా వచ్చాను."

"చాలా సంతోషం."

"ఈ విధంగా తమ దర్శనభాగ్యం కలిగినందుకు నేనెంతగానో సంతోషిస్తున్నాను" అంటూ ఆయన, "ఈ లేఖను మహారాజావారు తమ కిమ్మన్నారు" అని, తాను తెచ్చిన లేఖను రాణి సమక్షంలో ఉంచాడు.

సాదరంగా ఆ లేఖను తీసుకుని రాణి దళవాయి కిచ్చింది.

దళవాయి లేఖను చదివాడు.

"ప్రభువులు కూడా యీ లేఖను పరిశీలించడం మంచిదని నా అభిప్రాయం" అని దళవాయి ప్రభువుల వంక సాభిప్రాయంగా చూశాడు.

విజయరంగ చొక్కనాథనాయనయ్య చిరునవ్వు నవ్వుతూ ఆ

లేఖను అందుకున్నాడు. చదివాడు, లేఖలోని విషయాలు రాణికి తెలియ జేశాడు.

రాణి ప్రత్యుత్తరం కోసం బాలాజీపంతు నిరీక్షించాడు.

"చిక్కదేవరాయలవారు కావేరిమీద అనకట్ట కట్టడంవల్ల, మీరు అవస్థలు పడుతున్నారన్నమాట!" ఏమీ తెలియని దానివలె అడిగింది రాణి.

విజయరంగ చొక్కనాథనాయనయ్య రాణి నుద్దేశించి, "తంజాపురం సంపదల కొటారమని ప్రసిద్ధి గదా!" అన్నాడు.

"అవును ప్రభూ - ధాన్యలక్ష్మి నెలకొన్న చోటు తంజనగరం" అన్నాడు అచ్చయ్య.

రాణి తగిన ప్రత్యుత్తరం యివ్వకపోవడంతో బాలాజీపంతులో సహనం నశించసాగింది, ఆదుర్దా ఎక్కువ కాసాగింది.

"ప్రభువులన్నట్లు తంజనగరం ధనధాన్యాల కొటారమే. కాని చిక్కదేవరాయలవారు కావేరిమీద అనకట్ట కట్టడంతో, మా తంజావూరు రాజ్యం, జలాభావంతో యిక్కట్ల పాలవుతున్నది. కర్షకలోకం పడుతున్న యమయాతనలు వర్ణనాతీతం. కొన్ని గ్రామాలలో త్రాగడానికి మంచినీళ్లు లభించక అవస్థలు పడుతున్నారు...." బాలాజీపంతు దళవాయివైపు చూశాడు.

"ఈ పరిస్థితులవల్ల శాహజీ మహారాజుగారు యుద్ధ సన్నద్ధులవు తున్నారన్నమాట" దళవాయి మాటలు బాలాజీపంతుకి ధైర్యం కలిగించాయి.

"మార్గాంతరం లేదు కనక" అన్నాడు గంభీరంగా.

"మేమూ అదే ఆలోచిస్తున్నాము" అని రాణి అనడంతో బాలాజీపంతు సంతోషానికి మేరలేకపోయింది. ఆ సంతోషంకొద్దీ

అన్నాడు. "ఈ యుద్ధప్రయత్నాలు సమిష్టిగా జరిగితే ఉభయులకూ లాభదాయకమని మా మహారాజుగారు ఆశిస్తున్నారు."

"నిజమే."

"ఇందుకు మహారాణిగారు సుముఖంగా వుండడం మా భాగ్యం."

"మధుర తంజావూరు రాజ్యాలు మైత్రీభావంతో సంచరించాలని మొదటినుంచీ మహారాణిగారు ఆశిస్తూ వచ్చారు. అందువల్ల ఉభయులకు శ్రేయస్సు కలుగుతుందని వారి నిశ్చితాభిప్రాయం. కాని పరిస్థితులు అనుకూలించకపోవడంతో వారి ఆశ నిరాశ అయింది. ఇప్పటికైనా శాహజీ మహారాజుగారు పెద్దమనసు చేసి ఉభయులం సఖ్యభావంతో సంచరించాలని కోరడం ప్రశంసార్హం. నేడు నాకెంతో సంతోషంగా వున్నది" అన్నాడు దళవాయి.

"దళవాయిగారన్నట్లు, మధుర తంజావూరుల మధ్య మైత్రి స్థిరంగా వుంటే, దక్షిణాపథంలో మనకు ఎవరివల్ల ఎలాంటి భయమూ వుండదు."

"అవును తల్లీ."

"చిక్కదేవరాయలవారివల్ల మనమధ్య మైత్రి నెలకొంటున్నందుకు మేమెంతో సంతోషిస్తున్నాము. మా ప్రత్యుత్తరాన్ని మీరు మీ మహారాజు గారికి అందజేయవచ్చు.... అచ్చయ్యగారూ, లేఖ మహారాజుగారికి పంపండి...."

"చిత్తం తల్లీ.

ఈ మైత్రీభావం సుస్థిరంగా వుండాలన్నదే మా అందరి అభిలాష" అన్నాడు అచ్చయ్య.

"మేమూ అదే అభిలషిస్తున్నాం."

"మహారాజావారికి మా హృదయపూర్వక కృతజ్ఞతనూ, నమస్కారములూ తెలియజేయండి" అంటూ రాణీ ఆసనంనుంచి లేచింది.

"చిత్తం తల్లీ." బాలాజీపంతు రాణీవద్ద అనుజ్ఞ తీసుకున్నాడు. "ప్రభువుల దర్శనం కూడా లభించడం నా భాగ్యవిశేషం" అంటూ విజయరంగ చొక్కనాథనాయనయ్యకు నమస్కరించాడు.

మధుర, తంజావూరులలో యుద్ధసన్నాహాలు చురుకుగా జరగ సాగాయి.

ఆ యేడు వానలు కుండపోతగా కురిశాయి. ఎక్కడ చూసినా జలార్ణవమే. ఆ వానలకు కావేరి గట్లు తెంచుకుని ప్రవహించింది. పుట్టలూ గుట్టలూ ఏకమైనాయి. కొన్ని గ్రామాలు వెల్లువలో మునిగిపోయాయి. పూరిళ్లు ఆ వరదలో తేలుతూ పడవలవలె గోచరించాయి. గ్రామప్రాంతాల ప్రజల కడగండ్లకు అంతులేదు.

కావేరిలో వచ్చిన ఆ పెనువరదకు చిక్కదేవరాయలు కట్టిన ఆనకట్ట ధ్వంసమైపోయింది.

మధుర, తంజావూరు పరిపాలకులు యుద్ధప్రయత్నాలు విరమించు కున్నారు.

యుద్ధభీతి తొలగడంతో ప్రజలకు మనశ్శాంతి లభించింది. ప్రకృతి ఒకవిధంగా మేలు చేసింది, మరోవిధంగా కీడు చేసిందనుకుని వారు సంతృప్తి చెందారు.

## 10

ఆనాడు మధురానగరం అట్టుడికినట్టు ఉడికిపోయింది.

అలుముకున్న యుద్ధమేఘాలు చూసి ప్రజలు భీతావహులయ్యారు. ఏ క్షణంలో ఏ దుర్వార్త అశనిపాతంలా వచ్చి పడుతుందో అని ఆందోళన చెందసాగారు.

భయాందోళనల మధ్య వీరవరేణ్యుల కుటుంబాలు నలిగి నల్లేరవు

తున్నాయి. యుద్ధమంటేనే వారికి విరక్తి కలిగింది. ఒక సందులో యిద్దరు వీరవనితల మధ్య సంభాషణ సాగుతోంది.

"ఏమి యుద్ధాలో యేమిటో, మన ప్రాణాలు పోతున్నాయి."

"నువ్వు చెప్పింది నిజమేనమ్మా. కాని మనకు తప్పదు యీ బాధ. రోట్లో తలదూర్చిన తర్వాత రోకటిపోటుకి వెరిస్తే ఎలా ?

"తెలీక అడుగుతున్నా పిన్నీ, ఎవరీ సేతుపతి ? తంజావూరు మహారాజునీ, మైసూరు మహారాజునీ విన్నాగానీ, యీ సేతుపతి పేరు నేను వినలేదు."

"తంజావూరు మైసూరు రాజులులా సేతుపతిగారూ ఒక రాజుగారే. మన మధురకు దక్షిణంగా రామనాథపురం వుంది.... పోనీ యీ పేరైనా విన్నావా ?"

"రామనాథపురం పేరు విన్నాను. మా బంధువులెవరో అక్కడున్నట్టు అప్పుడప్పుడు మావారు చెపుతూ వుంటారు."

"రామనాథపురాన్ని పరిపాలించే రాజుల్ని సేతుపతులని పిలుస్తారు."

"సేతుపతి అంటే ?"

"రామనాథపురం రాజధాని కాకముందు, వారి పూర్వులు రామేశ్వరాన్ని ముఖ్య పట్టణంగా చేసుకుని సేతువుని కాపాడుతూ వుండేవారు. అందువల్ల వారిని సేతుపతులని వ్యవహరించసాగారు. వాళ్లనే మరవలని కూడా పిలుస్తారు...."

"ఇదా కథ !"

"సేతుపతులు మొదట్లో మనతో చాలా అన్యోన్యంగా వుండేవారు. ఇప్పుడు మనతో యుద్ధం ప్రకటించారే కిళవన్ సేతుపతిగారు, ఆయన కూడా ఎంతో సఖ్యతగా వుండేవారు."

"పిన్నీ, అడుగుతున్నానని యేమీ అనుకోకు.... కిళవన్ అంటే ముసలివాడని గదా అర్థం ! ఇదేం పేరు ?"

"కిళవన్ సేతుపతి అంటే ముసలి సేతుపతనే అర్థం" అంటూ ఆమె నవ్వింది.

"ఈ ముసలితనంలో ఎందుకు చెప్పు ఆయనకి యుద్ధాలూ అవీను. కృష్ణా రామా అంటూ ఒక మూల కూచోకూడదూ!"

"సరే, నువ్వూ నేనూ అలా అనుకుంటాము. అలా వాళ్లనుకోరు గదా! యుద్ధం చేద్దాం, కొత్తప్రదేశాలు ఆక్రమిద్దాం అనే ఎంతసేపటికీ వాళ్ల ఆరాటం...."

"అదే యీ రాజులతో వచ్చిన గొప్ప చిక్కు. ఉన్నదాంతో తృప్తి పడి వూరుకోరు."

"అలా అయితే వాళ్ళూ మనవంటి సామాన్యుల్లా ఎదుగుబొదుగులు లేకుండా వుండేవారు."

"నువ్వెన్ని చెప్పు పిన్నీ, తృప్తి అంటూ ఒకటి వుండాలి."

"అదిసరే గాని, ఆ కిళవన్ సేతుపతిగారున్నారే, ఆయన ముసలివాడే, కాని మహావీరుడు. పరరాజకేసరి అనే బిరుదు కూడా వుంది ఆయనకి."

"అయితే మహావీరుడన్నమాట!"

"ఏమాటకామాట చెప్పుకోవాలి మనం...."

"ఏమిటది పిన్నీ" కుతూహలంగా అడిగింది.

"ఆయన ఎంత వీరుడో అంత మంచివాడు."

"అలాగా!"

"మన మహారాజుగారు— అంటే మన రాణిగారి పెనిమిటి— చొక్కనాథనాయనింవారు రాజ్యంచేసే రోజుల్లో రుస్తుంఖాననే ఒక సైనికోద్యోగి మహారాజుగారి ఆశ్రితుడై వుండేవాడు. మొదట్లో మంచివాడు గానే వుండేవాడు. వాడికి ఏం పోగాలం దాపురించిందోకాని మహారాజు

గారిని సకుటుంబంగా నిర్బంధించాడని చెపుతారు. ఆ విపత్సమయంలో ఈ కిళవన్ సేతుపతిగారు మహారాజుగారికి ఎంతో సహాయంచేసి ఆయన్ని కాపాడారట! అంతేకాదు, రుస్తుంఖాను ఆళపోతనీ నిష్ప్రయోజకుడని తెలుసుకున్నాక సేతుపతిగారూ మరికొందరు కలిసి అతన్ని హతమార్చారు. మహారాజుగారిని స్వతంత్రుల్ని చేశారు. మన రాజ్య గౌరవాన్ని కాపాడారు...."

"మరి, అంత మంచివాడు యిప్పుడు మహారాణీగారితో ఎందుకు యుద్ధానికి దిగినట్టు?"

"అదే యీ రాజకీయాలలో వున్న విచిత్రం!"

"ఏమి చిత్రమో యేమిటో, మధ్య మనం నలిగి చస్తున్నాము."

"రాజ్యకాంక్ష అంటే ఏమనుకున్నావు మరి! సింహాసనానికి వచ్చినప్పుడే సేతుపతిగారు ముసలివాడు. ఇప్పుడు మరీ ముసలివాడై వుండాలి. అయినా ఆయనకి రాజ్యకాంక్ష తగ్గలేదు. మన రాజ్యంమీద కన్ను వేశాడు, దాని ఫలితం యిది...."

"రాజ్యకాంక్ష వుండవచ్చు, మరి యింకో కారణం ఏమన్నా వుందేమో!"

"మనకేం తెలుస్తుందని అసలు కారణం...."

"మంచి మాటన్నావు పిన్నీ.... నువ్వు నమ్ముతావో లేదో, నిన్న మాపటివేళ దళవాయిగారివద్ద నుంచి కబురు వచ్చింది. అయితే, ముద్దాడుతున్న పాపని నాచేతికిచ్చి ఆయనగారు అలాగే దళవాయిగారింటికి వెళ్లారు...."

"మీ బాబాయిగారూ అంతే, ఎన్ని యుద్ధాలు చూశారో యిప్పటికి! మీనాక్షమ్మతల్లి చల్లగా చూస్తోంది కాబట్టి సరిపోయింది...."

"నువ్వన్నది నిజం పిన్నీ" అంటూ చెవికి దగ్గరగా ముఖంచేర్చి,

"పిన్నీ, దళవాయిగారు యీమధ్య అనారోగ్యంగా వున్నట్లు విన్నాను" అంది.

"నేనూ అలాగే విన్నాను."

"అయితే దళవాయిగారు యీసారి యుద్ధంలో పాల్గొనరా ?"

"యుద్ధం రానంతవరకే అనారోగ్యం! యుద్ధం వచ్చింతర్వాత అనారోగ్యం ఎక్కడికో పారిపోతుంది."

"నీ మాటలు చిత్రంగా వున్నాయి పిన్నీ !"

"ఇప్పుడు నీకలాగే కనిపించవచ్చు. పోను పోను నువ్వే తెలుసుకుంటావుగా !"

"అనారోగ్యం కూడా లెక్క చెయ్యరంటావు !"

"మన దళవాయిగారే కాదమ్మా, ప్రతి యుద్ధవీరుడూ అంతే. అందులోనూ మన దళవాయిగారున్నారే— ఏమాటకామాట చెప్పుకోవాలి-మహావీరులేకాక స్వామిభక్తి పరాయణులు కూడా! అందుకే ప్రతి యుద్ధంలోనూ మనవారే జయిస్తున్నారు...."

"దళవాయిగారిని గురించి మావారూ అలాగే మెచ్చుకుంటారు. ఆయన సైన్యం మొదట్లో నిలుస్తారటగా !"

"అవును, దళవాయిగారు అలా స్వయంగా యుద్ధంలో పాల్గొంటారు కాబట్టే, సైనికులకు కొండంత వుత్సాహం. ఆ వుత్సాహంతో ముందు వెనకలు చూడకుండా వారు పోరాడడానికి సిద్ధపడతారు. పైగా మన దళవాయిగారు కల్లకపటాలు తెలియని బ్రాహ్మడు! ముక్కుకి సూటిగా వెళ్ళే రకం. అందువల్లనే ఆయన మాటంటే రాణిగారికే కాక సైనికులకు కూడా ఎంతో గురి!"

"ఆయనకి విరోధులున్నారటగా మంత్రుల్లో, నిజమేనా !"

"అలా చెప్పుకుంటారు.... ఆ విషయం మనకెందుకులే."

"అవును మనకెందుకు?.... ఆ అమ్మవారి దయవల్ల యీ

యుద్ధంలో కూడా మనమే జయించాలి. అమ్మవారికి పది టెంకాయలు కొడతాను."

"ఏదేం కర్మ! ఇంకా ఎక్కువగానే కొడదాము...."

మధురతో కిళవన్ సేతుపతి యుద్ధం ప్రకటించినప్పటినుంచీ, మధురలో ప్రశాంతత లోపించింది. ఆబాలగోపాలమూ సేతుపతిని గురించి ముచ్చటించుకోసాగింది. యుద్ధమనే మాట తప్ప మరో విషయం ఎవరూ ప్రస్తావించడం లేదు. దళవాయి అస్వస్థుడై వుండడం యీ విషయానికి మరింత ప్రాధాన్యం కలిగించింది. యుద్ధమింకా ఆరంభం కాకపోయినా, యుద్ధవిజయం గురించి రకరకాలుగా చెప్పుకోవడం మొదలుపెట్టారు.

సమర సన్నాహాలలో దళవాయి ఉత్సాహంగా పాల్గొంటున్నాడు. ఆయన ప్రదర్శించే వుత్సాహం ఇతర దండనాథుల్నీ వీరయోధుల్నీ యుద్ధానికి పురిగొలుపుతున్నది. ఎలాగైనా సేతుపతిని జయించి, మధురకు యుద్ధభీతి లేకుండా చెయ్యాలన్నదే దళవాయి ధ్యేయం.

యుద్ధానికి బయలుదేరే ముందు దళవాయి రాణిని సందర్శించే సన్నాహంలో ఉన్నాడు.

"ఈసారికి మరొకరిని పంపవచ్చుగదా యుద్ధానికి, పెద్దవాణ్ణి చెబుతున్నాను" అన్నారు ముసలి తండ్రి.

"మామగారి మాట వినండి. అమ్మాయి పెళ్ళికి ముహూర్తం కూడా పెట్టుకున్నాము గదండీ. పెళ్ళి యేర్పాట్లు యింతవరకూ ఏమీ చెయ్యలేదు. మీరు యీ తరుణంలో దగ్గర లేకపోతే ఎలా చెప్పండి" కర్తవ్యబోధ చేసిందీ కట్టుకున్న భార్య.

"మీ ఆరోగ్యాన్ని మీరు నిర్లక్ష్యంచేస్తే ఎలా చెప్పండి నాన్నగారూ" పెద్దకొడుకు తండ్రికి ఆరోగ్యం సంగతి గుర్తు చేశాడు.

నరసప్పయ్య యేమీ మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వాడు. తండ్రికి పాదాభివందనం చేశాడు. అందరివద్ద అనుజ్ఞ తీసుకున్నాడు.

పూజాగృహంలోని మీనాక్షీ సుందరేశ్వరుల ప్రతిమలకు భక్తి భావంతో నమస్కరించాడు. ఆ జగజ్జననీ జనకులను ధ్యానించాడు. అంతఃపురానికి బయలుదేరాడు.

ఆయన రాకను సైనికుల ద్వారా తెలుసుకున్న రాణి మందిరద్వారం వద్ద నిలబడింది. ఆయన్ని స్వయంగా ఆహ్వానించాలని, చెంత విజయరంగ చొక్కనాథనాయనయ్య నిలబడ్డాడు. దళవాయికి లభించనున్న యీ అపూర్వ గౌరవాన్ని తిలకించేందుకు యితర దండనాథులు మంత్రులు పరిచారికల ద్వారానికి ఇరువైపుల నిలబడ్డారు.

పల్లకిలోంచి నరసప్పయ్య దిగాడు. కొంచెం నీరసంగానే ఉన్నాడు.

రాణి ఎదురువెళ్ళి దళవాయిని సాదరంగా ఆహ్వానించింది.

దళవాయి నయనాలనుంచి అశ్రువులు జారాయి. అవి ఆనందాశ్రువులు!

ఆ అపూర్వదృశ్యం తిలకించిన యితర దండనాథులు ఆనంద పారవశ్యంతో రాణికీ దళవాయికీ జయజయధ్వానాలు చేశారు.

"తల్లీ, నేను తమ భృత్యుణ్ణి...." అంటున్నాడు దళవాయి.

"మీరు మహావీరులు, స్వామిభక్తి పరాయణులు. ఈ రాజ్య గౌరవాన్ని సంరక్షిస్తున్న సాటిలేని దండనాథులు. మిమ్మల్ని గౌరవించడం మమ్మల్ని గౌరవించుకోవడమే...." మందస్మిత వదనయైన రాణి పలికింది.

"దళవాయిగారూ, మీరు చేస్తున్న సేవ విస్మరించరానిది." అన్నాడు విజయరంగ చొక్కనాథుడు.

"ప్రభువుల అనుగ్రహమే నాకు శ్రీరామరక్ష! ప్రభువుల సేవకే యీ భృత్యుడు అంకితమయ్యాడు" అంటూ చేతులెత్తి దళవాయి విజయరంగ చొక్కనాథనాయనయ్యకు నమస్కరించాడు.

అందరూ సభాభవనానికి వెళ్ళారు.

జయ జయధ్వానాలు తగ్గిన తర్వాత, రాణి సభికుల్ని ఉద్దేశించి యిలా అన్నది.

"అస్వస్థులుగా ఉన్నా, మన దళవాయిగారు సేతుపతిగారిని యుద్ధ భూమిలో ప్రతిఘటించాలని కృతనిశ్చయులు కావడం మన భాగ్యవిశేషం. ఆనాడు ముద్దు తిరుమలశౌరినాయనయ్యవారికి దళవాయి రామప్పయ్యగారు ఎలా కుడిభుజంగా వ్యవహరించారో, ఈనాడు దళవాయి నరసప్పయ్యగారు మాకు కుడిభుజమై సంచరిస్తున్నారు. ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం అన్నట్లుగా ఆయన వ్యవహరిస్తున్న విషయం మీకందరికీ తెలిసిందే. నరసప్పయ్యగారి ధైర్యసాహసాలు మనకేకాదు సేతుపతికిగారికి కూడా తెలుసు. అమ్మవారి కరుణా కటాక్షాలవల్ల నరసప్పయ్యగారు క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగి రావాలని మనసార కోరుకుంటున్నాము."

సభికుల హర్షధ్వానాల మధ్య విజయరంగ చొక్కనాథనాయనయ్య దళవాయికి కస్తూరి తాంబూలం నూతన వస్త్రాలు గల వెండిపళ్ళెరం బహూకరించాడు. "మహాప్రసాదం" అంటూ దళవాయి స్వీకరించాడు.

ఆ తర్వాత దళవాయి తన కృతజ్ఞతను వినయపూర్వకంగా తెలుపుకుంటూ, "మీనాక్షీ సుందరేశ్వరుల స్థిరతర కరుణా కటాక్షాల వల్లనూ, ప్రభువుల దయవల్లనూ, మీ యందరి ఆశీర్వాలం వల్లనూ మనం తప్పక జయిస్తామనే నా దృఢవిశ్వాసం. శ్రేయోభిలాషుల ఆశీస్సులే మన వీరవరేణ్యులకు అండదండలు" అన్నాడు.

సభలో మళ్ళీ జయజయధ్వానాలు.

దళవాయి ఆత్మప్రత్యయం అందరికి ధైర్యోత్సాహాలు కలిగించింది.

అంతకుముందు సేతుపతికి విజయప్రాప్తి కావచ్చునని భావించినవారు కూడా తమ పూర్వ నిర్ణయాన్ని మార్చుకున్నారు. జయలక్ష్మీ సమేతుడై దళవాయి తిరిగి రావాలని హృదయపూర్తిగా కోరుకున్నారు.

మధుర సైన్యాలు రామనాథపురానికి తరలి వెళ్ళాయి.

ఉభయ పక్షాలకు యుద్ధం జరిగింది.

నరసప్పయ్య ప్రదర్శించిన ధైర్యోత్సాహాలు చూసి శత్రువీరులు ఆశ్చర్యచకితులయ్యారు; భయభ్రాంతులయ్యారు.

"పంచాంగం బ్రాహ్మడేమిటి ? చండ ప్రచండుడై యుద్ధం చెయ్యడమేమిటి !" అని మొదట్లో నరసప్పయ్యను, సేతుపతి అవహేళన చేశాడు. కాని ఆయన ప్రదర్శించిన ధైర్యోత్సాహాలు చూసి లోలోన ముగ్ధుడయ్యాడు.

మధురనే విజయలక్ష్మి వరించింది.

మధుర సైన్యాలు విజయోత్సాహంతో తిరుగుముఖంపట్టాయి. వారికి మధుర పౌరులు బ్రహ్మరథం పట్టారు.

సేతుపతివల్ల యుద్ధభీతి తొలగిన సంతోషంకొద్దీ ప్రజలు నిశ్చింతగా ఉండసాగారు.

నరసప్పయ్యకు మాత్రం ఎందుకో సేతుపతిమీద కలగవలసినంత నమ్మకం కలగలేదు. ఆయన ఏ క్షణంలోనైనా మధురమీదికి దండెత్తి రావచ్చుననే అభిప్రాయపడ్డాడు. తన మనస్సులోని భయాందోళనలను ఒకనాడు రాణికి స్పష్టం చేశాడు.

"మీరు అనవసరంగా భయపడుతున్నారేమోనని మా అభిప్రాయం."

"లేదు తల్లీ. సేతుపతిగారికి గల రాజ్యకాంక్ష తమకు తెలియందీ కాదు. మన రాజ్యాన్ని కబళించాలనే వుద్దేశంతో ఆయన ఇప్పటికి రెండుసార్లు దండెత్తి వచ్చారు. ఆయన మనకు పక్కలోని బల్లెంలా తయారైనారని నా వుద్దేశం...."

"మీరన్నది ే అనుకోండి. । మొన్నటియుద్ధంలో కలిగిన నష్టం అపారం గదా ! కనుక సేతుపతిగారు యుద్ధసన్నాహాలు చెయ్యరని మా నమ్మకం."

"లేదు తల్లీ. ఆయన యుద్ధ సన్నాహంలో వున్నట్లుగానే సన్న సన్నగా వార్తలు వస్తున్నాయి."

రాణి ఆశ్చర్యపోయింది. "కనుక మేము సేతుపతిగారి విషయంలో పొరబడ్డామన్నమాట !"

"పొరపాటు కాదు తల్లీ. అది ఆయనపట్ల మీకు గల నమ్మకం.... అదీకాక...."

"సందేహించకుండా చెప్పండి."

"ఈమధ్య మనం సేతువుని సందర్శించే యాత్రికులమీద పడవ పన్ను విధించాము గదా...."

"అవును, సేతువుని అభివృద్ధి చెయ్యాలనే వుద్దేశంతో మనం ఆ చర్య తీసుకున్నాం, అది సేతుపతిగారికి నచ్చలేదా ?"

"తమరు ఊహించింది నిజం తల్లీ."

"ఒక్కొక్కసారి మంచిని కూడా అపార్థం చేసుకుంటారు. తాడే పామవుతుందనే సామెత యిదే కాబోలు...."

"సేతుపతిగారు అపార్థం చేసుకున్న విషయం విన్నప్పుడు మొదట్లో నేనూ ఆశ్చర్యపోయాను. ఏదో విధంగా ఆయన మనతో కయ్యానికి దిగాలన్నదీ ఆయన వుద్దేశమని ఆ తర్వాత అనుకున్నాను."

"చూస్తే అలాగే వుంది ! లేకపోతే యీ చిన్నవిషయం యుద్ధ కారణం కావాలా ?" రాణి మాటలో కోపం తొంగిచూసింది. అంతవరకూ ఎంతో ప్రశాంతంగా వున్న ఆమె ముఖంలో ప్రశాంతత మాయమయింది.

దళవాయి యేమీ మాట్లాడలేదు.

"అయితే మళ్ళీ యుద్ధం తప్పదంటారు." ఆగి ఆగి పలికింది రాణి.

"మనం ఎంత వద్దనుకున్నా, యుద్ధం తప్పదంలేదు తల్లీ. మన వీరయోధులకు శక్తి సామర్థ్యాలున్నాయి; తెలివితేటలున్నాయి. స్వామిభక్తి

వుంది. కాని మాటిమాటికి యుద్ధాలు రావడంతో, కొత్తవాళ్ళకి తగినంత శిక్షణ యిచ్చి వాళ్ళని యుద్ధోన్ముఖుల్ని చెయ్యడం కొంచెం శ్రమగానే కనిపిస్తున్నది. ఇదే నా బాధ."

"దేశంలో శాంతిభద్రతలు లోపిస్తే, ఆ తర్వాత పరిస్థితుల్ని అదుపులో వుంచడం చాలా కష్టం."

"అవును తల్లీ....

"అవ్వా" అంటూ విజయరంగచొక్కనాథనాయనయ్య లోనికి వచ్చాడు.

నరసప్పయ్య ఆసనంనుంచి లేచి వినమ్రంగా, "ప్రభువులకు జయం కలగాలి" అన్నాడు, నమస్కరించాడు.

ప్రభువు దళవాయికి నమస్కరించి రాణిచెంత ఆసీనుడయ్యాడు.

మనుమణ్ణి చూడగానే రాణికి ఎక్కడలేని సంతోషం కలిగింది. "ఏమయ్యా, శ్రీరంగంనుంచేనా రావడం" రాణి అడిగింది ఆప్యాయంగా. "యాత్ర బాగా జరిగిందా ? నువ్వు దగ్గర లేకపోవడంతో, ఏమిటో అంతఃపురమంతా చిన్నబోయినట్లు కనిపించింది."

విజయరంగ చొక్కనాథుడు మందహాసం చేసి, "ఇదుగో అవ్వా, తీర్థప్రసాదాలు" అంటూ రాణి చేతిలో వుంచాడు. వాటిని ఆమె సభక్తికంగా స్వీకరించింది, కళ్ళ కద్దుకుంది.

తీర్థప్రసాదాలు దళవాయికి కూడా ఇచ్చాడు. "ప్రభువులకు కృతజ్ఞుణ్ణి. నేను వచ్చిన వేళావిశేషం బాగుంది. కావేటిరంగడి తీర్థప్రసాదాలు లభించాయి" అంటూ కృతజ్ఞతాపూర్వకంగా అందుకుని కళ్ళ కద్దుకున్నాడు.

"అవ్వా, రంగనాథస్వామివారికి అభిషేకాదులు చేయించాను. దివ్యాభరణాలు సమర్పించాను."

"మంచిది బాబూ, స్వామివారి కరుణాకటాక్షాలే మనకు శ్రీరామ

రక్ష! అందులోనూ ఆ స్వామి అభయహస్తం ఎంతో మహిమ కలది. ఆ మహిమను ఎవ్వరూ తెలుసుకోలేరని పెద్దలు చెపుతారు.... అడగడం మరిచిపోయాను. అర్చకులు పూజాదికం సక్రమంగా నిర్వర్తిస్తున్నారా? ఆలయ అధికారులు తమ విధులు చక్కగా నిర్వర్తిస్తున్నారా ?"

"నిర్వర్తిస్తున్నారవ్వా, కాని...."

రాణికి సహనం నశించింది. "కాని అంటున్నావు. లోపాలేమైనా జరుగుతున్నాయా ? దైవకార్యంలో లోపం రావడానికి వీలులేదు బాబూ."

"గత సంవత్సరం మనమిద్దరం స్వామివారిని సందర్శించినప్పుడు, స్వామివారికి మనం సమర్పించిన ఆ ముత్యాలహారం కనిపించలేదు."

"కనిపించలేదా ?" రాణి ఉగ్రురాలయింది. "మరి, అధికారుల్ని అర్చకుల్ని కనుక్కున్నావా బాబూ ?" కోపంగా అడిగింది.

"కనుక్కోలేదు" అమాయకంగా అన్నాడు విజయరంగ చొక్కనాథుడు.

"కనుక్కోలేదా !" అంతులేని ఆశ్చర్యం కలిగింది రాణికి. "పొరపాటు చేశావు బాబూ.... ఎవ్వరినీ ఏమీ కనుక్కోకుండా మళ్ళీ ఆభరణాలు సమర్పించడం మంచిదికాదు బాబూ" రాణి కొంచెం శాంతించింది.

"స్వామివారికి ఆభరణాలు సమర్పించి పొరపాటు చేశానా !" ఆలోచనలోపడ్డాడు విజయరంగచొక్కనాథుడు.

"స్వామివారికి ఆభరణాలు సమర్పించడం పొరపాటు కాదు బాబూ. కాని పోయిన వస్తువులు గురించి విచారించకుండా కొత్తగా దివ్యాభరణాలు సమర్పించడం సమంజసం కాదయ్యా...."

దళవాయి ప్రభువుల్ని ఉద్దేశించి సవినయంగా అన్నాడు. "ప్రభువు లేదో ఆలోచిస్తున్నారు...."

"దైవద్రవ్యం అపహరించడం మహాపాపం కదా! ఆ మాత్రం వాళ్ళకి తెలీదా!"

"ప్రభువులన్నదీ నిజమే. కాని తెలిసే పాపకార్యాలు చేస్తారు కొందరు, కాంచనం గడ్డి తినిపిస్తుంది ప్రభూ."

"దళవాయిగారూ,"

"అమ్మా!"

"దైవద్రవ్యం అపహృతం కాకూడదు. అందుకు గట్టిచర్యలు తీసుకోవడం చాలా అవసరం. ఇది మన తక్షణ కర్తవ్యమని మా అభిప్రాయం."

"నిజమే తల్లీ. ఈ విషయమై మంత్రులతోనూ, ఇతర అధికారుల తోనూ చర్చిస్తాను. దైవద్రవ్యాన్ని అపహరించేవారిని కఠినంగా శిక్షించేలా చూడడం అవసరమనే నేనూ అభిప్రాయపడుతున్నాను.

"మీకు తెలుసుగదా మా పూర్వులూ మేమూ మధురలోని ఆలయాలకే కాక శ్రీరంగం, జంబుకేశ్వరం, తిరునవ్వేలి, ఆళ్వార్, తిరువగిరి మొదలైన పెక్కు దివ్య స్థలాలలోని దేవాలయాలకు విరివిగా దానధర్మాలూ చేశాము. వాటిని సంరక్షించడం మా విధ్యుక్తధర్మం...."

"అవును తల్లీ. ప్రభువులు వస్తుతః దైవభక్తులు. వారీ విషయంలో తగు శ్రద్ధ వహించగలరనే నా నమ్మకం."

"అవశ్యం."

"శ్రద్ధాసక్తులు ప్రదర్శించడంతోపాటు, అవసరమైనప్పుడు ఆలయాధికారుల్ని శిక్షించడానికి కూడా వెనుకంజ వెయ్యకూడదయ్యా. మన పూర్వులు ఎంతో భక్తిప్రపత్తులతో సమర్పించిన ఆభరణాలు, చేసిన ధర్మకార్యాలు చిరస్థాయిగా వుండాలని మా అభిమతం."

"మా పొరపాటు యిప్పుడు అర్థమయిందవ్వా" అన్నాడు విజయరంగ చొక్కనాథుడు.

"చాలా సంతోషం బాబూ.... నిన్ను మందలించాలనే వుద్దేశం మాకెన్నడూ లేదు. నువ్విప్పుడు ప్రభుస్థానంలో వున్నావు. మేము మీ స్థానంలో పరిపాలన సాగిస్తున్నాం. పైగా నువ్విప్పుడు పెద్దవాడివయ్యావు. అన్ని విషయాలూ తెలుసుకుంటున్నావు. ఇంకా తెలుసుకోవాలి. శిక్షార్హుల్ని మాత్రం కనికరించకు. కనికరించావో అరాచకం ప్రబలుతుంది. అరాచకంవల్ల దేశంలో శాంతి లోపిస్తుంది. తత్ఫలితంగా ప్రజలు అసంతృప్తి చెందుతారు. ప్రజల అసంతృప్తి మనకు శ్రేయోదాయకం కాదు...."

రాణి చెప్పిన మాటలను ప్రభువు శ్రద్ధాసక్తులతో విన్నాడు. అలాగే అంటూ మందహాసం చేశాడు. రాణి మనస్సు తేలికపడింది. ప్రభువుకి ఎక్కడ తనమీద కోపం కలుగుతుందేమోనని రాణి భయపడింది.

"ప్రభువులు యిక్కడే వున్నారు కాబట్టి నా మనస్సులోని మాటను చెప్పాలని అభిలషిస్తున్నాను" దళవాయి అన్నాడు.

"చెప్పండి."

"సేతుపతిగారు మళ్ళీ మనతో యుద్ధానికి దిగేలా కనిపిస్తున్నది."

"మళ్ళీ యుద్ధమా !" ఆశ్చర్యపోయాడు విజయరంగ చొక్కనాథ నాయనయ్య.

"ప్రభువులు యిపుడిపుడే రాజ్యవ్యవహారాలు పరిశీలిస్తున్నారు కనుక సేతుపతి యుద్ధసన్నాహ విషయం ఆశ్చర్యంగా తోచవచ్చు ప్రభువులకి. విజయం సాధించేంతవరకు రాజ్యకాంక్షగల పరిపాలకుడు విశ్రమించడు."

"అయితే దళవాయిగారి అభిప్రాయం ?"

"సేతుపతిగారు యుద్ధం ప్రకటిస్తే, మనమూ యుద్ధానికి దిగవలసిందే. మార్గాంతరం లేదు. మన రాజ్యాన్ని వైరి వీరులనుంచి సంరక్షించుకోవడం మన ప్రధాన ధర్మం గదా ! ప్రభువులకి తెలియం దేముంది !"

"అంతేనంటారా ?"

"అవును ప్రభూ, యుద్ధ వ్యయంకింద మన ధనాగారం చాలావరకు వినియోగించబడింది. అది తలచుకుంటే నాకు నిద్రకూడా పట్టడంలేదు."

"ఆ విషయం మీతో మాట్లాడదలచాను. మీరే ఆ విషయం ప్రస్తావించారు. చాలా సంతోషం" అంది రాణి.

నరసప్పయ్య యేదో చెప్పబోతుండగా, రాణి యిలా అన్నది.

"శివలూరు, తడంపట్టి మొదలైన ప్రాంతాలలో మనం నిర్మిస్తున్న సత్రాలు బావిళ్లు బాటలు ద్రవ్యాభావంవల్ల మధ్యలోనే ఆగిపోయినట్లు మొన్న అచ్చయ్యగారు తెలియజేశారు. ప్రజోపయోగకరములైన యీ కార్యాలకు విఘ్నం కలగడం మాకు బాధగా వున్నది."

"అందుకే తల్లీ, నే నొకటి విన్నవించాలని ఆశిస్తున్నాను. తమరు అపార్థం చేసుకోరని నా విశ్వాసం."

"మిమ్మల్ని అపార్థం చేసుకుంటే మమ్మల్ని మేమే వంచించు కున్నట్లవుతుంది" అన్నాడు విజయరంగ చొక్కనాథుడు.

"చిన్నవాడవైనా బంగారంలాంటి మాట అన్నావయ్యా! స్వామి భక్తులైన దళవాయిగారిని సంశయించడమో అపార్థం చేసుకోవడమో కలలోనిమాట.... వారి సలహా సంప్రదింపులవల్లనే మనం చక్కగా రాజ్యం చేయగలుగుతున్నాము."

"నామీద గల అభిమానంతో తమరలా అన్నారుగాని, తాము ప్రదర్శిస్తున్న సమయస్ఫూర్తి, రాజనీతిజ్ఞతల కారణంగా తాము మధురను సంరక్షించగలిగారు; శాంతిభద్రతలు నెలకొల్పగలిగారు. యుద్ధవ్యయం తగ్గేందుకుగాను తంజావూరు పాలకుల సహాయాన్ని అర్థించడం సముచిత మని మొదట్లో అనుకున్నాను...."

రాణి అంత ప్రసన్నంగా తోచలేదు. కంఠస్వరం మారింది. "ఇంతానయం, మీరడగలేదు. ఇంతవరకూ మే మెవ్వరినీ దేహి అని

అడగలేదు. కష్టమో నష్టమో యిన్ని యుద్ధాల వ్యయమూ మేమే భరించాము...."

"దళవాయిగారు యిందాక మొదట్లో అవి అన్నారు. ఇప్పుడు విరమించుకున్నారా మీ ప్రయత్నం" అడిగాడు విజయరంగ చొక్కనాథుడు.

"అవును ప్రభూ. విరమించుకోవడమే మంచిదయింది."

"అలాగా !" విజయరంగ చొక్కనాథునిలో ఉత్కంఠ గోచరించింది.

రాణి దళవాయివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"అవును తల్లీ. సేతుపతిగారు శాహజీ మహారాజుగారి సహాయాన్ని అర్థించారు. సహాయం చెయ్యడానికే ఆయన అంగీకరించారని రూఢిగా తెలుసుకున్నాను."

రాణి నిర్ఘాంతపోయింది. రెండు క్షణాలపాటు ఆమె మౌనం వహించింది.

"రాజకీయ మైత్రి యిలా వుంటుంది !" రాణి నిస్పృహ చెందింది.

"అవును తల్లీ. ఏ క్షణంలో ఎవరు ఎవరి పక్షం వహిస్తారో చెప్పలేము. ఏమయినా, శాహజీ మహారాజుగారిలా చేస్తారని నేను కలలో కూడా అనుకోలేదు."

"ఇలా జరుగుతుందని మేము మాత్రం ఊహించామా ? శాహజీ మహారాజులంటే మాకెంతో ఆదరభావం. ఆయన సాహిత్యంలోనే కాక సంగీతంలో కూడా ఘటికుడు. మహారాష్ట్రుడైనా, తమిళనాడులో పరిపాలన సాగిస్తున్నా తెలుగుభాషా సాహిత్యాలను ఆయన ప్రోత్సహిస్తున్న తీరు చూసి మేమెంతో ముగ్ధులమయ్యాము. స్వయంగా కవులు...."

"తిరువారూరులో నెలకొన్న శ్రీ త్యాగేశుని పరమభక్తులు ఆయన. త్యాగ అనే ముద్రలో ఆయన కీర్తనలు కూడా వెలయించారు. త్యాగ విశ్వేశా, త్యాగ రామనాథా, త్యాగ వైద్యేశా.... యిలా త్యాగ ముద్రతో

ఆయన చేసిన కీర్తనలు మాకెంతో నచ్చాయి" అన్నాడు విజయరంగ చొక్కనాథనాయనయ్య.

"నిజమే ప్రభూ! శాహజీ మహారాజుగారు సంగీత సాహిత్యాలలో ప్రముఖులే. అలాంటి మహారాజు ప్రస్తుతం మనల్ని ప్రతిఘటించాలని సేతుపతి పక్షం చేరడం మన దురదృష్టం. అమ్మవారి కరుణాకటాక్ష లున్నంతవరకూ ఎందరు ప్రతిఘటించినా, మనకు విజయం తథ్యమనే నా నమ్మకం."

"దళవాయిగారూ, మీ ఆత్మప్రత్యయం ఎంతైనా కొనియాడదగిందే. కాని ప్రస్తుతం మీరు అస్వస్థులుగా వున్నారు...."

"అదే మేమూ చెప్పబోయాము" విజయరంగ చొక్కనాథుడు ఆదర పూర్వకంగా అన్నాడు.

"ప్రభువులకు నా మీదగల నమ్మకం నాకు కొత్త వుత్సాహం ప్రసాదించింది. ఆ వుత్సాహంతో నేను యుద్ధభూమికి వెడతాను. ఆ తర్వాత అమ్మవారి దయ" అన్నాడు దళవాయి, తన అనారోగ్యాన్ని లక్ష్యపెట్టకుండా.

దళవాయి ధైర్యసాహసాలు విజయరంగ చొక్కనాథనాయనయ్యను బహుథా ఆకర్షించాయి. ముసలితనం పైబడుతున్నా దళవాయిలో ఉత్సాహం అణుమాత్రమైనా తగ్గలేదనుకున్నాడు. ఆయనంటే ప్రభువుకి అనిర్వచ నీయమైన ఆదరభావం ఏర్పడింది.

దళవాయి ఊహించినట్లుగానే, కిళవన్ సేతుపతి మధురతో యుద్ధం ప్రకటించాడు. శాహజీ మహారాజు సేతుపతికి అండగా నిలిచాడు.

నాలుగేళ్ళక్రితం యుద్ధంచేసి పరాజయం చెందిన సేతుపతి యుద్ధ ప్రకటన చెయ్యడం మధుర పౌరులకు సంభ్రమాశ్చర్యాలు కలిగించింది. దళవాయిపట్ల శత్రుభావం వహించినవారు సేతుపతి తెగువను చూసి ఆయన్ని మెచ్చుకున్నారు. కాని సామాన్య పౌరులేకాదు చాలామందీ

ప్రముఖులు కూడా కంటతడి పెట్టారు యుద్ధోన్మాదుడైన సేతుపతిని తూర్పారపట్టారు.

ఎవరు ఏమనుకున్నా, మధురవారికి యుద్ధం తప్పనిసరి అయింది.

దళవాయి యితర ముఖ్య దండనాథులు మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయానికి వెళ్ళి అమ్మవారినీ అయ్యవారినీ సేవించారు. ఆ తర్వాత రాణి వద్ద, ప్రభువులవద్ద అనుజ్ఞ తీసుకున్నారు.

పౌరులు జయజయధ్వానాలు చేస్తూవుండగా, దళవాయి నరసప్పయ్య నాయకత్వంలో మధుర సైన్యాలు రామనాథపురంవైపు నడిచాయి.

ధైర్యోత్సాహాలతో ఉభయసైన్యాలు యుద్ధం చెయ్యసాగారు.

యుద్ధం మహాభయంకరంగా సాగుతోంది. ఉభయపక్షాలలోను వీరవరేణ్యులు పలువురు వీరస్వర్గం అలంకరించారు.

సేతుపతి సైన్య శిబిరాలలో దుర్వార్త కార్చిచ్చులా వ్యాపించింది. 'దళవాయి నరసప్పయ్యగారు దైవికం చెందారట.'

దళవాయి మరణవార్త వినగానే పట్టపగ్గాలులేని సంతోషం కలిగింది సేతుపతికి. ఆ వృద్ధుడికి నవోత్సాహం కలిగింది. ఇక యుద్ధంలో విజయం తనదే అనుకున్నాడు. తన రాజ్యకాంక్ష తీరిందనుకుని తృప్తిచెందాడు.

మధుర వీరవరేణ్యుల్ని దళవాయిగారి ఆకస్మిక మరణం కలచివేసింది. వారిని నిరుత్సాహం ఆవహించింది. దళవాయి గుణగణాలు తలచుకుని వారు శోకించారు. కోల్పోయిన ధైర్యాన్ని ఎలాగో కూడగట్టుకున్నారు. యుద్ధం సాగించారు.

దళవాయి యుద్ధభూమిలో దైవికం చెందిన వార్త మధురకు చేరింది. నగరం శోకజలధిలో మునిగిపోయింది.

రాణి మంగమ్మ కన్నీరు మున్నీరుగా విలపించింది. ఆమెకు ప్రపంచం అంధకారబంధురంగా గోచరించింది. ఆమె మనస్సు స్తంభించిపోయింది.

ఆ దుర్వార్త విన్నప్పుడు విజయరంగ చొక్కనాథనాయనయ్య దైవధ్యానంలో ఉన్నాడు. వార్త వినగానే నిశ్చేష్టుడయ్యాడు. తండ్రిని కోల్పోయిన తనయునిలా శోకిస్తూ రాణి వద్దకు వచ్చాడు. వెర్రిచూపులు చూస్తున్న ఆమె చెంత ఆసీనుడయ్యాడు, బావురుమన్నాడు. రాణి మనవణ్ణి ఓదార్చింది. వారిద్దరూ నరసప్పయ్య యింటికి వెళ్ళి శోకతప్తులైన దళవాయి కుటుంబ సభ్యుల్ని ఓదార్చారు.

ఆనాడు రాణి పచ్చిగంగ ముట్టలేదు. ఆమె మనస్సు మనస్సులో లేదు. ఎడతెగని ఆలోచనలు. ఒకవైపు స్వామిభక్తుడైన దళవాయి మరణం, మరోవైపు రాజ్యక్షేమం-ఆమె హృదయాన్ని రంపపుకోత పెట్టసాగాయి. నరసప్పయ్య ధైర్యోత్సాహాలను మాటిమాటికి గుర్తు చేసుకుంది. ఆ స్వామి భక్తి పరాయణుని గుణగణాలను స్ఫురణకు తెచ్చుకుంది విలపించింది.

దళవాయి పట్ల రాణికి గల ఆదరాభిమానాలు తిలకించి పరిచారికలు ఆశ్చర్యపోయారు. రాణి అలా దుఃఖించడం వృద్ధ పరిచారికలు కూడా ఎన్నడూ చూడలేదు. చొక్కమ్మ రాణిని ఆశ్వాసించసాగింది. ఆమె ప్రయత్నం ఫలించలేదు.

అంతిమ విజయం సేతుపతికే దక్కింది.

ఆ దుర్వార్తను వినగానే రాణి మూర్ఛపోయింది.

మూర్ఛనుంచి తేరుకున్న తర్వాత తనకు సపర్యలు చేస్తున్న చొక్కమ్మ నుచూసి, "నరసప్పయ్యగారు జీవించివున్నంతవరకూ అపజయ మనే మాట మేము వినలేదు." అంటూ దుఃఖించింది. "ఈ అపజయాన్ని భరించడం ఎలా? మొగలాయీ చక్రవర్తులూ, మైసూరు, తంజావూరు పాలకులు తిరువాంకూరు పాలకులూ మా రాజ్యాన్ని తమ స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించినప్పుడు, ఆయన వారి ఆటల్ని కట్టివేశాడు.... ఆ పుణ్యాత్ముడు చేసిన సేవను విస్మరించలేము...."

"అవును. ఆయన నిజంగా పుణ్యాత్ముడే...." మనవడి మాటలు విన్న తర్వాత, చెంత మనవడు కూర్చున్న విషయం రాణికి తెలియ వచ్చింది.

"ఆయన మహావీరుడే కాక పైకి కనిపించని మహాభక్తుడు కూడా. రంగనాథస్వామివారంటే ఆయనకి అపారమైన భక్తి విశ్వాసాలు. జంబుకేశ్వరుణ్ణి కూడా భక్తితో సేవించేవాడు....ఆయన్ని ఎంత ప్రశం సించినా, యింకా వెలితిగానే వుంటుంది." అన్నాడు విజయరంగచొక్కనాథ నాయనయ్య.

"ప్రభువులు చెప్పింది అక్షరాలా నిజం. ఆనాడు కవిగారు వరస భోజనుతిని అంకితమిస్తూ కొన్ని పద్యాలు చదివారు. అప్పుడు వాటిలోని అర్థగాంభీర్యం అంతగా తెలియలేదు. ఇప్పుడు అర్థమవుతోంది." చొక్కమ్మ అంది.

"జీవించి వున్నప్పుడు వ్యక్తి విలువ తెలీదు చొక్కమ్మా. ఆ తర్వాతనే తెలుస్తుంది అసలు విలువ....గుర్తుంటే ఒక పద్యం చెప్పు. ఆ విధంగా ఆ మహనీయుణ్ణి యిక తలుచుకోవడమే మన కర్తవ్యం." రాణి చొక్కమ్మ వంక చూసింది.

"ప్రభువుల వంటి పండితుల సమక్షంలో పద్యం చదవడానికి సంకోచంగా వుంది."

"చదువు చొక్కమ్మా. పాండిత్యం కంటె భక్తి తాత్పర్యాలే ముఖ్యం...." ధైర్యం చెప్పాడు విజయరంగ చొక్కనాథుడు.

గొంతు సవరించుకుని పద్యం చదవసాగింది. కాని పొంగివస్తున్న దుఃఖం ఆమెను గద్గదకంఠగా చేసింది. చదవడం ఆపి, రెండు క్షణాలు మౌనం వహించింది. ఆ తర్వాత చదివింది.

"శ్రీరంగనాథుని చెన్నొంద మదిలోన
కోరి పూజలుచేసి మీరినావు
జంబునాథస్వామి సద్భక్తి సేవించి
వరములు కొని కీర్తి నిలిపినావు
చెవ్వంది లింగని జేరి సన్నుతు లీవు
గావించి పుణ్యముల్ గాంచినావు
ఎన్ని కార్యములైన ఈడేర్చి ప్రభువుచే
బహుమానములు చాల బడసినావు
ప్రౌఢి, వినయంబు, నేర్పు సంపదల బొదల
పాండ్య రాజేంద్రు క్రీగంట ప్రబలినావు
భాను సమతేజ! దీక్షయ ప్రభు తనూజ!
వరగుణ సమాజ! దళవాయి నరసభోజ!"

"మళ్ళీ చదువు, చొక్కమ్మా....పద్యం వింటుంటే దళవాయిగారిని చూసినట్టుగానే వుంది."

చొక్కమ్మకు కొంచెం ధైర్యం వచ్చింది. మరింత శ్రావ్యంగా చదివింది.

"సాధారణంగా కవులకు అతిశయోక్తులపై మోజు ఎక్కువ. కాని యీ పద్యంలో అతిశయోక్తులే లేవు. సహజ సుందరంగా వుంది." పద్యగత భావాన్ని హృద్గతం చేసుకోసాగాడు విజయరంగ చొక్కనాథుడు.

రాణికి 'పాండ్యరాజేంద్రు క్రీగంట ప్రబలినావు' అనే పాదం బాగా నచ్చింది కాబోలు, ఆ పాదాన్ని పైకి చదివి, "కవిగారు స్వయంగా చూసినట్టు చెప్పారు. నిజానికి దళవాయిగారు పాండ్యరాజేంద్రుని క్రీగంట ప్రబలినవారే...," అని మెచ్చుకుంది.

విజయలక్ష్మిని వరించిన కిళవన్ సేతుపతి మధురతో గల సంబంధాన్ని తెగత్రెంపులు చేసుకున్నాడు. రామనాథపురం స్వతంత్ర రాజ్యమని ప్రకటించాడు కూడా. రామనాథపురం చుట్టుప్రక్కల వున్న కొన్ని ప్రదేశాలను స్వాధీనం చేసుకుని సేతుపతి తన రాజ్యాన్ని విస్తృతపరచుకున్నాడు.

విజయరంగ చొక్కనాథనాయనయ్య స్వయంగా రాజ్యవ్యవహారాలు పర్యవేక్షిస్తున్నాడు. పరిపాలన బాధ్యత పూర్తిగా వహిస్తున్నాడు.

మంగమ్మగారికి యాభైయేళ్లు పైబడ్డాయి. పరిపక్వస్థితికి వస్తున్న పండులా కనిపించింది ఆమె ముఖం. తిలతండుల న్యాయంగా గోచరించింది ఆమె తల. వయస్సు పైబడుతున్నా ఆమె ముఖంలోని కళ తగ్గలేదు. ఆమె నయనాలలోని కాంతి చెక్కుచెదరలేదు. శరీరానికేగాని ముసలితనం మనస్సుకి లేదన్నట్లుగా కనిపించింది. రాజకీయ వ్యవహారాలలో అహో రాత్రం శ్రమించిన ఆమె అంతఃపురంలో తాను నివసించే భవనంలోనే కాలం గడపసాగింది. ఆమెకు చొక్కమ్మ సహర్షంగా సపర్యలు చెయ్య సాగింది. ఆమెకు కూడా వార్ధకం పైబడింది.

పౌరాణికుడు భాగవతం చదువుతున్నాడు. పోతనగారి తేనెలొలికే పద్యాలను పరమ రమణీయంగా చదువుతూ, అవసరమైనచోట్ల వివరిస్తున్నాడు. శ్రద్ధాసక్తులతో రాణి ఆలకిస్తూ వున్నది. మధ్య మధ్య ప్రశ్నలువేస్తూ, ఆమె తన సందేహాలను నివర్తి చేసుకుంటున్నది.

ఒక పరిచారిక వచ్చి ద్వారం వద్ద నిలబడింది.

రాణి తల పైకెత్తి ఆమెవైపు చూసింది.

"అమ్మా, ప్రభువులు తమ దర్శనార్థం వస్తున్నారు."

రాణివద్ద అనుజ్ఞ తీసుకుని పౌరాణికుడు వెళ్ళిపోయాడు. పరిచారిక కూడా వెళ్ళిపోయింది.

కొంతసేపటికి విజయరంగ చొక్కనాథనాయనయ్య వచ్చాడు.

రాణి ప్రభువుని ఆదరపూర్వకంగా ఆహ్వానిస్తూ, "నిన్ను చూసి నాలుగైదు రోజులయిందయ్యా ఇటువైపు రావడం మానివేశావు" అంది.

నూనూగు మీసాల నూతన యౌవనంలో ఉన్న ప్రభువుని చూస్తూ రాణి తన భర్తను గుర్తుకు తెచ్చుకుంది.

"ఏమిటో అవ్వా, రాజ్యవ్యవహారాలు పరిశీలిస్తున్నకొద్దీ, దైవ ధ్యానానికి కూడా తగినంత సమయం లభించడంలేదు. కావ్యపఠనం చేసి చాలా రోజులయింది...."

రాణి చిరునవ్వు నవ్వింది. "నువ్వలా అంటావని నాకు తెలుసునయ్యా. రాజ్యవ్యవహారాలు పరిశీలించడమంటే కత్తిమీద సాము చెయ్యడమే. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. లేకపోతే రాజ్యక్షేమం దెబ్బతింటుంది.... ఏది యెలావున్నా, ఎలాగో తీరిక చేసుకుని యీ అవ్వను రోజుకి ఒక్కసారైనా చూడకపోతే ఎలా చెప్పు ?"

"పట్టుమని పది నిమిషాలైనా దైవధ్యానం చెయ్యకపోతే, నాకు మనశ్శాంతి వుండదు. చిన్నప్పటినుంచీ నాకిది అలవాటని నీకు తెలుసు."

"అవుననుకో. దైవధ్యానం అవసరమే. కాని పరిపాలకుడు ప్రజాహిత కార్యకలాపాలలో ఎంతో శ్రద్ధ వహిస్తూ రాజ్యసంక్షేమం కోసం కృషి చెయ్యడం చాలా అవసరం, లేకపోతే రాజ్యంలో సుఖశాంతులు లోపిస్తాయి. మన పూర్వులకు దైవభక్తితోపాటు ప్రజాహిత చింతనకూడా వుండేది. అందుకే యుద్ధకాలంలో కూడా మన రాజ్యంలో సుఖశాంతులకు భంగం కలిగేదికాదు...."

"నిజమే. కాని నా మనస్సు తీర్థయాత్రా చరణం మీద లగ్నమయింది."

"బాబూ, దేవుడు ప్రతి మనిషిలోనూ వున్నాడు. మనిషి సంతోషిస్తే,

దేవుడు కూడా సంతోషిస్తాడు. ఆలయంలోనే దేవుడున్నాడనుకోవడం పొరపాటని పెద్దలు చెపుతారు...."

"కావచ్చు. కాని శ్రీరంగం, జంబుకేశ్వరం మొదలైన పుణ్యక్షేత్రాలు సందర్శించి రావాలని నా మనస్సు ఆరాటపడుతున్నది...."

మనవడు వితండవాదిగా కనిపించాడు రాణికి. "మరి, రాజ్య వ్యవహారాలు ?" అని ప్రశ్నించింది.

"మంత్రులున్నారుగదా పరిశీలించేందుకు. దేవస్థానాలకు సంబంధించిన వ్యవహారాలనే నేను ముఖ్యంగా పరిశీలిస్తున్నాను."

రాణికి సహనం నశించింది.

"ఎంతపని చేశావయ్యా! రాజోద్యోగులందరూ మంచివారని అనుకున్నావు కాబోలు. దళవాయి నరసప్పయ్యగారి వంటి స్వామిభక్తులు కొద్దిమంది మాత్రమే వుంటారు. ఇది ఎప్పుడూ గుర్తుంచుకో బాబూ."

రాణి పలికిన హితోక్తులు ప్రభువుకి నచ్చినట్లులేదు.

"కస్తూరి రంగయ్యగారిని దళవాయిగా నియమించాం. ఆయన మంచివాడనే మా నమ్మకం." ప్రభువు మాటల్లో రాజదర్పం గోచరించింది.

"ఎవరు! కస్తూరి రంగయ్యగారా!"

రాణి మౌనం వహించింది.

"ఆయన మంచివాడు కాడా ?"

"నియమించేముందు నాతో ఒక్కమాట చెప్పి వుండవచ్చు గదా! అధికార దాహం ఒక్కొక్కసారి మంచివాణ్ణి కూడా పశువుగా మార్చి వేస్తుంది బాబూ...."

"అంటే నా నియామకం సవ్యంగా లేదనేగా మీ అభిప్రాయం." ప్రభువు మాటల్లో యౌవనోద్రేకం గూడుకట్టుకుంది.

రాణి హతాశురాలయింది. తన హితోక్తులు మనవడికి నచ్చలేదని గ్రహించింది. అతనిని ఎవరో పెడదారి పట్టిస్తున్నారని భావించింది. కాని

ఆ విషయం అడగడానికి అదీ అదనుకాదని మౌనం వహించింది. కాని ఆ మౌనం చాలాసేపు ఉండలేదు. మనసులోని గుంజాటనని ఆమె భరించ లేకపోయింది.

"కస్తూరి రంగయ్య ఎటువంటివారో నాకు తెలుసునయ్యా. అవకాశం దొరికితే చాలు, ప్రజల్ని బాధించడానికి ఆయన ప్రయత్నిస్తాడు. అధికారం దుర్వినియోగం చేసేవాళ్ళని ఎప్పుడూ దూరంగా వుంచడం మంచి దయ్యా."

"మీ మంత్రులు అచ్చయ్య, మీనాక్షయ్య ప్రభృతులు సజ్జనులని మీ అభిప్రాయం! అంతేనా?"

"ఎందుకయ్యా అంత వుద్రేకపడతావు? ఉద్రేకం మంచిదికాదు. ఎంత ప్రశాంతంగా ఆలోచిస్తే, అంత మంచిది. రాజ్యవ్యవహారాలు పరిశీలించేటప్పుడు ఉద్రేకానికి చోటివ్వవద్దని మరీమరీ కోరుతున్నాను...."

"అచ్చయ్య ప్రభృతులు సజ్జనులనేగా మీ అభిప్రాయం" మొండిగా అడిగాడు.

"వాళ్ళు సజ్జనులని నేను చెప్పడంలేదు. వాళ్ళని ఎంత దూరంలో వుంచాలో అంత దూరాన వుంచాను. ఒక్క నరసప్పయ్యగారినే నేను అన్ని విషయాలలోనూ పూర్తిగా విశ్వసించాను."

"నేను శ్రీరంగాది దివ్యక్షేత్రాలు సందర్శించడానికి వెడుతున్నాను. అది చెప్పడానికే వచ్చాను."

"రాజ్యవ్యవహారాలను మంత్రులకు వదిలివేస్తే వేళావు. అది నీ యిష్టం. కాని నీవులేని సమయం చూసి కొత్తపన్నులు విధించరాదని మంత్రులకు స్పష్టంగా చెప్పు."

"కొత్త పన్నుల వల్ల మనకే గదా ఆదాయం వచ్చేది."

ప్రభువుల యీ మాటలు వినగానే రాణికి ఏడవాలో నవ్వాలో తెలియలేదు. మనవడు మూర్ఖునిలా ప్రవర్తిస్తున్నట్టు ఆమె భావించింది.

మనవడి మీద కోపం వచ్చింది. అయినా ఆ కోపాన్ని ఎలాగో అణుచుకుంది.

"మనకు లభించేది ఆదాయం కాదయ్యా, అపయశస్సు. దుష్కీర్తి కావాలనుకుంటే పన్నులు విధించమని వాళ్ళతో చెప్పు. నేను చెప్పవలసింది చెప్పాను. ఇక నీ యిష్టం. రాజ్యం నీది. మధ్య నేనెవరిని...."

రాణికి కోపం వచ్చినట్లు విజయరంగ చొక్కనాథనాయకుడు గ్రహించకపోలేదు. రాణిని చురచుర చూస్తూ వెళ్ళిపోయాడు.

ఆ విశాల భవనంలో రాణి చాలాసేపు ఏకాంతంగా ఉండిపోయింది.

విశ్వనాథనాయనయ్య, తిరుమలశౌరి నాయనయ్య మొదలైన తన పూర్వులు శ్రమదమాలకులోనై మూడు పువ్వులారుకాయలుగా చేసిన మధుర రాజ్యం పతనావస్థకు పాల్పడుతున్నట్టు ఆమె భావించింది. ఆ భావం మనస్సులో మెదిలేసరికి, ఆమె గజగజ వణికిపోయింది. నవనాడులూ క్రుంగిపోయాయి. ఒడలంతా చెమటలు పోశాయి. తాను కూర్చున్న ఆసనం కింది నేల కంపించినట్లుగా తలచింది. పరిసరాలన్నీ చీకటి ముద్దలుగా గోచరించాయి. తన పూర్వుల శ్రమ, నరసప్పయ్య వంటి స్వామిభక్తుల శ్రమ.... బూడిదలో కలిసిన పన్నీరు....

ఆ రోజు రాణికి భోజనం సహించలేదు.

చొక్కమ్మ ఎంతో బతిమాలింది. ఆమెను తృప్తిపరిచేందుకు రాణి ఎంగిలి పడింది.

మనవణ్ణి ఎలా దారిలోకి తీసుకురావాలా అని ఆమె చాలాసేపు ఆలోచించింది. ఎంత ఆలోచించినా, సమస్య సమస్యగానే నిలిచిపోయింది.

చొక్కమ్మ తనకు తోచిన సలహా చెప్పింది. కాని అది రాణికి నచ్చలేదు.

దళవాయి నరసప్పయ్యవంటి స్వామి భక్తులు ఆమెకు కనిపించ లేదు.

రాణి తన భవనం విడిచి కదలడం మానివేసింది. గృహ నిర్బంధంలో ఉన్నట్లుగా ఉండిపోయింది. చొక్కమ్మతో మాత్రం అప్పుడప్పుడు మాట్లాడేది. కళ్ళు మూసుకుని కూర్చునేది. అది దైవ ధ్యానమో, ఆత్మపరీక్షో మరేమిటో తెలీదు.

ఒకటి రెండుసార్లు పౌరాణికుడు వచ్చాడు. పురాణ పఠనానికి ఉపక్రమించాడు. కాని రాణి తగినంత ఆసక్తి చూపకపోవడంతో, ఆమెను బాధించడం యిష్టంలేక పురాణ పఠనం ఆపివేశాడు. రాణి ఏదో మనో వ్యథతో సతమతమవుతున్నదని మాత్రం గ్రహించాడు.

విజయరంగ చొక్కనాథనాయనయ్య రాణి దర్శనార్థం రావడం మానివేశాడు.

రోజులు గడుస్తున్నాయి.

రాణి కృశించిపోయింది. శల్యావశిష్టంగా కనిపించింది. ఆమె గుండ్రని ముఖంలోని ఆ ఆకర్షణశక్తి మటుమాయమయింది. కళ్ళల్లోని జీవకళ కరిగిపోయింది. ఆమె మేని కాంతి తరిగిపోయింది. కళ్ళు లోతుకు పోయాయి. వయస్సుని మించిన వయస్సు పైబడినట్లుగా కనిపించింది. తల ముగ్గుబుట్ట అయింది. ఆమెఒకప్పుడు బంగారు బొమ్మగా ప్రసిద్ధి వహించింది. ఇప్పుడు దిష్టిబొమ్మ !

అంతఃపురంలో గుసగుసలు మొదలైనాయి.

"ప్రభువులు రాణీగారిని ఎందుకో సందేహిస్తున్నారట !"

"రాణీగారికి దళవాయి నరసప్పయ్యగారంటే ఎందుకంత అభిమానం !"

"రాణీగారికి గుప్పెడు మెతుకులు కూడా కరవయ్యాయట !"

"రాణిగారిని ప్రభువులు గృహనిర్బంధంలో వుంచారట. అందుకే రాణిగారు బయటకి రావడంలేదు."

"రాణిగారి సంఘసంస్కార ప్రయత్నం ప్రభువులకు నచ్చలేదట."

"రాణిగారి ప్రవర్తన ప్రభువులకు ఏమాత్రం నచ్చలేదట. అచ్చయ్యగారు మాటిమాటికి రాణిగారి భవనానికి రావడం ప్రభువులు స్వయంగా చూశారట!"

ఆ దుర్భాషలు విని కాబోలు రాణికి అన్నద్వేషం కలిగింది. చొక్కమ్మతో కూడా మాట్లాడడం తగ్గించింది. ఎప్పుడూ విరక్త మనస్కగా కనిపించేది. ఆలోచనలే ఆమె లోకం. గతకాలపు స్మృతులే ఆమెకు అన్నపానాలు. నిట్టూర్పులే ఆమెకు నచ్చిన బంధుమిత్రులు!

గవాక్షం చెంత కూర్చుని వైగైనదిని తిలకించడం ఆమె అలవాటు. అది రాత్రివేళ. అలవాటు ప్రకారం ఆమె గవాక్షంచెంత కూర్చుని వైగైని వెర్రిగా చూడసాగింది. ఆ రాత్రిలో ఆమెకు నది లీలగా కనిపించింది. ఆమె మనస్సు వినిపిస్తున్న మాటల మీదికి పోయింది.

"చొక్కమ్మ, యీ కథ విన్నావో లేదో...." అది అళగమ్మ [illegible] రాణి గుర్తించింది. ఆమెకు ఆసక్తి కలిగింది.

"ఏమిటి అళగమ్మా ఆ కథ?"

అళగమ్మ తాను విన్న కథ చెప్పసాగింది. చొక్కమ్మ మధ్య మధ్య ఊఁ కొడుతున్నది.

"నిన్న సాయంకాలం నేను అమ్మవారి గుడినుంచి తిరిగి వస్తుంటే, ఎవరో పరదేశి కాబోలు ఆయన తనచుట్టూ చేరిన వారికి కథ చెబుతున్నాడు.... మైసూరు చిక్కదేవరాయలవారు ఆ మధ్య కాలధర్మం చెందారుగదా. ఆయన చాలా గొప్పవాడు కాని ధనాశ ఆయనకి కొంచెం ఎక్కువని చెప్పుకుంటారు. ప్రతిరోజూ తన ధనాగారంలో కొంచెం డబ్బు

నిలవ చెయ్యంది ఆయనకి నిద్రపట్టేది కాదట! మరణానంతరం ఆ మహారాజుగారు నరకానికి వెళ్ళారట. కొన్నిరోజులు గడిచాయి. ఒకరోజు యమభటులు పొరపాటుగా ఒకతనిని నరకానికి తీసుకు వచ్చారట. అతను మైసూరు పౌరుడు. చేసిన పొరపాటుని తెలుసుకున్న యమభటులు అతన్ని మైసూరుకి పంపివెయ్యాలని నిశ్చయించారు. అప్పుడు చిక్కదేవరాయల వారు తాను నరకంలో లెక్కలేని బాధలు పడుతున్నాననీ, అచిరకాలంలోనే మధురను పరిపాలించే మంగమ్మగారు కాలధర్మం చెందుతారనీ, ఆమె దాననిరతిని వేనోళ్ళ కొనియాడుతున్న దేవలోకవాసులు ఆమెను ఎంతో గొప్పగా సత్కరించాలని అభిలషిస్తున్నారనీ ఆ మైసూరు పౌరుడికి తెలియజేశారట మైసూరుకి తిరిగివచ్చిన ఆ పౌరుడు అన్ని విషయాలూ చిక్కదేవరాయలవారి కుమారుడికి సవిస్తరంగా తెలియజేశాడట. తదాదిగా ఆయన దానధర్మాలు విరివిగా చేసి తండ్రికి స్వర్లోకప్రాప్తి అయ్యేలా ప్రయత్నించాడట.... ఇదమ్మా నేను విన్న కథ...."

చొక్కమ్మ అవుననికాని, కాదనికాని యేమీ మాట్లాడకపోవడంతో అళగమ్మ చొక్కమ్మవైపు చూసింది.

"ఏమిటి చొక్కమ్మా, ఆలోచిస్తున్నావు ?"

"మరేంలేదు, యీ కథకు కాళ్ళూ లేవు, చేతులూ లేవు. ఎవరో కల్పించిన కథ యిది. దీన్ని నమ్మమంటావా ?" అడిగింది చొక్కమ్మ.

"మనం నమ్మినా నమ్మకపోయినా, యీ కథను ఆ పరదేశి చెపుతుంటే నేను నా చెవులతో విన్నాను."

"మైసూరు చిక్కదేవరాయలవారు గొప్ప ప్రభువు, మహావీరులు. ఆయనకి ధనాశ వున్నదో లేదో నేను స్పష్టంగా చెప్పలేను. కాని ఒక్క విషయం మాత్రం స్పష్టంగా చెప్పవచ్చు...."

"ఏమిటది చొక్కమ్మా ?" అళగమ్మ ఎంతో కుతూహలంగా అడిగింది.

"అవడానికి యిది కట్టుకథే అయినా, యిందులో పరమసత్యం వుంది. ఈ కథ కల్పించిందెవరో కాని, అతను మన మహారాణిగారి దానశీలాన్ని చాలా మెచ్చుకున్నాడు. నిజానికి ప్రజల వుపయోగం కోసం మన రాణిగారు ఎన్ని బాటలు వేయించారు, ఎన్ని తటాకాలు త్రవ్వించారు. ఎన్ని సత్రాలూ చావిళ్ళూ నిర్మించారు.... అవన్నీ తలుచుకుంటే మన రాణిగారివంటి మహారాణి మరొకరున్నారా ? అనిపిస్తుంది...."

"నిజం చొక్కమ్మా, నువ్వన్నది అక్షరాలా నిజం.... చొక్కమ్మా! ఏమిటి కంటతడి పెడుతున్నావు ?" ఆదుర్దాగా అడిగింది అళగమ్మ.

"మనవంటి నిర్భాగ్యులకు మిగిలింది యిదొక్కటే...." చొక్కమ్మ చెప్పలేక చెప్పింది. కట్టలు తెంచుకువస్తున్న శోకాన్ని దిగమింగి ఆమె యిలా అన్నది. "అళగమ్మా, రాణిగారిని చూస్తుంటే కడుపు తరుక్కుపోతున్నది. అష్టైశ్వర్యాలు అనుభవించిన ఆ తల్లి యీనాడు ఎంత దీనావస్థలో వుందో గమనించావా ? చూస్తున్నకొద్దీ రాణిగారు నేడో రేపో అన్నట్టుగా కనిపిస్తున్నారు...."

"ఆ మాట అనకు చొక్కమ్మా. నేను భరించలేను...."

చొక్కమ్మ, అళగమ్మల మాటల్ని రాణి మంగమ్మ విన్నదో లేదో !

ఆ మరునాడు శోకదేవత మధుర రాజ్యాన్ని పరిపాలించింది.

